# ఏకవీర

విశ్వనాథ సత్యనారాయణ

రసతరంగిణి : బెజవాడ

కీ॥ శే॥ ప్రబల రామబ్రహ్మానందమునకు

నీ లోన నవసనల్ నించుకొన్న మనీష
పూతావివలె దెసల్ ముంచకుండ
నీ యందు ధీరత నెగడిన దాతృత
యెల్లదిక్కుల ముసు రెత్తకుండ
నీకై సహజమై జనించినట్టి రసోత్
తరమైన లోతులు తడవకుండ
నీ యెడందపసంపు నిల్పు శిల్పజ్ఞ
కృతి మేడ నిటుకలు నతుకకుండ
నైకగుణచిహ్నముల సమాహారమైన
నీ యెడద వాని నిందు నిండించకుండ
నీ యొడలితోడిపాటుగ మా యెదందఁ
గూడఁ జిచ్చిడితివి నన్ని గూఢకోపి!

గురు వయి మిత్రమై తలఁచుకొంటిని నీ రచితంబులౌ కృతి
స్ఫురణల నాకు నంకితము సొంపులునింపులు నింపునంచు నా
సరసము తారుమారయి విషాదపుటుద్ధృతి పుక్కిలింతయై
విరచిత మస్మదంకితము విన్పద నీ యొటనున్న కోసమై?

అల ప్రతిపద్యముఁ జదువునంతకుఁ జంపెదు, విందు, దానియం
దలి ప్రతియక్కరంబు కలనంబును దానఁ బొసంగు నర్థమం
దలి వలనంబు వాని యవినాస్థితి యూరక మెచ్చి మెచ్చి మీ
రలు కవిసార్వభౌము లవురా! యనుచుందువు నేటి కచ్చటో!

నిను మెచ్చఁబోవుచుంటిని
నను మెచ్చుచునుంటి నీవు నను మెచ్చుటతో
డన జీవితంబు పుచ్చితి
నిను మెచ్చగ వేఱుత్రోవ నే నెఱుగమికిఁ.

నా కయి నిల్వాయుండిన దినంబులు నీగతి వెళ్లబుచ్చి యెందో కలియుంగ వీలు కలదో నిను నంచని యూహాసేతు, నీ లోకమునందు పూర్వజనిలో స్మృతియుండదు, నీ వసించు పై లోకపు జీవులందు స్మృతిలో జనిపూర్వత గూడియున్నదో?

# ఏ క వీ ర

## ౧

అదివేసఁగి. వైఁగై నది కృశించి ప్రోషిత భర్తృక వలె సన్నగిల్లినది. ఈ నది పుట్టుటకుఁ గారణముగా మధురా నగరమున సేవించియున్న శ్రీ మీనాక్షీసుందరేశ్వరుల వివాహమునకు సంబంధించిన యొక్క కథ యున్నది. మీనాక్షీ దేవి పాండ్యరాజు కొమరిత. పార్వతీదేవి యవతారము. ఆమె పుట్టిననాటినుండి లోకనాయకుఁడును, నాదిభిక్షువు నగు శ్రీ సుందరేశ్వరునే వరించియున్నది. ఆమె బుద్ధి మరలించుటకు శక్యముకాక రాజుకూడ నామెను సుందరేశ్వరున కిచ్చుటకు సమ్మతించెను. ఆమె యన్నగారి కిష్టమే లేదు. వివాహమునకు శ్రీ సుందరేశ్వరులు తరలి వచ్చినారు. పరివారము లేదు. బందుగులు లేరు. ఆదిభిక్షువు తానొక్కఁడే వచ్చినాఁడు. తనకుఁ దగినట్లుగా నెంతయో పెద్దగా వివాహ ప్రయత్నములు చేసినపాండ్యరాజు నిస్సారపడిపోయెను. చేసిన ప్రయత్నములు చూపి, తెచ్చిన పదార్థములు చూపి యివన్నియు నేమికావలెనని యల్లుని నిందించెను. పరమేశ్వరుడు నవ్వి తన వెంటఁ గొని వచ్చిన యొక కుజ్జువానిఁ జూపి యా పదార్థము లన్నియు నా కుజ్జును భుజించు నన్నాఁడు. అతఁడొక రాక్షసుఁడు. అతని పేరు కుండోదరుఁడు. అతనిలో భగవంతుఁడు క్షుధాగ్ని సహస్ర ముఖంబులుగఁ బ్రజ్వలింపజేసినాడు. కుండోదరుఁడు సకల పదార్థములు నారగించి దాహమని యరవ మధురలోని బావులు చెఱువులు చాలలేదు. కుండోదరునిఁ జేయి పట్టుమని

పరమేశ్వరుఁడు తన శిరోభాగమున భాగీరథీ మహాప్రవాహము నడ్డగించు జటాసమూహములో నొక జట సడలించెను. ఆ రీతిగాఁ బరమేశ్వర జటావివరాగ్రవినిస్సృత యగు గంగానది మధురా సమీపమున వైగై నదియై ప్రవహించినది. పర్వతాగ్రములనుండి ప్రవహించు సెలయేటివలె వైగై మిగులఁ దొందరకత్తె. వైగై యనగా ద్రావిడ భాషలో 'చేయి పట్టుము' అని యర్థము.

ఆనాఁడు కుండోదరుని దాహము కొన్ని బిందువులతో మాత్రము తీర్చిన యీ పుణ్యనది నేడు వేసఁగి కాఁకలకు సగమైపోయినది. వైగై మధురాపురి కొకదిక్కునఁ గందకము వలె నైనది. తక్కిన మూఁడు వైపులఁ గోటగోడయుఁ గందకము నున్నవి. నది నిండుగాఁ బ్రవహించునపుడు చిన్న యోడలు నదిలోఁ దిరుగుచునే యుండును. కొంతవరకా నది పైని వర్తకము కూడ జరుగుచుండును. ఇపుడు నది క్షీణించి యుండుటచేతఁ జిన్నచిన్న పడవలు నది యిసుక తిన్నెలమీఁద నందందు వదలి పెట్టబడి యున్నవి.

వైగై చిన్నపాయగాఁ గొబ్బరినీళ్ళవలె దళతళలాడుచుఁ బ్రవహించుచున్నది. నదికి దిగువభాగమున నొక పెద్దగుండ మున్నది. అది వేసంగిలోఁ గూడ మిక్కిలి లోతుగానే యుండును. ఆగుండములోననే యేనుఁగులను గడుగుదురు. ఈ గుండమునకు పైగా నొకచోట నదిలోననే యొక చిన్న చెఱువు వలె నొక గుంట యేర్పడియున్నది. రాజాంతఃపురములకు నిత్యము మంచినీరు నీ గుంటనుండి మహిషరాజముల మీఁదఁ దోలుతిత్తులతోఁ దీసికొని పోవుచుందురు. ఇంకను నెగువ వర్ష

ర్వపులోఁ బడవలు నిలుచుచోటు: అంతకుఁ బైని బట్టణము నకుఁ జివర భాగమున నిసుకతిన్నెలు మొగలిపుప్పొళ్ళు చల్లి సిద్ధముచేసిన విశ్రాంతిస్థలమువలె నుండును. అచ్చటికి సాయంకాలములయందుఁ బట్టణమునుండి విద్యార్థులు, రాజకుమారులు, పండితులు వచ్చి విశ్రమింతురు. సాంధ్యకాలములయందు విద్యార్థులు సంధ్యావందనములు చేసి శాస్త్రప్రసంగములు చేయుచుందురు. రాచకొడుకులు, వయసుపోకిళ్ళ బిరుదుమగలు తమ యశ్వారోహణవిద్యావైశద్యము జూపుచుందురు. కొంచెము ప్రొద్దుపోయి నంతటనే యందఱును బురప్రవేశము చేయవలయును. నిశాభాగ మెల్లను నాచోట రక్షకభటులు కృపాణపాణులై తిరుగుచుందురు. జాముప్రొద్దు పోయినవెంటనే కోటతలుపులు మూసెదరు. తరువాత నొకప్రాణి లోనుంచి బయటకుఁగాని, బయటనుంచి లోనికిఁగాని పోవుటకు వీలు లేదు.

ఆనాడు కృష్ణచతుర్థి. సందె చీఁకటి. కొంచెము చీఁకటి పడువరకు వైఁగై నదీసికతాతలము లన్నియు నిశ్శబ్దములు, నిర్మానుష్యములు నయ్యెను. కాని దూరమున విశ్రాంతిస్థలములైన యిసుకతిన్నెలమీద నిద్దరుమాత్రము కూర్చుండి మాటలాడుచుండిరి. 'వీరా! నాకేమియు సుఖములేదు. ఆ కార్యము మూన్నాళ్లు నాపిల్ల తలుపుదగ్గర నిలుచుండి నిలుచుండి చివరకుఁ గొంగుపఱచుకొని యఱుగే పండుకొన్నది. నేనామె వంకనైనను జూడలేదు. ఆమెవంకఁ జూచుటకు నాకు బుద్ధి పుట్టలేదు. ఆమెకై చూడవలెనని యెప్పుడేని సంకల్పించితినా నాయెదుట నేను ప్రేమించిన యీ దివ్యసుందరి సాక్షాత్కరించెడిది. ఇప్పుడు

కూడ నదిగో నాయెదుట నా ప్రణయమూర్తి! ఆహాహా!' అని కుట్టాన్ కనులవెంట నీరు పెట్టుకొని యేదో మనోమూర్తిని జూచునట్లుగా శూన్యదృక్కులను జూచెను. వీరభూపతి హృదయము మిక్కిలిఁ జలించినట్లుగా నతనిదేహ మొక వింత కదలిక వెల్లగక్కెను. కొంతసేపైన తరువాత మరలఁ గుట్టాన్ 'వీరా! ఆమె యెంత యందకత్తె. అంత సౌందర్యము భూలోక దుర్లభము. ఆమె దేహాంచలరేఖ లెంత విస్పష్టముగా నున్నవి. దిన దిన మేదో పనిపెట్టుకొని వారియింటికి వెళ్లుచుంటిని. ఆ నెల నాళ్ళు నెంత తొందరగాఁ గడచిపోయినవి. ఇంతలో మాతండ్రి నన్నురమ్మని కబురంపినాడు. నేను వెళ్ళక తప్పదు. నే నే సామాన్య సంసారములోనో పుట్టినచో నా కామె యింతదూర మయ్యెడిది కాదు'అని మఱల కన్నీరు కార్పఁజొచ్చినాడు.

'ఇప్పుడు నీవు మఱల నచ్చటికి పోరాదా?' అని ప్రశ్నించినాడు వీరభూపతి, తన యెడమచేయి యెడమచెక్కిలి కాన్చి, మోచేయి తొడమీఁద నుంచుకొని. కుట్టాన్ — 'నే నెందున్నానో, యెచ్చటనున్నానో, యేరోజున నేమి చేయుచున్నానో నిత్యము నా తండ్రికిఁ దెలియచేయుచుండవలెను గదా! ఈ రాజధానిలో నేను లేకున్నచో నది నిమేషములో రామనాదుకు తెలియును' అని యొక్క నిట్టూర్పు పుచ్చి 'వారియిల్లు మా మేనమామల యింటికి మిక్కిలి సమీపములో నున్నది' అను నర్ధోక్తిలో వీరభూపతి 'అది యేయూరు' అని ప్రశ్నించెను. కుట్టాన్ ఆ మాట విని పించుకొనకుండ, 'నేను మొదట వారి యింటికి వెళ్లుచుండుట వారు నా మంచితన మనుకొనిరి. క్రమక్రమముగాఁ దెలిసిన

కొలది వారికి భయమైనది. నా మేనమామ, యాయన భార్య యీ విషయము తెలుసుకొన్నారు. మా తండ్రికి కబురు వచ్చినది' అని, 'ఛీ! ఛీ! ఈ జన్మ మెందులకు? నా కోర్కె యింత యలభ్యమైనదని తెలిసికూడ నేను బ్రతికియున్నాను చూడు' అని కుట్టాన్ పొంగివచ్చుచున్న దుఃఖమును గొంతులో స్తంభింపఁ జేసెను. ఆ పొంగణఁగనిచ్చి వీరభూపతి 'ఆమె నిన్ను ప్రేమించుచున్నట్లు నీ కేమైనఁ దెలిసినదా' అని ప్రశ్నించినాఁడు. కుట్టాన్: 'అయ్యో!' అని కొంచె మాగి మఱల నిట్లు చెప్ప మొదలుపెట్టెను. 'తంబిచ్చినాయకుఁ డెదురుతిరిగినపుడు మొదట కృష్ణప్పనాయకులవారికి సాహాయ్యము చేసిన చిన్న కేశవనాయకునకు మా తాత కుడిభుజము వంటివాఁడు. అప్పుడాయన చాల పెద్దయాస్తి సంపాదించినాఁడు. మామేనమామకుఁ జాల దొడ్లు, తోఁటలు నున్నవి. వారి యింటికి ముందుగానే మా మామ పెద్దదేవాలయము కట్టించినాఁడు. కాశీనుండి మా తాత విశ్వేశ్వరాచ్ఛలింగము తెచ్చి ప్రతిష్ఠ చేయించకుండఁగనే చనిపోయినాడు. మా మామ యా లింగమునే ప్రతిష్ఠించినాఁడు. ప్రక్కనే స్వామికి 'పుష్పతోఁట' యున్నది. ఆ పిల్ల నదివఱకు నేను రెండు మూఁడుసారులు చూచితిని గాని యామె నన్నుఁజూడలేదు. వారు పెద్ద ధనవంతులు కాకపోయినను గౌరవకుటుంబము. ఆమె యొకనాఁడు 'పుష్పతోఁట'లో పూలు కోసికొని దండగాఁ జుట్టి వచ్చుచున్నది. నే నామెతో 'నెట్లా మాట్లాడునది' యని యెదురు చూచుచుంటిని. కానఁ దొందరగా నామె కెదురుపోయి 'శివద్రవ్యము తీసికొనిపోరా' దంటిని. ఆమె నన్ను పూర్వము నిదానించి చూడలేదుగాని నే నెవరో

యెఱుఁగును. నే నీమాట యనినంతనే నా వంక నిదానించిచూచి భయపడునట్లు కనఁబడినది. నేను చిఱునవ్వు నవ్వితిని. ఆమె మఱల నొక యర్ధనిమేషములోఁ బెదవులపైకి చిఱునవ్వు తెచ్చుకొని యా పూలదండ నాకాళ్ళపై విసరి యచ్చటనుండి పరుగెత్తుకొనిపోయినది. నేను నీకీమాటలు చెప్పుచున్నానేగాని యీ ప్రతివాక్యము నాహృదయమున శూలమువలెదిగఁబడుచున్నది. వీరా! ఎంతనిర్భాగ్యుఁడను; "అపూలదండ"!! కుట్టాన్ మాటాడ లేక పోయెను. వెక్కి వెక్కి యేడ్వ మొదలిడెను. వీరభూపతి యతనిని కౌఁగిటిలోనికిఁ దీసికొని, 'సేతూ! ధైర్యము పురుష లక్షణము. మన భాగధేయములకు మనమా యధికారులము? అయ్యో! ఏడువకుము' అని యోదార్చెను.

కుట్టాన్: 'ఆ పూలదండ తీసికొనిపోద మని నాకు బుద్ధి పొడమెను. కాని వంగి తీసికొనఁబోగా శివద్రవ్య మనిపించినది. ఊరకే యింటికిఁబోయితిని. నా ప్రియురాలి హస్తస్పర్శపొందిన యాదండయే కృతార్థము. ఇంటికి బోయితిని గాని మఱల నా పాదములు నన్నచటికేలాఁగినవి. ఎంతసేపు; అరగడియ కూడఁ గాలేదు. అపూలదండ యచ్చటలేదు. నాహృదయము వినిర్భిన్నమైనది. 'వీరా! ఆ దండబదు లచ్చట నొక త్రాఁచైనఁ బండుకొని యున్నదికాదు. ఆ త్రాఁచును మెడలో వేసికొని యేమై యుందును?' కుట్టాన్ కుడిచేయి వీరభూపతి కుడిచేతినిఁ బట్టుకొనియున్నది. కుట్టాన్ విరభూపతి చేయి నొక్కినాఁడు. కుట్టాన్ దేహమంతయు వణఁకిపోయినది. ఆ చీఁకటిలో వీరభూపతి కుట్టాన్ దురవస్థను గనులార చూచుచుండెను.

వీర—సేతూ! నీ విప్పు డిట్లు దిగులు పొందరాదు. నీవు మఱల వివాహము చేసికొంటివి. ఆమె నీ ప్రాణముల కుస్సు రనును. నీ విప్పుడు నీభార్యను ప్రేమించవలసియున్నది. ఈ ప్రేమ యంతయు నీభార్యపై మరల్పరాదా!".-వీరభూపతి యీమాటలు మనసా అనలేదు. కుట్టాన్ స్థితి యతనికి దుర్భర మనిపించినది. అతని హృదయోద్వేగమున కేదో యొకయడ్డు చెప్పినఁగాని కుట్టాన్ మంచిస్థితికి రాఁడని యతనికిఁ దోఁచి యిట్లన్నాడు. కుట్టాన్ వీరభూపతి యన్న యీ మాట వినినతోడనే, "వీరా! వీరా! ఏ మన్నావు? ఆ ప్రేమ యీమె మీఁది కెట్లు మరల్ప వచ్చును? ఈ వైఁగై నది మా రామనాథ తటాకములోఁ బోయి పడుచున్నది. ఏదీ యీ నదీవేణి నిట్లు త్రిప్పి యింకొక ముఖముగాఁ బ్రవర్తింపఁ జేయుము. నా ప్రేమ నీకంత సులభ సాధ్యమైనదిగాఁ గనఁబడుచున్నదా! కాదు కాదు' అని వంగి యున్న తన దేహమును నిలువుగాఁ జేసి దీర్ఘనిశ్వాసమును విడిచెను. అతని ముఖము గంభీర మయినది. వీరభూపతి కుట్టా నంత వీరుఁడు కాక పోలేదు. కాని యిప్పటి కుట్టాన్ మొగము జూచి వీరభూపతి చలించిపోయెను. వీరభూపతి యతనిని జూచి 'ఇతఁడు దేనికి సమర్థుఁడుకాడు? ఇతఁడు తలఁచుకొనినచోఁ బడిపోయిన విజయనగరసామ్రాజ్యము మఱల సాధించి మధురనాయకులచే నేలించు నేమో' యనుకొనెను.

అప్పుడు వైఁగై యిసుకతిన్నెమీఁద దూరమున నొక సుడిగాలి రేగి, వారి దగ్గరగా నీలవేయుచు బడవలు నిలుచు చోటునకు దాటిపోయినది.

కొంతసేపటిలోఁగుట్టాన్ వదనము మఱల విషాదపూరిత మయ్యెను. వీరభూపతి యింక నుండఁ గూడఁ దని 'పోదమా'

అనెను. కుట్టాన్ —: 'వీరా! ఈ దుఃఖము నా హృదయశోణిత మును ద్రాగుచున్నది. ఈ ప్రేమ నన్ను లోపలలోపలనే తిని వేయుచున్నది. నే నింక చాలనాళ్లు బ్రదుకను.' వీరభూపతి: అశ్లీలములు పలుకకుము' అని 'సేతూ! ఇదియేమి, నేఁ డింత మనసు పేదవైనావు? నీ శౌర్యము, నీ పౌరుషము నేమైనవి?' అన్నాఁడు. దూరమునుండి 'ఎవరక్కడ' యని కేకవినఁబడినది. వీరభూపతి 'కుట్టాన్ సేతుపతి మహారాజు' అని యఱచినాఁడు. దూరమున రక్షకభటుఁడు మఱల మాటాడలేదు. వీరభూపతియుఁ గుట్టానును లేచి పురములోనికిఁ బోవుచున్నారు. కుట్టాన్ వీరభూపతిమీఁద వ్రాలి నడచుచున్నాఁడు. వీరభూపతి నెమ్మదిగాఁ జెవిలో, 'సేతూ! ఇంతధైర్యము వదలెదరా? ఎవరికిఁ దగిన కష్టము వారికి నున్నది. నా హృదయములో నెంత మహాగ్ని రవులుకొనుచున్నది? అది నీకుఁ దరువాతఁ జెప్పెదను' అనెను.

కొంతదూరము పోయినతరువాత నిరువురును విడి విడిగా నడిచిరి. పట్టణపు కోటతలుపువద్ద నశ్వశకటము వేచి యున్నది. ఇరువురు నాశకటములో నెక్కి పట్టణములోనికిఁ బోయిరి. రాజ సౌధములకు సమీపమున నొకపెద్దతోఁట ముందు కుట్టాన్ దిగి వీరభూపతిని వారి యింటివద్ద దింపి రమ్మని బండివానితోఁ జెప్పి తానింటిలోనికిఁ బోయెను.

౨

కుట్టాన్ ఇరువంకల వివిధములైన పుష్పఫలవృక్షము లున్న బాటవెంట తన సౌధములోనికిఁ బోయెను. ఆ సౌధము తన తండ్రిది. రాజ్యములో నున్న పెద్దపెద్ద సరదారు లందఱకు

మధురలోఁ బ్రత్యేకముగ నంతఃపురము లున్నవి. కుట్టాన్ తండ్రి శశైక దేవ ఉదయన్ సేతుపతి; ముత్తుకృష్ణప్ప నాయక మహారాజులుంగారి ప్రధాన మంత్రులలో నొక్కఁడు. ఉదయన్ సేతుపతి యీ సౌధము మధురలో నున్న గొప్పకట్టడములలో నొకటి. మీనాక్షీ దేవాలయములో నెంత శిల్ప మున్నదో యీ సౌధమునను నంత శిల్ప మున్నది. చీఁకటిలో శిల్పపరీక్ష సాగదు.

కుట్టాన్ లోనికిఁ బోయినంతనే సేవకుఁ డొకుఁడేంచ్చి, 'ప్రభూ! స్నానమునకు నీరు సిద్ధముగా నున్నది' అనెను. కుట్టాన్ తనగదిలోనికిఁ బోయెను. అందుఁదాను ప్రవేశించుట తోడనే యెదురుగా నున్న నిలువుటద్దములోఁ దన మూర్తి తనకు గోచరించెను. మొగ మంతయు బాష్పకలుషితమై యుండెను. గదియంతయు దీపముల వెలుతురుచేత ధగద్ధగాయమానముగనుండెను. కుట్టాన్ పైయుత్తరీయముదీసి తన కెడమ వైపుననున్న గోడపైఁ జిలుకకొయ్యకుఁ దగిలించెను. ఆ చిలుక కొయ్య యొక గొప్ప మరకతోపలముతోఁ జేయఁబడినది. దాని చిలుకతనము కన్నులుగాను, ముక్కుగాను నేర్పరుపఁబడిన మూఁడుమాణిక్యములతో సంపూర్ణ మయ్యెను. ఇట్టి చిలుక కొయ్యలు గదిగోడకు నాల్గువెపులను గలసి యెనిమి దేర్ప రుపఁబడి యున్నవి. గోడలయందు ద్రావిడశిల్పమునకు బ్రధాన చిహ్నములయిన గోష్ఠపంజరము లున్నవి. ఒక గోష్ఠపంజరములో ద్రావిడభాషలో శ్రీరామచంద్రుని చరితామృతము ప్రవహింపజేసిన కంబన్న విగ్రహము రాతితోఁ జెక్కిన దమర్పఁ బడియున్నది. దాని కెదురుగాఁబశ్చిమదిక్కుడ్యమునం దమర్పఁ

బడిన మఱొక గోష్ఠపంజరములో శ్రీకృష్ణదేవరాయల వారు శ్రీవిశ్వనాథనాయకులవారికి మధుర నిచ్చుచున్నట్లుగాఁజెక్కఁబడిన రెండు శిల్పపువిగ్రహము లమర్పఁబడి యున్నవి. దక్షిణపు వైపున నొక చిన్న యరుగు రాతితోఁ జెక్కఁబడి యున్నది. దానిపైని మెత్తని రత్నకంబళము లమర్పఁబడియున్నవి. ఆ యరుగున కెదురుగా నొక చిన్నచిత్తరువు గోడకానించఁబడి యున్నది. ఆ చిత్రము పెద్దన్నగారిది. వీరభూపతి యీ చిత్రమును వ్రాసి కుట్టాన్‌కు బహుమతిగా నిచ్చెను. కుట్టాన్ అంగీయూడఁదీసి యింకొక చిలుకకొయ్యకుఁ దగిలించి యీవితర్దిపై గూర్చుండి పెద్దనగారి చిత్రమువైపుచూచుచుండెను. కొంచెము సేపుండి లేచి తన పుస్తకము లున్నచోటికిఁ బోయెను. కంబ మహాకవి విగ్రహమున కిరుప్రక్కల నొకవైపున తమిళభాషా గ్రంథములును, నొకవైపున నాంధ్రసంస్కృతగ్రంథములును మెఱుఁగెక్కించి, నగిషీచేయఁబడిన సన్నని యెత్తయిన బల్లలపై నమర్పఁబడియుండెను. అన్నియుఁ దాటాకులమీఁద వ్రాసిన గ్రంథములే.

కుట్టాన్ తా నెందుల కా పుస్తకము లున్నచోటికి వచ్చెనో తెలిసికొనలేక పోయెను.

ద్వారమునుండి 'ప్రభూ! స్నానము చేయుఁడి' యని ధ్వనివచ్చెను. కుట్టాన్ గది వదలిపెట్టి స్నానమునకుఁబోయెను.

ఆ మహాసౌధమునకుఁ బశ్చాద్భాగమున నాల్గు పోకబోదెల నడుమ కొంచె మెత్తయిన చంద్రకాంతపురాతిపై కుట్టానాసీనుఁడాయెను. ఇరువురుసేవకులు రెండుపెద్దబిందెలలో నొక దానినిండ వేడినీరును, మఱొకదానినిండఁ జన్నీళ్ళను తెచ్చి

యతనికి నీరుపోసిరి. స్నానముచేసి కుట్టాన్ దేహము తుడుచు కొనుచుండెను. (అతఁడు తుడుచుకొనుట లేదు. సేవకులే తుడుచుచుండిరి. ఇది రాజాచారము) అప్పుడే చంద్రుఁ డుద యించుచున్నాఁడు. మంచిగంధపుఁబొడిచే సమ్మిశ్రితమైన సున్ని పిండిచేత రుద్దిన యతని దేహము కమ్మని వాసన లతనికే చాల యానందము కలిగించెను. ఇంకొక సేవకుఁడు కస్తూరి కలిపిన యొక కమ్మని నూనె చేతులకు రాచుకొని యతని తలవెండ్రుు కలకు రాచెను. ఈ కమ్మని వాసనలచేతను, ఉదితచంద్రకిరణ శైత్యముచేతను కుట్టాన్ మనస్సు కలఁక దేరినట్లయ్యెను.

భోజనముచేసి కుట్టాన్ సౌధపురోభాగమున నున్న మంటపములోఁ గూర్చుండెను. దాక్షిణాత్యశిల్పము పల్లవుల నాఁటికన్న చోళులనాఁటికిఁ, జోళులనాఁటికన్న విజయనగర రాజులనాఁటికి నంతకంత కభివృద్ధి పొందుచు వచ్చినది. తంజా వూరు మధురాపురముల శిల్పమును దాక్షిణాత్య శిల్ప చరిత్రలో విజయనగరశిల్పమునుండి విడఁదీయరు. తంజావూరు మధురల శిల్పము విజయనగర శిల్పముకన్న నెక్కువ వృద్ధి పొందిన దని చెప్పవచ్చును. మన కథాకాలమునాఁటికి, ననఁగా ముద్దుకృష్ణప్పనాయకుని కాలమునాఁటికి, నది యాధునిక శిల్పముగా మారబోవు పరివర్తనమునందున్నదని చెప్పవచ్చును. పల్లవులనాఁడు రథములును, చోళులనాఁడు గోపురము లును, విజయనగర రాజులనాఁడు మంటపములును దాక్షిణాత్య శిల్పమునందు ముఖ్యములు. ఆ యా రోజులలో నవి వృద్ధి పొందినవి. ఉదయన్ సేతుపతి తన యీ దివ్య సౌధము

ముందు గొప్ప మంటపమును గట్టించి తనకు శిల్పవిద్య యందున్న యభిమానమును వెల్లడించుకొనెను.

ఆ మంటపములోఁ బఱచియున్న రత్నకంబళముపై కుట్టాన్ ఆసీనుఁడయ్యెను.

ఆ పలుచఁబడుచున్న వెన్నెల పొరలలో నా మంటపము నం దాసీనుఁడై యున్న యా రాచకొడుకును జూచిన నమరావతిలో జయంతుఁడు మన్మథ మంటపమునం దున్నట్లు చూపట్టకమానదు.

దూరమునుండి వీరభద్రభట్టరు కుట్టానును జూచి యతఁడు సంతుష్టుఁడై యున్నాఁడనుకొని వినయముతో సమీపించి, 'ప్రభూ! పండుకొనుటకు వేళయైనది' యన్నాఁడు. కుట్టాన్ కొంచెము కోపదృష్టితో నాతనివంకఁ జూచెను గాని పోఁకచెట్ల మొవ్వుల వెనుకనున్న వెన్నెలనీడలో వీరభద్రభట్టరది చూడలేదు. వీరభద్రభట్టరు కుట్టాన్ సత్ప్రవర్తన కలిగి యుండునట్లు చూచుట కేర్పడిన యధికారి. కుట్టాన్ ఇతనికి తెలియకుండ నే పనియుఁ జేయరాదు. కుట్టాన్ లేచి లోనికిఁ బోయెను. రాచ దివాణములో జాము గంటలు కొట్టిరి. అందఱకు నిద్రావేళ యయినది.

కుట్టాన్ పడకగదిలోనికిఁ బోయెను. పడకగది విశాలమయినది; ముందున్న మంటప మంత యున్నది. పైకప్పు మిక్కిలి యెత్తుగా నున్నది. ఇది సౌధములో రెండవ యంతస్తునందున్నది. గోడలనిండ గచ్చుపని చేసియున్నది. చిత్రచిత్ర వర్ణములతో లతలు, చిలుకలు, చెట్లు గీయఁబడి యున్నవి. గోడలనిండ నొకవరుసగా ననేకచిత్రములు వ్రేలాఁడుచున్నవి.

ఆ చిత్రము లన్నిటిలో మొగలుల చిత్రవిద్యాచిహ్నములు స్పష్టపడుచున్నవి. పురాణకథలనేకవిధములుగాఁగుడ్యములనిండ చెక్కఁబడియున్నవి. తూర్పు గోడయందు నొక చిన్న గూడుగా నేర్పఱుపఁబడి యందొక రత్నముంచబడినది. ఆ రత్నకాంతులు గదినంతయు తెల్లని వెలుఁగులో ముంచియెత్తినవి. గోడలవెంట చంద్రకాంత శిలావితర్దికలు, గొప్పపనికలిగిన బల్లలు నుంచఁబడి, వానిపైని సువాసనాద్రవ్యములు, దంపతుల కానంద మిచ్చుఁ గొన్ని చిత్రములు, అద్దములు, చిలుకలు నమర్పఁబడి యున్నవి. ఆగదికి వెనుకవైపున పెద్దగవాక్షమున్నది. ఆ గవాక్షమునుండి దొడ్డిలో నెత్తుగా వేయఁబడిన మలెజాజి పందిరుల మీఁది సువాసనాభరితమైన చల్లనిగాలి యుండి యుండి లోనికి వచ్చుచున్నది. ఆ గవాక్షమువద్దనే పెద్దమంచమున్నది. ఆ మంచము పందిరిస్తంభములు మహాశిల్పమును సూచించుచున్నవి. ఉపానము, పద్మము, కుముదము, వేదిక, నాగబంధము, కలశము, 'పుష్పబోదిగ' యన్నియుఁ గొద్దిలోఁ గలిగి యా నాల్గు కంబములు సర్వాసుందరముగానున్నవి. పందిరినుండి యనేకరత్నములు వ్రేలాడుచున్నవి. మంచము మిక్కిలియెత్తుగా నుండి పైనివేయబడిన మైదుపఱుపులవలన మానిసి యెత్తున్నది. మంచముపైకిఁ బోవుటకు మెట్లున్నవి. మంచము తలవైపునఁ గాళ్ళవైపునఁ బ్రక్కగా రెండు స్తంభములున్నవి. ఆ రెండు స్తంభములు మంచమెత్తుననే యున్నవి. తలవద్ద కంబము పైని నొక బంగరు పళ్ళెరమునఁ దాంబూలద్రవ్యములు, సువాసనాద్రవ్యములు నుంచఁబడినవి. పందిరికంబమున నున్న నాగబంధము నందు రెండుసుదీర్ఘములు, మందారకుసుమగుంఫి

తములు, సంగతలవలీకిసాలములు నగు మల్లెపూవుల దండలు వ్రేలాడుచున్నవి. సెజ్జనిండుగ మల్లెలు జాజులు దట్టముగఁ జల్లబడి యున్నవి. ఆ మంచముప్రక్కగా నింకొక మంచ మంత యెత్తు లేకున్నను, సమానమైన సౌందర్యము కలది యున్నది. అందు మల్లికాసుమంబులు వెదజల్లి లేవు.

కుట్టాన్ పాముకుబుసములవంటి పంచెనొకటి కట్టుకొని యొకటి పైనివేసికొన్నాఁడు. యథాప్రకారముగాఁ దన పెద్ద మంచముపైఁబండుకొనుటకుఁబోయి మెట్లెక్కినాఁడు. ఒత్తుగాఁ బఱచిన మల్లెపూవులలో నేకవీర గోధుమ వన్నె త్రాఁచువలె ముడుచుకొని పండుకొన్నది. కుట్టాన్ నిర్ఘాంతపోయినాఁడు. ఏకవీర యెప్పుడును దన మంచముమీఁదఁ బండుకొని యెఱుగదు. ఆమె కాపురమునకు వచ్చి మూడునెలలైనది. ఆమెను బతి పలుకరించలేదు. పతి నామె పలుకరించలేదు. పెద్ద మంచముమీఁద కుట్టాన్, చిన్నమంచముమీఁద నేకవీర: ఇట్లు మూడునెలలు గడచినవి. నే డిది యేమి? ఏకవీర కుట్టాన్ శయనించు మంచముమీఁదఁ బండుకొని నిదురపోవుట కెట్లు సాహసించినది? ఏకవీర నిత్యమును నాకుపచ్చవారణాసిచీర ధరించును. పైని బంగరుటంచు కాశ్మీరపుసేలువ పై ముసుంగిడుకొనును. ఒడలినిండ వెలలేని నగలు ధరించును. నేఁ డిదేమి? తెల్లని పట్టుకోక కట్టి పరిమితభూషణములు ధరించినది. మేనఁ గంచుకము లేదు. అభ్యంగము చేసినది కావలయును. శిరోజములు పొడిపొడిగా నుండి చల్లగాలి కల్లల నాడుచుండెను. తలంటిపోసికొన్నది. ఒడలు తెలియక నిద్రపోయినది; కుట్టాన్ మిక్కిలి కోపము పొందెను. 'ఈ దౌర్భాగ్యురాలు నాశయ్య

నలంకరించఁగలదా ? ఇన్నాళ్ళనుండి లేని యాశ దీనికి నేఁడేలఁ బుట్టవలయును ? ఏ మహాసౌందర్యరాశి నాశయ్యా విభాగించు కొనవలయునో యామెకు నాకు నీ జన్మమునఁ గలయికయే లేదు. నన్నీపిశాచ మావేశించినది. అయ్యో ! ఈ దయ్యము నన్నెట్లు వదలును ? కుట్టానుకుఁ గొంచెము కోపము తగ్గినది. 'అయ్యో ! నా కీమె సహధర్మచారిణికదా ! ఈమె నన్నువదలి యెచ్చటికిఁబోవును ? ఇన్నాళ్ళుగా నేను మాట్లాడకుండనుండిన నెంత శోషిల్లినదో ! నాతోనొక్కనాఁడు పలుకలేదే ! స్త్రీయెట్లు పలుకరించును ? పురుషుఁడు తనయందు విముఖుఁడుగా నున్నపుడు స్త్రీకిఁ దూష్ణీంభావమే ప్రధానము. ఇంతలో కుట్టాన్ నేత్రములు మూఁతలుపడినవి. ఎట్టయెదుట నాతని హృదయ మాక్రమించిన లతాంగిరూపము సాక్షాత్కరించినది. కుట్టాన్ ఆ జగన్మోహన విగ్రహమును జూడలేక పోయినాడు. తటాలునఁ గనులు తెఱచినాఁడు. కనులలో నిండుపగింజలంత బాష్పములు నిలిచినవి.

ఏకవీర కదలినది. మూఁతపడిన యామె రెప్పలమీఁద గ్రుడ్లుపోసినట్లు చిన్నిచిన్ని స్వేదబిందువులు నిలిచినవి. ఆహా ! ఏమా వదన సౌందర్యము ! కొండపై నుండి దూకు సెలయేఱు ప్రాతస్సూర్యకిరణములలో ధగద్ధగితమయినట్లున్నది. కుట్టాన్ సమ్మోహితుఁడైనాఁడు.

ఇదివరకు కుట్టాన్ ఏకవీరను బరిశీలించి చూడలేదు. ఆమె సౌందర్యవతి యనియే యనుకొనలేదు. అప్పుడప్పుడు 'ఆమె సౌందర్యవతియే యనుకొందము. అయినమాత్రము నా కేమి ? నాహృదయ మామెది కానేరదు' అనుకొను చుం

డును. ఏకవీర పయ్యెద తొలగినది. కుట్టాన్ కనులుమూసి కొన్నాడు. తన ప్రణయిని యెదురైనది. శోకములో గోపము తలుముకొనివచ్చినది కుట్టాన్ మహారాజునకు. అన్యాయముగ తనశయ్య నాక్రమించుకొన్న ఏకవీరను గ్రిందకు లాగివేయుద మనుకొన్నాడు. ఏకవీర దొంగనిద్రపోవుచున్న దని భావించి నాడు. కోపముతో నతడామె చెక్కిలిపై శత్రుమారణసమర్థ మయిన హస్తమును దీవ్రముగా విసరబోయినాడు. అతనికి దెలియకుండగనే మహాబుద్ధిమంతుడగు కుట్టాన్ కరపద్మము పువ్వులదండవలె నేకవీర చెక్కిలి కంటినది. ఏకవీర యులికి పడిలేచినది. ఇద్దరు నిస్తబ్ధులైయున్నారు. ఏకవీర మనసులో ననుకొన్నది. 'నాతండ్రి నాకీసంబంధముచేసి నాల్గునెలలైనది. ఈ యన యింతవరకు నామొగము చూడలేదు. కార్యమునాడు కొంగుపఱచుకొని తలుపుదగ్గరనే పండుకొంటిని. నా గారా మంతయు నిట్లయినది. ఈ క్రొత్తప్రదేశమునకు నేను లాగుకొని రాబడితిని. నాకుదిక్కులేదు. మాటాడువారు లేరు. దాసీలతో నారహస్యము నేమనిచెప్పను? దినదినము మాగదిలోనియనుప యుక్తపదార్థములను జూచి దాసీలు నవ్వుకొనుచున్నారు. నన్ను డుగుచున్నారు. ఏమియు జెప్పలేకుంటిని. ఈ వివాహమునకు బూర్వము నాహృదయ మింకొకనియందు లగ్నమయినది. ఆతడెవ్వరో, యేయూరివాడో, తెలియదు. మానిసి సాధారణ కుటుంబములోనివాడుగా నున్నాడు. ఆతనిని వెదకి లాభము లేదు. నా పుణ్యమువలననే నా కీ కుట్టాన్ సేతుపతి లభించి నాడు. అతనికన్న ముందే యితనిని జూచిన నెంతబాగుండె డిది? ఇప్పుడైన నేమి? ఇతనినైన నకల్మషహృదయముతో

సేవించగలను. ఇతనికి నాయందుఁ బ్రేమ లేదు. ఇతని ప్రేమ కోసము కృశించి కృశించి యీనాఁడు సాహసించి యీశయ్యపైని బండుకొన్నాను, నిదురపట్టినది. నా యీ సాహసమున కితఁడేమనుకొన్నాఁడో?' ఈ భావములన్నియు నేకవీర మనస్సులో నొకసారి మెఱుపువలె మెఱసినవి. కుట్టాన్ అనుకొన్నాఁడు. ఈమె యెంత యందకత్తె! నన్నుఁజూచి యెంత లజ్జపడుచున్నది. ఇప్పుడేమిచేయను? ఇన్నాళ్లనుండి నాతప్పు మన్నించు మందునా? చీ! చీ! ఆ నా ప్రియురాలియెడ నేనంత తప్పుగాఁ బ్రవర్తింతునా? ఈ హృదయ మామె కిదివరకే యర్పితమైనది. ఇంక నొరుల కిది యీయఁజాలను!'

ఏకవీర నెమ్మదిగా మోకాళ్ళమీఁద లేచి పందిరికంబమున నాగబంధమునకుఁ దగిలించఁబడిన మల్లెపూదండయొకటి తీసి యొక యర్ధనిమేషములో లజ్జావనతవదనయై కుట్టాన్ మెడలో వేసినది. ఆ పూలమాల మెడలోఁ బడెనదో లేదో, కుట్టాన్ రుద్రమూర్తియైనాడు. తాటకను జంపుటకు రామచంద్రుడు ధనుస్సు నంతవడిగా లాగెనో లేదో, ఆపూల దండను కుట్టాన్ అంతవడిగా రెండుగాఁ ద్రెంచి నేలమీఁద విసరినాఁడు: ఏకవీర మంచముపైని విరుచుకొని పడిపోయినది. ఇంకఁ గొంచెమైనచోఁ గ్రిందఁబడెడిది, నిలువెత్తునుంచి. తలపగిలిపోయి యుండును. కుట్టాన్ కన్నులనీళ్లు గిఱ్ఱునఁదిరిగినవి. కుట్టాన్ మెట్లుదిగి చిన్నమంచముపైని బోయి పండుకొన్నాఁడు. వెక్కి వెక్కి యేడ్చుచున్నాఁడు.

ఏకవీరకు నిమేషములో నొడలు తెలిసినది. పతి పజ్జ లేఁడు, తనచిన్నమంచముపైఁబండుకొన్నాఁడు. తాను మంచము

తొందరగా దిగి, కంచుకము ధరించి, సాధారణముగాఁదాను ధరించుచీర తాల్చి యొడల నన్ని భూషణములను బెట్టుకొని, కాశ్మీరపుసేలువ ముసుఁగిడి, కన్నుల నీరు గ్రమ్మగా తన చిన్న మంచమువద్దకుఁ బోయి, రుద్ధమైన కంఠమునుండి మాట పెగుల్చుకొని, 'ప్రభూ! మీరు తమ మంచముపైనే పండుకొనుడు. నేనిందుఁ బండుకొనెదను' అన్నది. ఆమెవంకఁ దిరిగి కుట్టాన్ చూచుసరికి నతని కన్నులు గిఱ్ఱునఁ దిరిగిపోయినవి. హృదయము సహస్రధా విశీర్ణమైనది. కుట్టాన్ తానుజేసిన పనికిఁ జాలనొచ్చుకొన్నాడు. ఏకవీరను గాఁగిలించుకొని యామె శిరస్సున బాష్పాభిషేకము చేయవలెననుకొన్నాఁడు. ధైర్యము చాలలేదు. కుట్టాన్ నెమ్మదిగా లేచిపోయి తన మంచముపై నిదురించినాడు. ఏకవీర కన్నీళ్లతోఁ జిన్న మంచముపై నున్న నాలుగుపఱుపులు నడుగుదాఁకఁ జనికి పోయినవి. ఏరాత్రి వేళనో యామెకు నిద్రవచ్చినది. తెల్లవారుకడ కుట్టానుకు మెలకువ వచ్చినది. ఏకవీర యున్నదో, లేదో యని యామె మంచమువంకఁజూచినాడు. ఆమె యందే వాడిపోయిన మందారమువలె మంచమున కంటుకొనిపోయియున్నది.

మఱునాడు దాసీలు నేలమీఁది పూలదండలు చూచి సభయనేత్రలైరి.

3

మఱునాఁడు కుట్టాన్ నిదుర లేచి కాల్యకృత్యములఁదీర్చి కొని, రతనాల జీనువేసి సిద్ధముగా నుంచఁబడిన యశ్వముపై నెక్కి కోట వెలుపలి భాగమునకుఁబోయెను. అచ్చట నదివరకే సమావేశమై నానామండలాధిపుల కుమారులు బారులు దీర్చి

నిలుచుండిరి. మొదటఁ దిరుచునాపల్లి మండలాధిపుని కుమారుఁడు. అతఁడు తెల్లని గుఱ్ఱముపై నధిరోహించియుండెను. వయసిరువది యేండ్లుండవచ్చును. తెల్లని యంగీ; తలపైనిఁ బచ్చల సరము చుట్టుకొనున్న యుష్ణీషము. అతనిపజ్జ తిన్నెల్వేలి మండలాధిపుని కుమారుఁడు. అతనిపజ్జ సత్యమంగలమండలాధిపుని తనయుఁడు. వీ రిరువురు సమానవయస్కులు; చూచుటకన్నదమ్ములవలెఁగూడ నుండిరి. అనంతరము మానామధుర మండలాధిపతియొక్కయు, శేందమంగళమండలాధిపుని యొక్కయుఁ గుమారులు జోడుకోడెలవలె నిలుచుండిరి. వారిరువురు మేనత్త మేనమామల బిడ్డలు. పోలికలు, రేఖలు నొకటిగా నున్నవి. ఇరువురకును బదునెనిమిదేండ్లు దాఁటలేదు. వారి గుఱ్ఱములు భూమిమీఁద నిలుచుటలేదు. వారు బాలకులయ్యు నెంతయో పరిశ్రమగలవారివలెఁ దామెక్కిన యుత్తమజాత్యశ్వములను, దమదేహములను గదలించుచుఁ బాదములను జాచుచు నడపు పెట్టుచుండిరి. ధారాపుర, మారమంగళ, శేల, కణ్ణీపిఠ, పాలెగాండ్ల కుమారులు తరువాత వరుసగా నిలువఁబడియుండిరి. ఇంక ననేకమంది రాజకుమారు లుండిరి. అంద ఱెక్కినవియు నుత్తమజాతిగుఱ్ఱములు. అందఱి దేహములయందును వెలలేని భూషణములు. ప్రతివాని మొగమునందునను శౌర్యలక్ష్మి. కుట్టాన్‌పోయి వీరందరకును మొట్టమొదట తన గుఱ్ఱమును నిలువఁబెట్టెను. తరువాతఁ బ్రధాని కుమారుఁడును, రాయసం కుమారుఁడును వరుసగా వచ్చి వారి యుచితస్థానములయందు నిలువఁబడిరి. రాజసైన్యము బారులుతీర్చి వీరికి దూరముగా నిలువఁబడియుండెను.

ఈ రాజకుమారులు తీర్చిన బారున కెదురుగా నొక ముసలి యుద్ధవీరుడు తెల్లని గడ్డమును, మీసములును భీష్మాచార్యభ్రాంతిఁ గల్పింప, మహోన్నతమైన శ్వేతాశ్వముపై నెక్కి నిలువఁబడి యుండెను. ఆయన వీరందఱకు శిక్షాగురువు. మధురనాయకుల రాజ్యములో దళవాయి ప్రధానసేనాపతి. ఉదయన్ సేతుపతి, కుట్టాన్ తండ్రి, దళవాయి. మొదటముప్పూర నాయకుల కాలములలో మహామేధాశాలి యగు నార్యనాథుఁ డీపదవియందుండెను. ఈపాండ్యపార్థివ ముద్దుకృష్ణ నృపతికి ఉదయన్ సేతుపతి దళవాయి యైనాఁడు. ఉదయన్ సేతుపతి మహాసమర్థుఁడు, గొప్పసేనాని. రాజకార్యనిపుణుఁడు. సేతుపతులు నాయకుల తరమువారు గాదు. పాండ్యరాజులనాటి నుండియు మధురరాజులకు మండలాధిపులుగ నున్నారు. రామనాథప్రాంతమున నున్న దేశమంతయు వీరి వశమున నున్నది. రామేశ్వరమునకుఁ బోవుమార్గములోఁ జోరభయ మెక్కువై తైర్థికులకు మిగుల గష్టములుగా నుండుటచేత నుదయన్ సేతుపతి యెక్కువకాల మా ప్రాంతముననే యుండ వలసివచ్చినది. ఆయన లేనికాలములో సైన్య మంతయు నీ వృద్ధసింహాముచేతిలో నుండును. ఈయనపేరు కస్తూరి రంగప్ప నాయకుఁడు. విశ్వనాథనాయకుని మనుమఁడైన వీరప్పనాయకునకు ముప్పూరు కుమారులు. రెండవ కృష్ణప్పనాయకుఁడు, విశ్వప్ప, కస్తూరి రంగప్ప. ప్రస్తుతము రాజైన ముద్దుకృష్ణప్ప నాయకుఁడు విశ్వప్పకుమారుఁడు. కస్తూరి రంగప్ప ముద్దు కృష్ణప్ప రాజ్యమునకు రాకపూర్వము రాజ్యాపహారణము చేసినందున నతనిని ప్రజలు సంధ్యామంటపములో మఱియం

చిరి. ఈ వృద్ధసింహ మా కస్తూరి రంగప్పనాయకునకు బావ మఱంది. ఈయన పేరు కస్తూరి రంగప్పయే. ఈయన ప్రస్తుత రాజునెడల నభిమాని.

ఆవృద్ధునికంటిచాయనుండి రాజకుమారు లొకరొక్కరే ముందుకువచ్చి బాకువేయుటలోఁ దీయుటలోఁ, గత్తి ఝుళి పించుటలో, విసరుటలో గుఱ్ఱమును దుమికించుటలో నుఱికిం చుటలోఁ దమ ప్రావీణ్యమును జూపిరి. తరువాత నీ రాజ కుమారులందఱును సైన్యమువద్దకుఁ దీసికొనిపోఁబడిరి. కస్తూరి రంగప్పనాయకులు కుట్టానును బిలిచి సైన్యముచేత సర్వతో భద్రవ్యూహము పన్నించుమన్నాడు. కామందకుఁడు సర్వతో భద్రవ్యూహము శత్రుహృదయనిర్భేదక మన్నాఁడు. కుట్టాన్ తత్క్షణమే వ్యూహమున కురమును, కక్షలును, గోటియు, జఘనమును సంపాదించి యచలాకృతి నిలువఁజేసినాడు. పొదల వలెఁ బెరిగిన ముసలి కస్తూరి రంగప్పనాయకుని తెల్లని కను బొమలలో సంతోషపుఁ గదలిక కలిగినది. వృద్ధవీరుఁడు కుట్టాన్‌తో "నాయనా! సైన్యముయొక్క జఘన మాపత్తులో నున్న యెడల నే వ్యూహము పన్నెద"వని యడిగెను. కుట్టాన్ సమాధానము చెప్పకుండనే సర్వతోభద్రవ్యూహమును మకర వ్యూహముగా మార్చి వృద్ధపండితుని సంతోషింపఁజేసెను. అనంతరము తక్కిన రాజకుమారులందఱును క్రమముగా శ్యేన, సూచీ, శకట వజ్రవ్యూహాదులను బన్నియు రంగప్పనాయకున కానందము కలిగించిరి. కుట్టాన్ కక్షలులేకుండ నొకవ్యూహము పన్ని రంగప్పనాయకునివంకఁ జూచెను. రంగప్ప "వహ్వారే" యని మెచ్చుకొనెను. అనంతరము జాము ప్రొద్దెక్కగా రాజ

కుమారు లెవరితావునకు వారు పోయిరి. సైన్యము కస్తూరి రంగప్ప యధీనమునఁ గొంతసేపు మెలఁగి నియమితస్థలమునకుఁ బోయినది. కుట్టాన్ గృహమునకుఁ బోయి మజిల స్నానమాడి భోజనాదికములు నిర్వర్తించుటకు సౌధాంతర్భాగమునకుఁ బోయెను. ఎఱ్ఱని కాశ్మీరపుసేలువ ముసుగులోఁ బ్రకాశించుచున్న ఏకవీరను జూచెను. కుట్టాన్ వచ్చుచున్నాఁడని తెలిసి యామె తొందరగాఁ బోఁదొడఁగెను. కాని మంజీరము కాలికి నొక్కుకొనఁగాఁ గొంచెము నిలుచుండి వంగి సర్దుకొనక తప్పినది కాదు. కుట్టాను ఆమె లేతమలపాకులవంటి చేతులు కాళ్ళు పరీక్షగాఁజూచెను. అవి యంత సుకుమారములా? కుట్టా నను కొనసే లేదు. భోజనానంతరము కుట్టాన్ తాను జదువుకొను గదిలోనికిఁ బోయెను. కుట్టాను చేయి యప్రయత్నముగాఁ గౌటి ల్యుని యర్థశాస్త్రముమీఁదికిఁబోయెను. తీయఁగనే యంతఃపుర రక్షణము గుఱించిన వాక్యములు వచ్చెను. కామందకుఁడును, గౌటిల్యుఁడును నీవిషయములో నొక్కటే యభిప్రాయులై యున్నారు. కౌటిల్యుఁడంతఃపురరక్షణమును గుఱించియు,నంతః పురమునుండి రాజునకువచ్చు నాపదలను గుఱించియుఁ దెలియఁ జేయుట కెట్టి యుదాహరణల నిచ్చెనో, కామందకుడుగూడ నవియే యిచ్చెను. తనభార్యగదిలో దాఁగియుండి యతని తమ్ముఁడు భద్రసేనునిఁ జంపెను. తల్లి శయ్యక్రింద నడఁగియుండి కరూశనృపతి, నతని కొడుకు సంహరించెను. కాశీరాజును, వైరాంత్యుని, సౌవీరుని వారిభార్యలే చంపిరి—ఇది చదువువఱ కనవసరముగాఁ గుట్టానునకు భయము కలిగెను. కుట్టాన్ మజల ధైర్యము తెచ్చుకొనెను. కుట్టాను హృదయములోఁ

గలిగిన కొంచెమాచేదన తగ్గించుకొనుటకుఁ గంబరామాయణము తీసి యొకపద్యము చదువుకొనెను. కుట్టానునకు సంగీత మెక్కువగా రాదు గాని, రాగచ్ఛాయగాఁ బద్యము చదువుకొనఁగలఁడు.

ఇంతలో వీరభద్రభట్టరు ద్వారముకడకుఁ జనుదెంచి యశ్వశకటము సిద్ధముగా నున్నదని చెప్పెను. కుట్టాఁడుదుస్తులు వేసికొని వీరభద్రభట్టరుతోఁ గలసిపోయెను. శకటము రాజసౌధము లున్నయెడకుఁ బోయెను. అం దొక మహాసౌధము ప్రత్యేకముగా రాజపురుషులకు రాజనీతి నేర్పుట కేర్పఱుపఁబడినది. కుట్టానును, వీరభద్ర భట్టరును లోనికిఁ బ్రవేశించిరి. లోపలిభాగ మతివిశాలముగా నున్నది. నేలయంతయు విలువఁగల తివాసీలు పఱువబడియున్నవి. వానిపైఁ బండితు లాసీనులై యుండిరి. రాజకుమారు లనేకులు వచ్చిరి. ఒక్కచోట భోజుని యుక్తికల్పతరువు, మఱొకచోట జీమూతవాహనుని దాయభాగము, నింకొకచోట జండీశ్వరుని వివాదరత్నాకరము పాఠములు చెప్పఁబడుచుండెను. ఇంకొకచోట నొక ద్రావిడ భాషాపండితుఁడు తమిళభాషలో వ్రాయఁబడియున్న విజ్ఞానేశ్వర వ్యాఖ్య బోధించుచుండెను. మఱొకచోట వేఱొకపండితుఁడు సంస్కృతభారతమును, రామాయణమును, నానాఁటి రాజనీతిని, గొందఱు విద్యార్థుల కుపన్యసించుచుండెను. కుట్టాన్ భారతరామాయణము లుపన్యసింపఁబడుచోటఁ గూరుచుండి శ్రద్ధగా వినెను. కొంచెము ప్రొద్దుగ్రుంకువేళకు రాజు మొగసాలలో గంటకొట్టఁబడెను. అది విని విద్యార్థు లెవరిదారినివారు పోయిరి. వీరభూపతి యీ పాఠశాలకు వచ్చెను. ఇంటికిఁబోవు

నపుడు కుట్టానును గలిసికొనెను. ఇరువురును సంతోషపడుచు సేతుపతి గృహమునకుఁ బోయిరి. వీరభద్రభట్టరు పనియుండి రాజసౌధమువద్దనే దిగఁబడెను. మార్గములో వీరభూపతి కుట్టాన్‌తో నిట్లు మాటాడెను: 'సేతూ, నీతో నొక పని యున్నది;' కుట్టాన్ 'ఏమి' యని యడిగెను.

వీర : 'తిరుమలనాయకుఁడు నీకు స్నేహితుఁడుగదా! నా కేదైన నుద్యోగ మిప్పించవలెను. నేను నీతిశాస్త్రమం తయుఁ జదివితిని. విజ్ఞానేశ్వరము, వైశంపాయనుని నీతిప్రకాశిక పూర్తిచేసితిని. కౌటిల్యుని యర్థశాస్త్రము, కామందకుని నీతి సారములలోఁ జాల బాగుగఁ బరీక్ష నిచ్చితిని. నే నుద్యోగము చేయవలసిన యవసర మంతకంత కెక్కువగుచున్నది.'

కుట్టాన్ : 'తిరుమల నాయకుఁడు నేఁడు విద్యాసౌధ మునకు రాలేదే! ఈ సారి నే నాయనను గలసికొన్నప్పుడు చెప్పెదను. వారు నిన్నుగూఁడ బాగుగా నెఱుగుదురు కదా!'

వీర : 'ఎఱుగ కేమి?'

తరువాత నేదియో మాటలాడుచు వారియింటికిఁ జేరిరి. వారిరువురు కుట్టాన్ గదిలోనికిఁ బోవునప్పటి కందు ఫలా హారములు సిద్ధముగా నుంచఁబడెను. ఇరువురును ఫలాహారము చేసి, తాంబూలము సేవించి కూర్చుండగా కుట్టాన్ వీరభూ పతిని గొంచెము సంగీతము పాడుమని యడిగెను. వీరభూపతి మధురమీనాక్షిమీద నొక యరవకీర్తన గొంతెత్తి పాడెను. ఆధ్వనితో సౌధమంతయు నిండిపోయినది. పారిజాతపుఁబూవులు కొఱుకుచున్న లేడిపిల్ల మెడ యాడించుకొనుచు లోనికివచ్చి వీరభూపతివంకఁ దొంగిచూచి పోయినది.

౪

ప్రొద్దు గ్రుంకినది. చల్లబడినది. రాజసౌధముల ముందు మొగసాలలో మ్రోగింపఁబడుచున్న భేరీరావములు మేఘధ్వాన ములని భ్రాంతిఁజెందిన పెంపుడు నెమిళ్ళు నృత్యము చేయు చున్నవి. సాయంకాల వాహ్యాళికై కుట్టాన్ వీరభూపతు లశ్వ శకటారోహము చేసి, వైఁగై నదీసికతాతలములకుఁ బోయి నారు. కుట్టాన్ సేతుపతి కొంచెము పొట్టివాఁడు. నల్లనివాఁడు. విశాలమైన నేత్రములు. దైనందినవ్యాయామముచేత నతని యొడలు గట్టిబారినది. సంస్కృత ద్రావిడములలో నున్న రాజ నీతిగ్రంథము లన్నియు నతఁడు చదివెను. అతని వయస్సు సుమా రిరువదియైదుండవచ్చును. మీసములు నల్లగా దుమ్మెద జెక్కలవలె నంత గుబురుకాకుండ, నంత పలుచన కాకుండ వచ్చియుండెను. అతని మొగము చూచుటతోడనే ప్రధాన ముగాఁ గనఁబడునది యతని నాసిక. అది మిక్కిలి యెత్తు. ఆ ముక్కు, నా విశాలపద్మపలాశనేత్రములు నతని మొగ మ్మునకమితమైన యందము తెచ్చినవి. ఆ విశాలమైన నేత్ర ములే యతని సత్కులీనతను జెప్పుచుండును. కుట్టాన్ మిగుల గంభీరమైనవాఁడు. అనవసరముగ నెవ్వరితోడను మాటాడఁడు. అతనికిష్టములేని పని నెవరైనను జేసిరేని వారివంకఁ దీక్ష్ణమైన దృష్టిఁ బఱపుటయే యతఁడు తన యిష్టములేమి చూపించుట. ఆ దృష్టిపాతము చాల కొలదిమంది యోర్చుకొనఁగలరు. అతఁడు ప్రసన్నుఁడైనప్పు డతనినవ్వు మిగుల నానందముగొలి గించును. అతనిసర్వము ఉదయన్ సేతుపతి తరువాత నతని యంతవాఁ డనిపించుచుండెను.

ఇంక వీరభూపతియెట్టివాఁడు. పొడుగరి. శరీరవ్యాయామము మిక్కిలిగాఁ జేయనివాఁ డగుటచేత నితని యెదురు బొమ్మ కుట్టాన్ బొమ్మవలె తిర్యక్ప్రసారితమైన గండశిల వలె నుండదు. అతని నేత్రములు కుట్టాన్ నేత్రములంత విశాలమైనవి కావు. కాని మఱియుఁ జిన్నవికావు. నాసిక సామాన్యమైనది. అతని మొగము చూచినంతనే ప్రతివారు నతఁడు సుందరుఁడనుకొనకమానరు. కుట్టాన్ మొగములో నానుపూర్వికముగా యుద్ధముచేసి రాజ్యమునేలుచువచ్చిన పితరులచిన్నెలు ద్యోతక మగుచుండును. వీరభూపతి వదనము శాంతమై చాల తరములనుండి వ్యవసాయము, చదువు వీనియందు దలవాటు వడిన పితరుల చిన్నెలు కనఁబఱచుచుండును. వీరభూపతి మీసములు చివరలు మెలికలు తిరిగి తామరపూవు మీఁద వ్రాలిన భృంగముల ననుకరించుచుండెను. మొత్తముమీఁద కుట్టాన్ వదనము పురుషు లెక్కువ మెచ్చుకొందురు. వీరభూపతి వదనము స్త్రీ లెక్కువ మెచ్చుకొందురు. వీరభూపతి మొగము క్రోధముచే నెఱ్ఱఁబడినను నవ్వుచున్నట్లే యుండును. అతఁడు నవ్వుచున్నపుడు కన్నులు చిన్నవై చూచువారిని సూదులవలె గ్రుచ్చుచుండును. కుట్టాన్ నడచునపుడు మిక్కిలి తొందరగా నడచును. వీరభూపతి నెమ్మదిగా నడచును. కుట్టాన్ ఉదయన్ సేతుపతి కొక్కఁడే కుమారుఁడు. ఉదయన్ సేతుపతి 'తేవై' పురాధిపతి. సేతువుల రక్షించుట కేర్పడిన యధికారి. రాజ్యములోఁ బ్రవహించునదులకు సేతువులను గట్టి వానిక్రింద భూములను సాగుచేయుచుండిరి. ఈ సేతువుల కన్నింటిపైని నతఁడధికారి. అతఁడు చాల శివభక్తుఁడు. అరియ

రాయని సైన్యములను నిర్మూలించినాఁడు. ముద్దు కృష్ణప్ప నాయకునికిఁ బ్రధానమంత్రి. అతని కుమారుఁడైన కుట్టాను నకు ఏలోపమును లేదు. కుట్టాఁ తనతండ్రి తరువాత నతని స్థాన మాక్రమించుకొనుటకుఁదగిన శిక్ష మధురలోఁ బొందు చున్నాఁడు.

వీరభూపతి జన్మస్థానము రాజవల్లిపురము. అతని తల్లి దండ్రులు కొంచెము బీదవారు. విశ్వనాథనాయకునకు శ్రీకృష్ణ దేవరాయలుంగారు పాండ్యరాజ్య మిచ్చినపుడు తెలుఁగుదేశ మునుండి విశ్వనాథ నాయకులవారితో ననేకులు సరదారులు మధురప్రాంతములకుఁ బోయిరి. వీరభూపతి పూర్వు లటులు తెలుఁగు దేశమునుండి మధురకుఁబోయిరి. కాని యచటికిఁ బోయిన తరువాత విశ్వనాథనాయకుఁ డిచ్చిన భూమి నాధా రము చేసికొని వ్యవసాయము చేసికొని జీవించుట మొదలు పెట్టిరి. వీరభూపతి రాజోద్యోగవాంఛచేత రాజవల్లిపురము నుండి మధురకు వచ్చి రాజనీతి చదివెను.

మధురలో నాకాలమునందు విద్యావ్యాప్తి చక్కఁగా నుండెను మధురలో నారోజులలో నెప్పుడును బదివేలమంది విద్యార్థులకుఁ దక్కువ లేకుండ నుండిరి. ఈ విద్యార్థుల కన్ని వసతు లేర్పరుపఁబడి యుండెను. విద్యార్థుల భోజనాదిక ములకు, నుపాధ్యాయులకు, జీతములకు విజయనగరరాజు లును, మధురనాయకులు నిచ్చిన భూము లనేకము లున్నవి. ఆభూములమీఁద వచ్చునాదాయము మిగిలిపోవు చుండెను. సంస్కృతము, అరవము, తెనుఁగు నీమూఁడుభాషలు నభ్యసింప బడుచుండెను. దేవాలయములు పాఠశాలలుగా నుపయోగింపఁ

బడుచుండెను. సమర్థులైన పండితులు షట్ఛాస్త్రములను, వేదములను విద్యార్థులచేతఁ బఠింపించుచుండిరి. వేఱు పాఠశాలలలో నరవము, తెలుఁగును జెప్పఁబడుచుండెను. మధుర నాయకుల కాలములోఁ దెలుఁగుభాష మిక్కిలిఁ బోషింపఁబడెను. రాజకుమారులకు రాజనీతి చెప్పుటకు వేఱుపాఠశాల లుండెడివి. అందుఁ బ్రధానమైనది రాజసౌధములోనే యున్నది. సంవత్సరమునకు రెండుసారులు సకలకళాశాలలలోనను విద్యార్థులు పరీక్షింపఁబడుదురు. పరీక్షయం దుత్తీర్ణులైనవారికి రాజు బిరుదములు, బహుమానములు నిచ్చుచుండును.

రాజనీతి తరగతి యనేకభాగములుగా విభజింపఁబడి యుండెను. గ్రామపాలనము, దాయవిభాగము, శిక్షావిధానము, సైన్యవిభాగము. రాజకుమారులు సైన్యవిభాగ శిక్ష పొందుచుందురు. తక్కినవారు తక్కిన తరగతులలోఁ జదివి తగిన యుద్యోగములు పొందుచుందురు.

మధురనాయకులు వేదరక్షకులు. వర్ణాశ్రమధర్మములను బరిరక్షించినవారు. బ్రాహ్మణులయందు భక్తి దేశమున సంపూర్ణముగా నుండెను. అయినను మధురరాజులు తక్కిన మతములయందు వైషమ్యము కలవారు కాదు. దక్షిణహిందూస్థానమునఁ బ్రథమమున క్రైస్తవమత మడుగుపెట్టినది మధుర రాజుల రాజ్యసీమలలోననే.

మధురనాయకులు రాజ్యమును పాళ్యముపద్ధతిగా విభజించిరి. రాజ్య మనేకమండలములుగా విభజించి ప్రతిమండలము నొక్కొకయధికారి క్రింద నుంచిరి. ఆ యధికారి తనమండలమునకు రాజువంటివాఁడు. అతఁడుమధురనాయకునకుఁగప్పము

కట్టుచు తన మండలముమీఁదఁ దాను సర్వాధికారము చేసికొన వచ్చెను. అతఁడు కొంత సైన్యమును బోషించుచు మధుర నాయకున కవసరము వచ్చినపుడు సహాయము చేయుచుండ వలెను. మధురలో మాత్రము రాజు తాను గొందఱు మంత్రుల సహాయముతో రాజ్యము చేయుచుండెను.

రాజ్యములోఁ బ్రధానోద్యోగి దళవాయి: అతఁడే రాజ్యపాలనాధికారియు, సైన్యాధికారియు. పూర్వ భారతదేశ పాలకులయందు వలె నీ రెండధికారములు నొకటిమంత్రిక్రిందను, నొకటి సేనాపతి క్రింద నుంచక మధురరాజులు దళవాయి యొక్కనిక్రిందనే యుంచిరి. రాజ్యముయొక్క శాంతి, సాంఘిక వ్యవస్థ, ఇతర రాజ్యములతో సంబధము—నివి దళవాయి చూచెడిపనులు. తక్కిన యందఱ అధికారులమీఁద నితఁడు పై యధికారి. దళవాయి తరువాతి యధికారి ప్రధాని. ఇతఁడు రాజ్యాదాయముమీఁది యధికారి. పన్నులు, తక్కిన రాఁబడులు, రాజ్యములో నగుచున్న ఖర్చు—నవి యన్నియు నితనిపనులు. దళవాయి యుద్ధకాలములలో రాజధానినుండి వెళ్ళిపోయినచో నితఁడు దళవాయి పనులన్నియుఁ జేయుచుండును.

మంత్రులలో మూఁడవవాఁడు రాయసము. ఇతఁడు పరి పాలనలోఁ బ్రధానపురుషుఁడు. రాజ్యముయొక్క సుస్థితి యీ మువ్వురిమీఁద నాధారపడియున్నది. వీరిమువ్వురి తరువాత ప్రధానాధికారులు కణక్కము (గణికుఁడు)ను, స్థానాపతి యును. కణక్కము లెక్కలన్నియు సరిచూచు నధికారి. స్థానాపతి యితర రాజుల కానుకలు, కప్పములు, వానికి సంబంధించిన యన్నికార్యములు చూచు నధికారి.

కొన్ని గ్రామములుకలిసి మాగాణమనియు, నట్టి కొన్ని మాగాణములు గలసి యొక నాడనియు వ్యవహరింపఁబడు చుండెను. ఈనాడునకే దేశము, రాష్ట్రము, రాజ్యము, మండపము నని పేరులు. ప్రతి గ్రామమునకు నధికారు లుండిరి. గ్రామములలో న్యాయము గ్రామాధికారుల చేత నేతీర్చఁబడుచుండెడిది. రాజ్యమంతలోనన్ని విధములైన న్యాయములయొక్కయు తీర్పరి ప్రధాని. గ్రామములలోఁ దీర్పు గాఁబడని యన్ని వ్యాజ్యములును మధురలోఁ దీర్పు చెప్పఁబడుచుండెను. మధుర యతిసుందరముఁగా వినిర్మింపఁబడియుండెను. పట్టణమునకు సరిగా మధ్య ప్రదేశమందు మీనాక్షీసుందరేశ్వరుల దేవళము కట్టఁబడియుండెను. ఆ దేవాలయము నాలుగువైపుల నాలుగు పెద్ద గోపురములు నిర్మింపఁబడి యుండెను. ప్రతి దిశయందును నీ గోపురమువద్దనుండి యూరి చివరకు నొక్కటియే వీథి. శ్రీ మీనాక్షీ సుందరేశ్వరుల దేవాలయమునకుఁ జుట్టును జతురముగా గృహములు కట్టఁబడియున్నవి. పట్టణమం దెచ్చటఁ జూచినను దేవాలయములే. అన్ని దేవాలయములకు నాయకు లిచ్చిన మాన్యము లున్నవి. ఏ స్వామికిని భోగము లోపము లేదు. అన్ని దేవాలయములలోను విద్యార్థులకు వేదశాస్త్రము లుపదేశింపఁబడు చుండెను. పట్టణము సర్వసమృద్ధమై యే విషయమునందుఁ గొఱతఁ బడకుండ నుండెను.

కుట్టాన్ వీరభూపతులు ప్రొద్దుగ్రుంకకముందే వైఁగై నదికిఁ బోయి నిన్న గూర్చున్నచోటనే కూర్చుండిరి. కొంచెము చీఁకటి పడుచుండెను. అస్తమితసూర్యుని యెఱ్ఱకాంతు లింకను ధాత్రినిఁ బూర్తిగా వదలిపోలేదు. వైఁగైనదీపరిఖిన్నజలతరం

గములపైని గొంచెముగా శైత్యమును సేకరించుకొన్న వాయువు మందముగా వీచుచుండెను. పలుచగాఁ బారవోలె నిసుకతిన్నెపైఁ బ్రవహించుచున్న వైగై నదినీటిపాయలోఁ జిన్నచేప కదలిక కనిపెట్టి పైనుండి తీతువుపిట్ట కూయుచు హఠాత్తుగ గాలిలో నుండి దిగి దానిని గాలఁ బొడుచుకొనిపోయెను. దూరమునఁ బడమటి దిక్కునందు సూర్యభగవానుఁడు తన రక్తాంశువులుప సంహరించుకొనికరకుగట్టిన నెత్తురుమన్నువలెఁ దొలగిపోయెను. పో, నెడరువేచి యొడలినిండ మసిపూసికొన్న దొంగవలె సంజ చీఁకటి వంగి తొంగిచూచెను. చీఁకటిలోఁ దళుక్కున మెఱసిన గగనభాగమందలి నక్షత్రములు వైగై పలుచని నీటిపారలోఁ బ్రతిఫలించి లోని వెండిమేనుమీనుల యందముల క్రొమేడితములు కల్పించెను. సన్నని నీటి పాయలలోని చిఱుకెరటములు త్రాఁచుపాముపిల్లలవలెనొడ్డునకుఁగొట్టుకొనుచువచ్చుచుండెను.

౫

కుట్టాన్ వీరభూపతి బుజముపై చేయివైచి, 'వీరా! సరే! నా హృదయము మండుచున్నది. నిన్న సాయంతనమున నీవుగూడ నీకేదో మహాభార మున్నట్లు చెప్పితివి. అది నాతోఁ జెప్పవా?' అని యడిగెను. వీరభూపతి కొంచెమాగి, 'మఱల నాకథ నాకేల స్మృతికిఁ దెచ్చెదవు? ఈజన్మకింతయే. అవివాహితుడనుగా నీ జీవితాంత ముండవలసిన స్థితియున్నను నాశరీరముమీఁద నాకే యధికారము లేకున్నది. వివాహ మేమో చేసికొనక తప్పునట్లు లేదు' అని సాలోచనాక్రాంతుఁడై చీఁకటులుమియుచున్న పడమటి దిక్కువంక నదే విధముగఁ జూడ మొదలిడెను. కుట్టాన్ లేచి నీటిపాయవద్దకుఁ బోయి పాదము

ళన మాచరించి, బొడ్డులోనున్న కత్తితీసి పదును సరిగాఁ జూచి మరల నొరలో నమర్చి, నీరు పుక్కిలించి యుమిసి వీరభూపతియొద్దఁ గూర్చుండెను. వీరభూపతి 'సేతూ! నీవు మహారాజులబిడ్డవు. నేను మిక్కిలి బీదవాడను. మనమిరువుర మొక్కతరగతి చదువుకొనుచుండుట మాత్రముచేత మన కిట్టి స్నేహ మెట్లొదఁగూడినది! ప్రాణపదము లైన రహస్యములు నీ వేమో నాకుఁ జెప్పితివి. నేను నీ కెట్లు చెప్పకుండఁగలను?' అని తనచేతితో నిరుపాయలుగాఁ దీయబడియున్న సేతుపతి తలవెండ్రుకల నిమురుచు, స్నిగ్ధములైన తనచూపు లతని మొగమున నిలిపి, 'సేతూ! నీవు నీభార్యతో నివసించుచుంటివి. మీ యిరువురికి సుఖములేదని నాతోఁ జెప్పితివి. పాప మా పిల్లను జక్కగా ప్రేమించుము. మహారాజుల యింటిబిడ్డ పేద గుడిసెలో నివసించు పిల్ల కన్న నందకత్తె కాకపోదు. కాదుపో? అంత సౌకుమార్యము పేదవారి కెక్కడనుండి వచ్చును? నా మనఃపూర్తిగా నిన్ను నీ భార్యను ప్రేమించుమని యడుగుచున్నాను. నీ భార్యను నీవు 'ప్రేమించెద' నని గట్టిగా నాతోఁ జెప్పినగాని నా కానందము లేదు. రేపు నేను వివాహము చేసికొనఁబోవుచున్నాను. నేను ప్రేమించిన స్త్రీ యేమో నాకు దుర్లభ. వివాహము చేసికొనకా తప్పదు. ఏమి చేయుమందువు? ప్రాణముపోయినను వివాహము చేసికోనని పట్టుఁబట్టనా? ఇట్లని నాపైననే యాశ లన్నియుఁ బెంచుకొన్న తలిదండ్రుల యాత్మలకు ముసలితనములో నెంత యావేదన తీసికొని రమ్మందువు? వివాహము చేసికొందును. అనంతరము వచ్చిన భార్యతో విముఖుఁడనై యుండి యేమి సంపాదించు

కొందును ? ఇహమా, పరమా ? ఈ జన్మమెత్తినది సుఖము లనుభవించుటకుఁ గాదు. కావున సేతూ! నీభార్యను నీవు "ప్రేమింతు"నని వాగ్దానమిమ్ము. అట్లొసంగినచో నాకథ నేను జెప్పెదను.' వీరభూపతి యిట్లు చెప్పుచుండగా కుట్టాన్ కనుల వెంట నీరు కార్చుచుండెను. వీరభూపతి కొంచెమాగి, 'తమ్ముడా! నిన్ను నేనిటుల సంబోధించుటకు నీవే యింత చన విచ్చితివి. కన్నులవెంట నీరు దేకుము. నేను నీకన్న నేవిషయము లోనను బెద్దవాఁడను గాకపోయినను వయసులోనైనఁ బెద్ద వాడను. అయ్యో ఇట్లేడ్చెదరా?' అని వీరభూపతి తన యుత్త రీయపుఁ గొంగుతో కుట్టాన్ కన్నీళ్లు తుడిచెను. వీరభూపతి మఱల, 'ఏమి! వాగ్దానముచేసెదవా ? అది నీ మేలుకోసమే చెప్పుచున్నాను. నీయందు నాకుఁగల స్నేహము నీవలన నీ వాగ్దానము తప్పక పుచ్చుకొమ్మని నన్ను వేధించుచున్నది. ఇక ముందు నీ భార్యతో నీవు "సరిగా నుందు" నని నాచేతిలో చేయి వేయుము!" అని కుట్టానును బలవంత పెట్టెను. కుట్టాన్ మాటలాడలేదు. వీరభూపతి మఱల 'నీ భార్య యందకత్తెయేనా ?' యని యడిగెను. కుట్టాన్ మారు పలుక లేదు. వీరభూపతి 'సేతూ! ఈ ప్రశ్న వేయఁ గూడదని నేనెఱుఁగుదును. నీయంతఃపురమును గురించిన నాయీ ప్రశ్న నాయందు నీకింత నెయ్యములేని యెడ నాశిరస్సును మొండెమునుండి విడిగాఁ జూచియుండును. నీ వామె సౌందర్యవతి యని యనుకొంటివేని నామెకుఁ గూడ నీ ప్రేమలోఁ గొంత పంచిపెట్టుము.' కుట్టాన్ మాటాడలేదు. వీరభూపతి—'సౌందర్యవతి కాదయేని కాదని చెప్పుము.'

కుట్టాన్ పెదవులు కదలినవి. వీరభూపతి—'సేతూ! బిగ్గరగాఁ జెప్పుము. నాగొంతులోఁ బ్రాణమున్నంత వఱకు నీ రహస్యమును బయటకుఁ బోనిచ్చువాఁడను గాను. నీకు నాయందంత నమ్మకము లేదా?' కుట్టాన్ నెమ్మదిగా, 'ఇదివరకు నే నామెను బరిశీలించి చూడలేదుగాని, గడచిన రాత్రి చూచితిని. ఆమె యందకత్తెయే యగును' అన్నాఁడు. వీరభూపతి 'అయిన నింక నేమి? నీ వసుందరమైన వస్తువును బ్రేమించుట లేదుకద. ఇది గృహస్థధర్మము. ప్రతివాఁడును జేయదగిన విధి. నేను నిన్నుఁ బ్రార్థించుచున్నాను.' వీరభూపతి కన్నుల నీళ్లు గ్రమ్మినవి. మరల వీరభూపతి యిట్లన్నాడు. 'నాకు వచ్చుచున్న దుఃఖమును బ్రయత్నముచే నాపుకొనుచుంటిని. నాయనా! నాకీ వాగ్దానమిమ్ము! కలకంఠికంట కన్నీరు రాలఁకరాదఁట. శ్రీయింట నుండ నొల్లదఁట. నాకీ వాగ్దానమిచ్చినగాని నే నిందుండి లేవను' అని వీరభూపతి కుట్టాన్ పాదములపైఁ బడుటకు సంసిద్ధుఁడైనాడు. కుట్టాన్ తొట్రుపాటు నంది, 'వీరా! ఎంతమంచివాఁడవు. ఇన్నాళ్ళనుండి యేమో వట్టి స్నేహితుఁడ ననుకొంటిని గాని, నేను నీవుగా నూహించుకొను నంతటి ప్రేమ నాయందు నీ కున్నదని తెలిసికొనలేకపోతిని. నిజముగా నింత ప్రేమకు నేననర్హుఁడను. నే నా స్త్రీని బ్రేమించలేకున్నాను. నీకోస మని ప్రేమించమందువా! 'ప్రేమించెదను. ప్రేమించెదను. వీరా! ప్రయత్నము చేసెదను. కాలము పట్టునట్లున్నది. క్షమింపు'మని కుట్టాన్ వెక్కి వెక్కి యేడ్వ మొదలుపెట్టినాఁడు. వీరభూపతి యతనిని గాఢముగాఁ గౌఁగిలించుకొని యతని శిరస్సును మూర్కొని, 'కాలము పట్టి

నంతమాత్రముచేత నేమియుఁ దొందరలేదు. సుష్ఠుగా విచా రించి చేయుము! పదిసారులు నేను జెప్పవలసిన దేమున్నది? వాగ్దాన మిచ్చితివి. జ్ఞాపకముంచుకొమ్ము' 'ఆ, ఇచ్చితి' నను నర్ధకంఠస్వరములో కుట్టాన్ శిరస్సు అంగీకారార్థచలనము గనఁబరచినది. తరువాత నర్ధఘుటికసే పెవ్వారును మాటాడ లేదు. కుట్టాన్ తలయెత్తి వీరభూపతి వంకఁ జూచెను. ఆ చూపు వీరభూపతి నతని గాధ చెప్పుమని యడుగునట్లున్నది. వీరభూ పతి కనులలో మెఱపు మెఱసి నట్లయినది. అతఁడు తలవంచి, కుడిచేతితో వ్రేఁగ్రై యిసుక గుప్పిళ్ళుగాఁ దీసికొనుచు వదలి పెట్టుచు, 'సేతూ, ఈరహస్యము నెవ్వరికినిఁ జెప్పఁదలంచుకొన లేదు. ఎవ్వరికినిఁ జెప్పనని యొట్టువెట్టికొంటిని. ఆ యొట్టును గూడ నిర్లక్ష్యముచేసి నీకుఁ జెప్పించుచున్న యీ శక్తి యెందున్నదో నాకుఁ దెలియుట లేదు. నీవు నీరహస్యములు నాకంతగాఁ జెప్పుటచేత నా హృదయము నీ యెడలఁ గరఁగి నీరైనది. నీవంటివాఁడు నాదో నంతచనువు, నంతప్రేమ చూపించుటచేత నా హృదయమునకు లేని మార్దవము వచ్చి నది. ఉన్నపట్టుదల సడలినది. కాని, సేతూ! నా కథ చెప్పెద ననుకొనుము. చెప్పి ఫలితము లేదు. నా జన్మలో నా కోరిక సఫలము కాదు. అగుటకు వీలు లేదు. అది నాకుఁ దెలియును. అయినను దానివలన నా హృదయము బాధపడుచునే యున్నది. ఆ విషయము నామనస్సు మఱువ లేకున్నది. నిజ ముగా నీసంగతి చెప్పఁదగినవా రెవరైన నున్నారా యనినచో, నీవు తక్క నింకెవ్వరును లేరు. కాని నాదొక ప్రార్థన. నే నా కథ చెప్పుచుండగా నీవు నన్నేమియు నడుగవద్దు. ఎంత చెప్ప

వలయునో యంతయుఁ జెప్పెదను. ముఖ్యముగా నూరిపేరులు మాత్రము దాచెదను. అవి చెప్పుట నాకిష్టములేదు. అవి తెలిసినంతమాత్రమున నాకు లాభమునులేదు. అయినను జెప్పెదను. మాది రాజవల్లిపురము, తెలుఁగుదేశము; మా తాత తండ్రి విశ్వనాథనాయకులవారి వెంట నీ దేశమునకు వచ్చినాఁడు. యుద్ధసమయములయందు మా పూర్వులు కత్తులు గూడఁ బూనిరి గాని, వారెక్కువ భాగము వ్యవసాయదారులు. మా తాతలు ముగ్గు రన్నదమ్ములు. మాతండ్రులు నల్గురు. మాతండ్రికి మేము ముగ్గురము. విశ్వనాథనాయకులుగా రిచ్చిన భూమి యంతయు మావంశముక్రింద పంపుళ్ళయిపోయినది. నేటికి నే నుద్యోగము చేయవలసివచ్చినది. నాకిప్పు డిరువది యెన్మిదేండ్లు. మా యన్నదమ్ములు నేను బంచుకొని సంవత్సరమైనది. మావారుపూర్తిగా వ్యవసాయము చేసికొనుచున్నను యుద్ధవాంఛ మా యింటఁబూర్తిగా చావ లేదు. అవసరము వచ్చెనేని నిప్పుడైనను దేశక్షేమమునకై రక్తమోడ్చుటకు మాయింటఁ బసిపిల్లకూడ వెనుదీయదు. నా యిరువది నాల్గవయేట, నేటికి నాలుగేండ్లక్రింద, నేనొక కారణాంతరముచేత నొక యూరు పోతిని. ఆ యూరుపేరుగాని, యా పనిగాని నన్నడిగి నా మనస్సుఁ గలతపెట్టకుము. ఒక నాడు నేను స్నానముచేసి తెల్లని మడుపులుధరించి యాయూరి వెంట వాహ్యాళి పోయితిని. ఆత్మస్తుతి యనుకొనకుము. అప్పుడు నేను చాల నందముగా నుండెడివాఁడను; గృహాసంబంధమైనవియు, నా మనోజనిత మయినవియు ననేక కష్టముల చేత నా యంద మంతయుఁ బోయినది. ఇప్పుడు నాకనులలో

దురాలోచన యేర్పడినది. అప్పుడు నా నేత్రములు దుఃఖ మెఱుంగని జీవనేత్రములవలె, సాయంవికసితనీలకైరవమ్ముల వలె నుండెడివి. నా కాయూరు క్రొత్త. పోవుచుండఁగా నూరిబయట నొక వీథియందు పెద్దసౌధమున్నది. ఆ సౌధ గవాక్షమునుండి యొక జగన్మోహనాకృతి నా వంకఁ జూచు చుండెను. నే నామెవంకఁ జూచితిని. ఆహా! ఆ యంద మేమని చెప్పుదును! అది సాయంకాలము. శిశిరర్తువు వెనుకఁ బట్టుచున్నది. వసంత మేతెంచుచున్నది. వసంతము తన వెంటఁ దెచ్చిన యన్ని కుసుమములలోఁ గూడ నంత సౌందర్యము లేదు. నేను జూచితినో లేదో, యామె తల వెనుకకుఁ దీసి కొన్నది. ఏమి చేయుదును! వదలిపోవుటకుఁ గాళ్లాడ లేదు. వెళ్లిపోవుద మనుకొంటిని. కన్నీళ్ళు వచ్చినవి. చూచినచో, నా సౌధ మెవ్వరిదో గొప్పవారిదివలె నున్నది. నే నెక్కడ, ఆ సౌధశ్రీ యెక్కడ? నా హృదయమున నాశాతంతువు లిది తలఁచుకొన్నకొలఁది భిన్నభిన్నము లయ్యెను. ఇంతలో గవాక్షముమీఁద నొక పట్టుతెర దిగిపోయినది. ఆ తెర నా ప్రేమజ్యోతి నార్పివేసిన ట్లున్నది, వదలలేక వదలలేక కాలు పెగుల్చుకొని బసకుఁ బోతిని. ప్రొద్దుగ్రుంకలేదు. తెల్ల వారలేదు. తెల్లవారలు నిదుర లేదు. తెల్లవారకముంద కాల్య కృత్యములు నెఱవేర్చుకొని, మఱల స్వచ్ఛదుకూలములు ధరించి, తల దువ్వుకొని, బసలో నిలువుటద్దమున్నది—దాని వద్దకుఁబోయి చూచుకొంటిని. తెల్లవారులు నిదుర లేక కన్నులు జోతులవలె నెఱ్ఱగా నున్నవి. చెక్కిళ్ళు తోసుకుపోయినవి. కనులు మూతలు పడుచున్నవి. కాని యెంత యందముగా

నుంటిననుకొంటివి! నన్నుఁ జూచి నేనే మోహపడిపోయితిని. అదియంతయు మనసులో నున్నదేమో తెలియదు. సుఖదుఃఖములుగాని, సౌందర్యాసౌందర్యములు గాని మనస్సు ననుసరించినవేకదా! సరి; మఱల నా వీథినే పోయితిని. పోయి యెదో పనియున్నట్టు లందుఁ దిరుగుచుంటిని. కొంతసేపటికి గవాక్షముపైనిఁ దెర చిలుకఱెక్కలవలె ముడుచుకొన్నది. లోనుండి యా జగన్మోహనవదనము నా కనులయెదుటఁ గనంబడినది. సేతూ! అది కనంబడినదో, లేదో నేనే నమ్మలేకుండ నున్నాను. అదియేదో బహుపుణ్యరాశి యగు నక్షత్రము. ఏ పాపలేశముచేతనో భూమిమీద వచ్చిపడినది. ఒక్కనిమేషము మే మిర్వురము పరస్పరదృక్ప్రసార ప్రవాహములో మునిఁగి పోతిమి. మరల నెమ్మదిగాఁ దెర దిగినది. ప్రొద్దెక్కినకొలఁది నాకు ధైర్యము సడలినది. నేనందున్నంతసేపు మాటిమాటికిఁ దెరనుండి యామె నావంకఁ జూచుచునేయున్నది. అది మొదలు నేను నా యూరు పోయిన పని మఱచి, యుదయము సాయంతనము నావీథికిఁ బోవుట, యామెను జూచుటతోడనే గడపితిని. ఆమెయు నాయందు సాభిప్రాయ వలెనే మెలంగినది. ఇట్లొక వారము రోజులు గడచినవి. ఆమె యినుప కోటలో నున్నది. బయటకు వచ్చుటకు వీలులేదు; నేను లోనికిఁ బోవుటకు వీలులేదు. ఏమి చేయుదును? ఈ వారము రోజులలో నామె యప్పుడప్పుడు గవాక్షమువద్దఁ గనుపించుటకు వీలు లేకుండెడిది. ఒకనాఁడు సాయంకాలమున నామె నావంకఁ గనురెప్ప వాల్పక చూచి; కనులు గట్టిగా మూసికొని, కొంచెము సేపుండి తెఱచి లోనికిఁ బోయినది. మఱల

రాలేదు. అది యేదో సంకేతమని యనుకొంటిని గాని, నా బుద్ధి దాని నిజమ్ము గ్రహింపగలిగినంతగాఁ బోలేదు. బసకుఁ బోయి భోజనము చేసి, యారాత్రి—చీఁకటిరాత్రి—రెండు జాములవేళ నా సౌధగవాక్షముకడకుఁ బోయితిని. గవాక్షము నుండి వెలుతురు కనబడుచుండెను. నేను గవాక్షమునకుం గొంచెము దూరముగా నిలుచుండి దగ్గితిని. ఆమె యది గ్రహించి లోనుండి యొకవస్తువు విసరివైచి లోనికిఁబోయెను. గవాక్షము చీఁకటి యైపోయినది. నేను జీఁకటిలో వెదకికొంటిని. వీథియంతయు గుమ్మనఁ బరిమళించుచుండెను. వెదకుచున్న వస్తువు దొరకినది. అది పెద్దజాజులు, మల్లెలు కూర్చి కట్టిన చెండు. ఆ సువాసన నేను బట్టలేకపోయినాను. బసకుఁ బోయి యీ పూలచెండు నెదుటొమ్ముపై నుంచుకొని కనులు మూసికొని పండుకొంటిని. మనసు నిలువలేదు. నిద్రయెక్కడ నుండి వచ్చును? అది పూలచెండు మాత్రమే కాదనుకొంటిని. మనసులో దేవతలుకూడ వాంఛించని కోరికలు నిర్మించుకొంటిని. అందరు నిద్రపోవుచుండిరి. కాన దీపముదగ్గరకుఁ బోయి చెండును ముద్దుపెట్టుకొంటిని. ఎదురొమ్మున నాన్చుకొని యాప్రియురాలి హస్తము తాకినట్లు సంతసించుచుంటిని. నాయొడలు గగుర్పొడిచినది. నవ్వుకొనియెదవా? ఏమిచేయను? అన్నియు నీతోఁ జెప్పుచుంటిని. ఏదో బుద్ధిపుట్టి పూలచెండు చిదిమివేసితిని. ఆశ్చర్యమైపోయినది. లోన నొక యుత్తరమున్నది. భూర్జపత్రమునిండ నక్షరములు విస్పష్టముగాఁ గనంబడుటకుఁ గస్తూరియు పునుఁగును నలందఁబడియున్నవి. ఆ వాసన లిల్లంతయుఁ గ్రమ్మివేసినవి. ఆ వాసనలచేత దీపము

పోవుదేమో యనుకొంటిని; ఇంటిలోనివారందఱు మేల్కొందు
రేమో యనుకొంటిని. ఉత్తరము చదువుటకొఱకు ముందే
దాచుకొనవలయు ననిపించినది. ఎచ్చట దాతును? హృద
యము చించి లోన దాతునా? హృదయము చించుకొను
టకుఁ బజ్జ కత్తి లేకపోయినది. ఆవారము దినములనుండి నా
బాకు బొడ్డులో లేకుండగనే నేను దిరుగుచుంటిని. మఱల
నావేళ మాపుకొని యుత్తరమును జదువ మొదలు పెట్టితిని.
ప్రత్యక్షరమునందును నూత్న స్వర్గములు నిర్మింపఁబడియున్న
యీ యుత్తరము పూర్తిగాఁ జదువుట నాచేత కాలేదు.
తక్కినది రేపు చదువవచ్చును లే యని పోయి పండుకొంటిని.
ఎట్లు పండుకొనఁగలను? మఱల దీపమువద్దకుఁ బోదును; కొం
చెము చదువుదును. ఎవ్వరైన లేచెదరేమో యని భయము.
ఆరాత్రి నా జీవితములోఁ బరమమైన కాలము. అంత యానంద
మారాత్రి యనుభవించితిని. కాని తరువాత నీ నాటివఱకు
దుఃఖము వారడి యనుభవించవలె నని వ్రాసినాఁడు కాఁబోలు
విధాత. నేను నిద్రపోవుటకుఁ గోడికూసినది. నిద్రపోవుటకు
కాదు, మఱల శయ్యపైఁ బండుకొనబోవుటకు. తెల్లవారు
సరికి నేను వచ్చినకార్య మాలస్యమయిన దని నాతండ్రిగారు
వచ్చిరి. నేను వెళ్ళినకార్యము చాలఁ దొందర యైనది. నే నా
పనిచేయక పోవుటలో నా కెంత దోషమయినఁ దప్పు కాని నేనేమి
చేయగలను? మఱునాడు పనియైనది. ఇంటికిఁ బోవలెను. నే
నాయూరు వదలిపెట్టలేను. మాతండ్రితో ఘళ్ళితిరవలెను.
దారిలో బండినెక్కి మాయూరు పోవుచున్నాము. మాతండ్రి
గారట్టైను మాయూరికిఁ జేరవేయుచున్నాఁడు. నన్ను నహ్యాస

నాగములు తోఁకలతో చుట్టివేసి వెనుకకు లాగుచున్నట్లు అత్యుత్తమమైన కస్తూరి కాపులు మా నాయనను సమాశ్రయించినవి. నన్నడిగినాఁడు. నేను చెప్పలేదు. ఇంటికిఁ బోవునంతలో రహస్యమంతయు మా తండ్రికిఁ దెలిసినది. మాయమ్మగారికి నాయనగారు చెప్పినారు. ఉత్తరక్షణములో నా పెండ్లి యెవరితో, నే నెట్టివానిని గలిసికొనవలయునో, సర్వము వ్రాయఁబడి యున్నది. ఇంక నెన్ని విషయము లున్నవి? అవి నేను దక్క నింక నెవ్వరు చూడరాదు. వినరాదు. అవి మా తల్లియుఁ దండ్రియు నెఱింగినపుడు నామనోవ్యథ యెట్లున్నది? క్రౌంచము పైనుండి పక్షులు పడగమీఁదఁ దన్నుచుఁ బొడుచుచు నుండిన దాని కెంత వ్యథయో యంత నరకబాధ యనుభవించితిని. కాని వారు నా తల్లిదండ్రులు కారా! ఆ రహస్యము నాల్గవనోటఁ బడలేదు. తక్కిన నా సహోదరులు నెఱుఁగరు. నా జననీ జనకులు నన్ను గడ్డము పుచ్చుకొని బతిమాలిరి; ప్రార్థించిరి; మహాపద నెత్తిపైకిఁ దెచ్చుకోవద్దనిరి. జొన్నచేనులో మంచెయే కాని సౌధము కూడదనిరి. అనేకవారములు కన్నీరు పెట్టుకొనిరి. సేతూ! ఇటు మనస్సులోని కోరిక చంపుకొననా? ఫలోన్ముఖమైనది. ఎదుట స్వర్గములు స్పష్టముగాఁ గాన్పించుచున్నవే! కనులుమూసికొన్న నా మెతక నింక నేయాకృతియు లేదు. అట్లుఁ దల్లిదండ్రుల మనస్సున కానందము గలిగించనా! ఆ రోజులలో నాకు భోజనము లేదు, నిద్ర లేదు పిచ్చిదానివలెఁ జూచుచుంటిని. నా తల్లియుఁ దండ్రియు నొక్క నిమేషమును గూడ నన్ను వదలియుండ లేదు. రెండు నెలలైన తరువాత నాతల తిరిగినది. ప్రపంచకములోఁ బడినాను. ఒకరోజు

లలో నాస్వప్నములు, కన్నుమూసిన గనంబడు ఘోరదర్శనములు నేమని చెప్పుదును! చివరకుఁ దల్లిదండ్రుల మీఁది ప్రేమయే జయించినది. తరువాత సంవత్సరము వఱకుఁ గనులు మూసినచో నా ప్రేయసి కనంబడుచుండెడిది. ఇప్పు డామె నాకలలోనికిఁగూడ వచ్చుట మానివేసినది. నే నది మొదలాయూరు పోవుటకు వీలులేకుండఁ జేసినారు నాతలిదండ్రులు. నే నాయూరు వెళ్ళినచో నాతలిదండ్రులు చని పోవుదురని నాకుభయము. వార ట్లన్నారు. నే నా గ్రామము వంకఁజూడనని నాతల్లికిఁ దండ్రికి వాగ్దానము చేసితిని. ఈరీతిగా నా ప్రేమ యెడారిలోఁ దవంత దా నదృశ్యమైన నదివోలె మాయమైనది."

తరువాత నిశ్శబ్దత; అంధకారము.

౬

దినములు యథాస్థితిగఁ జనుచున్నవి. కుట్టాన్ మనస్సు కల్లోలము వీరభద్రభట్టరునకుఁ గొంచెము తెలిసినది. కారణము తెలియలేదు రామనాథమున కుత్తరము పోయెను. ఒకరోజున కుట్టాను వీరభద్రభట్టరులు రాజనీతిపాఠశాలకుఁ బోయిరి. మధ్యాహ్నమున సూర్యుఁడు తీక్ష్ణాంశువులను జిమ్ముచుండెను.

ఏకవీర భోజనము క్రమక్రమముగా తగ్గిపోవుచుండెను. ఆమె శారీరకముగా రోజురోజుకు క్షీణించిపోవుచుండెను. మాంసలములైన యామె నేత్రములు గుంటలు పడినవి. కపోలములయందు రక్తమాంసములు క్షీణించి, పావురాయిపిట్టపొట్టవలె మృదువై తళతళలాడు నామె వదనము తేన

పట్టువాడిపోయిన వృక్షశాఖవలె శోభాహీనమైనది; చిక్కిపోయి నది. దినదినము సంస్కారము లేక యామె కేశములు సంస్కృతములైనపుడు స్నిగ్ధములయ్యెఁ దక్కిన వేళల నరమ్య ముగా నుండెను. వచ్చిన క్రొత్తలోఁ దల మాయనీయక, వలువ మాయనీయని యా యెలనాగ శ్రద్ధ క్రమముగా వాని పైనుండి తొలంగిపోవుచుండెను. ఈరహస్యములు దాసీ జనములనుండి యెట్లు తప్పించుకొనఁగలవు? ఏకవీర మిగుల ధైర్యముకలది. దిట్టమైనగుండెకలది. పరమములైనరహస్యములు జీవితాంతము తన మనస్సులోననే దాచియుంచఁగల మనోదార్ఢ్యము గలది. ఆమె రహస్యము బ్రహ్మదేవునికిఁగూడఁ దెలియదు.

తిరుచునాపల్లిమండలములో 'ఆల్వారుకురిచ్చి' యనునొక గ్రామమున్నది. ఆగ్రామమునే యంబాసముద్రమనియు వ్యవహ రింతురు. అంబాసముద్రము తిరుచునాపల్లిమండలములలోఁ బెద్ద యూరు. తిరుచునాపల్లి యంత కాకపోయినను గొంచెము తక్కు వగానైన నుండును. తిరుచునాపల్లి మండలాధిపుని క్రిందఁ బది మంది పాళెగాండ్రుండిరి. మధుర నాయకులకుమండలాధిపు లెట్టి వారో మండలాధిపులకు వీ రట్టివారు. అంబాసముద్రము పాళె గాని క్రింద నాలుగువందల గ్రామము లున్నవి. ఈ యాలుగువందల గ్రామములమీదఁ నతఁడేయధికారి. అతని క్రింద నైదు వేల సైన్య మున్నది. తిరుచునాపల్లి మండలాధిపుని పాలెగాండ్ర యందఱి లోనను నంబాసముద్రాధిపతి మిక్కిలి ధనవంతుఁడు. బలశాలి. అంబాసముద్రములో నతని కోటయున్నది. చిన్నపాళెగాండ్రు కోటలు గట్టరాదు. అయినను నితఁడు కోటకట్టినపుడు మండ లాధిపుఁ డేమియు ననలేక యూరకుండెను.

ఏకవీర యతనికూఁతురు. ఏకవీరకుఁ దమ్ము లిద్దరున్నారు. ఆమె తండ్రి కామె యొక్కతయే స్త్రీసంతానము. చిన్నప్పటి నుండియు నేకవీర గొప్పయింటఁ బుట్టినది గాన దక్కిన రాజభోగముల ననుభవించినది గాని తండ్రి వాత్సల్య మెఱుఁగదు. తండ్రి యొక రాక్షసుఁడు; మిక్కిలి క్రూరుఁడు. అతఁడు తన పాళెములోఁ బన్నులు ప్రోగుచేసినపుడు కాని, తక్కిన యే రాచకార్యమందుఁ గాని మిగులఁ గఠినుఁడు. భార్యయందుఁగాని బిడ్డలయందుఁ గాని ప్రేమ యన నేమో యతనికిఁ దెలియదు. అతని వదనము విలోకించిన రాక్షసునిఁ జూడనక్కఱ లేదు. కాని యేకవీరతల్లి సుగుణాలవాల. సామాన్యముగఁ బ్రపంచమున దుర్జనునికి సుగుణవతిని, సుజనునకు దుష్టయగు భార్యను కురూపికి నందకత్తెను, నందగానికిఁ గురూపిణి యయినయువతిని సంతరింపఁజేయు భగవంతుని యుద్దేశ మేమో యెవరికిఁ దెలియును? ఏకవీర తండ్రి యెంత దుర్మార్గుఁడో తల్లి యంత సన్మార్గ. తండ్రి యెంత రాక్షసుడో, తల్లి యంత భూదేవత. తండ్రి యెంత వికృతస్వరూపుఁడో తల్లి యంత సౌందర్యవతి. ఏకవీర సౌందర్యమునందు మూఁడుమూర్తులఁ దల్లినిఁ బోలి పుట్టినది..

ఉదయన్ సేతుపతి తన కుమారునకు నేకవీరను జేసికొన్నందువలన నతనికి బది గ్రామములు వచ్చినవి. ఏనుఁగులు, గుఱ్ఱములు, ధనము తగినంత ముట్టినవి. వివాహము అల్వార్ కురిచ్చిలోనే జరిగినది. వివాహము మూఁడురోజులుఁ బెండ్లికూఁతురునకు జబ్బు, పెండ్లికుమారునకు జబ్బు. ఆ మూఁడు రోజులుఁ బెండ్లికుమార్తె యేడ్చుచున్నది. అందఱుఁ బసిపిల్ల

భయపడిన దనుకొన్నారు. కొంతవరకు మూర్ఖ్యమనుకొన్నారు. పెండ్లిలో కుట్టాన్ స్థితి చిత్రముగానున్నది. అతఁడు తండ్రికి భయపడి యేమియు మాటాడలేదు. తండ్రి లేనపుడు అందరమీఁద విసుగుకొనుచుండెడివాఁడు. పెండ్లిలో నొకరు కొఱికిన తములపాకు లొకరు కొఱుకలేదు. ఒకరి పేరొకరు చెప్పలేదు. చివర దినమున నేకవీర చెప్పినది. కుట్టాన్ నోట మాట రాలేదు. అందఱకు భయమైనది.

ఏకవీర కిపుడు పదునెనిమిదేండ్లు. ఆమె సౌందర్యము నకుఁబోలిక నిండుగాఁ బ్రవహించు నది; కంకెవిడిచి మురువు లొలుకుఁ బంటచేను. ఆమె ద్రావిడభాషలోని చక్కని గ్రంథము లన్నియుఁ జదివినది. తన తండ్రియింట నొక పుస్తకమైన లేదు. తల్లితోఁ జెప్పి పురోహితుని యొద్దనుండి తెప్పించుకొని చదివినది. ఆమె మనస్సు చక్కని గ్రంథములు చదువుట చేతఁ జిగిర్చి, ఫలములు గాచి, పరిపక్వమైనది. ఆమె సుకుమార భావములకుఁ బుట్టినిల్లు.

ఆ మధ్యాహ్నమున సూర్యుఁడు తీక్ష్ణాంశువులఁజిమ్ముచుండెను. ఏకవీర గదిలోనికిఁబోయి పండుకొన్నది. తన పెట్టె తీసి యందుండి 'అవ్వయార్' వ్రాసిన 'కొండ్రైవెందన్'. 'అతిచ్చూడి' అను రెండు చిన్నపుస్తకములను దీసి చదువుచుండెను. అవ్వయార్ అఱువదియేండ్ల వృద్ధస్త్రీ; సరస్వతీదేవి యపరావతారము. ఆయమ వ్రాసిన గ్రంథములు మిక్కిలి సులభములై, యర్థవంతములై, యాంధ్రభాషలోని భీమకవి సుమతీశతకమువలెఁ బిల్లలకుఁ బాఠయోగ్యములుగా నుండును. ఏకవీర 'అతిచ్చూడి' గ్రంథము తీసి మొట్టమొదటనే

'ఆరంజేవిరుంబు' (ధర్మము చేయుము), 'ఆరవదుశినం' (కోప పడకుము) అని చదువుకొని పుస్తకము మూసెను. పుస్తకములు రెండును మఱలఁ బెట్టెలోఁ బెట్టెను. ఆమె మనస్సులో మాటిమాటికి 'ఆరంజేవిరుంబు', 'ఆరంజేవిరుంబు' అను ధర్మమూరకే మ్రోఁగుచున్నది. ఆమె కనులు మూసికొని తన సెజ్జపైఁ బండుకొన్నది. పండుకొన్నది హఠాత్తుగా లేచి తలుపుదగ్గరకుఁబోయి యెవరో వచ్చిరనుకొని చూచి, పొరపాటు పడితి ననుకొని పోయి మఱలఁ బండుకొన్నది. వేసఁగి. ఒడలంతయుఁ దుకతుకలాడి పోయినది.

సౌధపశ్చాద్భాగమునఁ గుడ్యమున వసారాలో నొక చిన్నగోడ చదరముగాఁ గట్టబడి యున్నది. దానినిండ నెల్లపుడు నీరము నిండియుండును. గచ్చుతోఁ గట్టబడి యుండుట చేత నందులోని నీర మెల్లవేళలఁ జల్లగా నుండును. ఏకవీర నగ లన్నియుఁ దీసి, సేలువ దూరముగా నుంచి, బంగారపుఁ బని గల తన చీర విప్పకుండనే యానీటి దగ్గరకుఁ బోయి నీటిలో మునిఁగెను. ఆ నీర మామెకు నెదురొమ్ము వఱకు వచ్చెను. శిరస్సు పూర్తిగా నీటిలో ముంచెను. అంతకుముంద సేవకురాలు మల్లికాపరిమళభరితమైన తలనూనె రాచి సంస్కరించిన యామె కేశముల జడముడి యామె యూడఁదీసి వదలి పెట్టుటచేత నా చిన్ని నీటిగుంటలో నాచువలె మెఱసెను. ఆమెతలనూనె వాసనచేత నీరమంతయు గుమ్మ్మని పోయినది.

ఒక పనికత్తె యిది చూచి, 'అమ్మా! ఇదియేమి? ఒడలు తోముదునా?', అన్నది. ఆజ్ఞాబద్ధమైన యేకవీర బాము

ముడికి బెదరి యది మాటలాడకుండఁ బోయి ద్వారము వెనుక నుండి యామె వంకఁ దొంగి చూచు చుండెను. ఏకవీర కొంచెము సేపైన తరువాత లేచి తన గదిలోనికిఁ బోయినది. పోయిన దారియందు నీరు ప్రవాహము కట్టినది. గదిలోనికిఁ బోయి తలుపు వేసికొని, తడిబట్ట విప్పకుండనే నేలమీఁదఁజతికిలఁబడి, యెడమపిడికిలి యెడమ చెక్కిలి కాన్చి కూర్చుండెను. ఎదురుగా గోడమీఁద మీనాక్షీదేవి వస్త్రము శ్రీ సుందరేశ్వరుఁ డపహరించు చున్నట్లుగాఁ జెక్కఁబడిన విగ్రహము లున్నవి. అవి గోడలోననే గచ్చుతోఁ జేయబడినవి. వాని వంకఁ జూచుచుండెను. "ప్రభూ! సుందరేశ్వరా! యోగీశ్వరేశ్వరుఁ డగు నీకుఁ గూడ నీ మోహపాశములు వదల లేదా? తన మనస్సంతోషమునకై మనుష్యుఁడే నిన్నిట్లు వ్రాసినాడు!' ఏకవీర నిలుచుండి చీరకొంగును చేతితోఁ బిండినది. నీళ్ళు నేల మీఁదఁ గాలువకట్టినవి. ఏకవీర యాచీరవిప్పి తలయు నొడలు శుభ్రముగాఁ దుడుచుకొని పెట్టెతీసెను. పెట్టెలో నున్న యన్ని వస్తువులుతీసి క్రిందఁబఱచెను. పెండ్లినాఁడు తన మేన మామ తన కొక చీర పెట్టెను. ఆచీరమీఁద నేకవీరకు మిక్కిలి యిష్టము. అది తీసి కట్టుకొన్నది, భూషణములన్నియు నమర్చికొన్నది. నిలువుటద్దమువద్ద నిలుచున్నది. తన సౌందర్యమునకుఁ దానే వగచినది. ఏదో భావ మంతలో ఏకవీర మనసులో మెఱుపువలె మెఱసినది. ఏకవీర ప్రక్కనున్న సెజ్జపైఁ బడిపోయినది; ఏడ్చి ఏడ్చి నిదురపోయినది.

౭

రుద్రమూర్తియై కుట్టాన్ పూలదండ విసరి త్రెంచిన నాఁటనుండియు నతఁడు జేల నేకవీరతో నిదురించుటకుఁబోవుట లేదు. దేహ మస్వస్థతగా నున్నదని చెప్పి తనగదిలోననే నిద్రించుచున్నాఁడు. సరిగఁ బాఠశాలకే పోవుటలేదు. వీరభద్ర భట్టరునకుఁ గారణము తెలియదు.

వెనుకటి ప్రకరణములోఁ జెప్పినవిషయములు జరిగిన మఱురోజున కుట్టాన్ పగలెల్ల నేమియుఁదోచక తిరుగులాడి సాయంకాలమున స్నానముచేసి శుభ్రవస్త్రధారియై సాయంవాహ్యాళిపోయి యింటికిఁ బెందలకడ తిరిగివచ్చెను. ప్రొద్దు గ్రుంకఁబోవుచున్నది.

చదువుకొను గదిలో కుట్టాన్ తనసెజ్జపైఁబండుకొనెను. అతనికన్ను లెఱ్ఱగానుండెను. కుట్టాన్ కన్నులు మూఁతపడెను. మూఁతపడిన వెంటనే యతనిప్రేయసిమొగము కనంబడిమఱలఁ గానరాకుండెను. కుట్టాన్ కనులు తెఱచి మఱల మూసికొనెను. వీరభూపతి దీనములైన కనులతోఁదన్నుఁ దనభార్యను ప్రేమించుమని బతిమాలుచున్నట్లు కనంబడెను. కుట్టాన్ లేచి కూర్చుండెను. అతఁ డిట్లాలోచించెను: వీరభూపతి నన్నేల నా భార్యను ప్రేమించుమని యడుగవలెను? అతనికి నా భార్యకు నేమి సంబంధమున్నది? నేను నా భార్యను ప్రేమించిన నతని కేమి? ప్రేమించకున్న నతనికేమి? నేను నా గృహవిషయము లతనికేలఁ జెప్పితిని? అయ్యో! అంతఃపురవిషయము లతనితోఁ జెప్పునంతటి బుద్ధిహీనుఁడ నైతినే." కొంచెముసేపు నిశ్చలమైనచూపుతో గవాక్షమునుండి బయటనున్న పోకచెట్లవంకఁ

గుట్టా నొకచే రీతిఁగాఁ జూచెను. అంతలో మఱల శయ్యాపైఁ బండుకొనెను. మఱల నతని మనస్సాలోచన చేయ మొదలు పెట్టెను. 'వీరభూపతి నాకు మిక్కిలి నెచ్చెలికాఁడు. చెలికానితోఁ జెప్పఁగూడని రహస్యము లేముండును.? వీరభూపతి కీ రహస్యములు చెప్పినందునఁ దప్పేమియు లేదు. అతఁడుమాత్ర మతని రహస్యములు నాతోఁ జెప్పలేదా ? అయ్యో ! ఎంత దుస్థితిలో నుంటిని. నానీడను జూచుకొని నేనే బెదరుచుంటిని. నేను మిత్రుఁడను గనుక నా క్షేమముఁగోరి నాకు హితము చెప్పెను. ఇంతమాత్రమునకు నా భార్యకు నాతనికి సంబంధమేల యుండవలెను ? మనస్సు మిక్కిలి చెడ్డది. దీనికీభావము రావచ్చును, ఈ భావము రారాదు అని లేదు. ఆ స్త్రీ మొగము చూడలేకున్నాను. ఆమెతో మాటలాడుటెట్లు? ప్రేమించుటెట్లు?' కుట్టాన్ లేచి వ్రాతబల్లవద్దకుఁ బోయెను. బల్లసొరుగులోనుండి యొక భూర్జపత్రముఁ దీసి కలము, సిరాబుడ్డియు దగ్గర నుంచుకొనెను. ఎవరికో యుత్తరము వ్రాయవలెనని సంకల్పించినాఁడు. ఉత్తరము వ్రాయుట మఱల నంతలో సంక్షేపించి శయ్యాపైఁబోయి పండుకొన్నాఁడు. కనులుమూసికొన్నాఁడు. అసందర్భములైన భావములు లక్షలు వచ్చెను. ఈపాటున నేను జనిపోయినచో నేమగును? ప్రొద్దుపోవు వఱకు నెవరికిఁ దెలియదు. భోజనమువేళకు వీరభద్రభట్టరు వచ్చును; నన్నుఁజూచును. కేకలు వేయును. అందరు వత్తురు. రాజుకూడ నన్నుఁజూచుటకు వచ్చును. రాజుగారి రెండవ కుమారుఁడు తిరుమలనాయకుఁడు నాకుఁ బరమమిత్రుఁడు. నేను జనిపోయితి నని వినినచో నతఁడేమగునో ? ఈవార్త విని మా

తండ్రియుఁ దల్లియు వత్తురు. మాతల్లి బ్రతుకదు. అయ్యో! నేను జనిపోవుటకుఁ గారణ మిది యని యెవరికిఁ దెలియగలదు. నా ప్రేయసి నేను జనిపోతి నను వార్త విని నచో నేమనుకొనును? ఇప్పటి నాభార్య యేమిచేయును. ఏడ్చునా? ఏడ్వదు. నాకు నామెకు నేమిసంబంధము? అయిననేమి? జీవితాంతము విధవాత్వ మనుభవింపవలదా? కొంత ప్రేమ యుండక పోదు. లేకున్న నారాత్రి పూదండ నా మెడలో నేల వేయును? కుట్టాన్ భావవాహిని యాగలేదు. ఆప్రవాహము ప్రవహించి ప్రవహించి కొంతదూరము పోయి యాగినది. కుట్టాణ్ లేచి కూర్చుండెను. కుట్టాణ్ ప్రాణము నెమ్మదివడినట్లుండెను. వ్రాత బల్లవద్దకుఁ బోయెను. ఇట్లు వ్రాయ మొదలిడెను: 'ప్రాణేశ్వరీ!' యని సంబోధించెను. అతని మనస్సభ్యంతర పెట్టెను. అది కొట్టివేసి, 'కులకామినీ!' అని సంబోధించినాఁడు. ఆపత్రము చింపివేసి వేఱొక క్రొత్త పత్రముఁదీసి దానిపై 'కులకామినీ' సంబోధనము వ్రాసినాఁడు తరువాతఁ దన పూర్వప్రేమ విషయము వ్రాసినాఁడు. ఇది యంతయు నెందుకనుకొని పత్రము మఱలఁ జించివేసెను. ఇంటిలో నున్నదానికి లేఖ వ్రాయుట యెందులకు అని తోఁచినది. వెళ్ళి యేకవీరతో మాట్లాడుద మనుకొన్నాఁడు. మఱల 'ఏమని' అని ప్రశ్న వచ్చినది. ఆలోచన తెగలేదు. ఇంతలోఁ దలుపుచప్పు డయినది, అటు చూచినాఁడు. వీరభద్రభట్టరు తలుపు తెఱచుకొని లోనికివచ్చి యొక లేఖ యందించినాఁడు.

కుట్టాణ్:—'ఏమి టిది?' భట్టర్:—'తమ నాయన గారివద్దనుండి వచ్చినది లేఖ.' కుట్టాణ్:—'ఏమని?'

భట్టర్ :—'చిత్తగించుఁడు.' కుట్టాన్ :—'మీరు చెప్పుఁడు.' భట్టర్ :—'తమరికి మనఃస్వాస్థ్యము లేకున్నదని వ్రాసితిని.' కుట్టాన్ :—'ఏల లేదు? 'భట్టర్ :—'కొంచెము జబ్బుగా నున్న దనుచుంటిరిగా నాలుగునాళ్ళనుండి?' కుట్టాన్ :—'అవును. లేనిది దేహస్వాస్థ్యము' భట్టర్ :—'వైద్యులు నాడిలో నేదోషము లేదన్నారుగదా? కుట్టాన్ :—తరువాత!' భట్టర్ :—'అమ్మగారు "పరమేశ్వర సముద్రములోఁ" దమ మేనమామగారి యింటిలో నున్నారఁట. మిమ్మచ్చటి కేఁగి నాలుగురోజులుండి విశ్రాంతి తీసికొనిరమ్మన్నారు.' కుట్టాన్ :—(ఆలోచించినట్లు నటించి) 'మఱి వెళ్ళవలసినచో నెప్పుడు—'భట్టర్ :—ఇప్పుడే భోజనముచేసి బండికట్టించుకొని బయలుదేరినచో నెల్లుండి తెల్లవారువరకుఁ జేరవచ్చును. కుట్టాన్ :—'మీరు ప్రయాణమునకు సిద్ధముచేయుఁడు.'

౨

ఆ రోజులలో నెద్దుబండ్లకు నాలుచక్రము లుండెడివి. రాజశకటము లయినచో వానిపైనిఁ గోపిరెలుకూడ నుండును. శకటమనికాని రథ మనికాని దానిని వ్యవహరింతురు. రాజశకటములు చూడ ముచ్చటగా రంగులతోడను, గంటలతోడను నొసంగుచుండును. మార్గములు చక్కఁగా నేర్పడియుండెను. ప్రధానములైన పెద్దపట్టణములకు మార్గములు శిలానిర్మితము లుండెను. తక్కినచోట్లకు రథచక్రముల యరవడులచేతఁ గల్గినవే మార్గములు. మార్గములయందు దొంగల భయము మెక్కువఁగా నుండెను. తిరువత్తూరు మధుర కీశాన్యముగా నున్నది. పరమేశ్వరసముద్రము తిరువత్తూరు మధుర

లకు మధ్య నున్నది. ఆరోజులలో నూరిపేరులకుఁ జివర "నాడు" "సముద్రము" "మంగళము" మొదలగునవి యుండెడివి. మధురకుఁ బరమేశ్వర సముద్రమునకుఁ బదునేనామడ యున్నది. పదియామడలు దాఁటిన తరువాత దొంగలభయమున్నది మధుర సమీపములో దొంగల భయము లేదు.

మధురలోనుండి యొక ప్రాణి బయటకుఁ బోవుచున్నను గొత్తవారు పట్టణములోనికి వచ్చినను నధికారులకుఁ దెలియ జేయవలెను. దానికి వేఱే యధికారి యేర్పడియుండెను. ఆ సాయంతనముననే వీరభద్రభట్టరు తదధికారి సమీపమున కుట్టాన్ సేతుపతిమహారాజు పరమేశ్వరసముద్రమునకు వెళ్ళుచున్నాఁడని తెలియఁజేసెను.

ఏకవీర వచ్చినతరువాత కుట్టా నెచ్చటకైనఁ బోవుట కిదియే మొదటిసారి. ఆమెనుగూడ వెంటఁ దీసికొనిపోవుటా, పోకుండుటా యను ప్రశ్న వచ్చినది. భట్టరు వినయముతోఁ 'ప్రభూ! తీసికొనిపోవుటయే మంచిది' అని చెప్పినాఁడు. కుట్టాన్ 'దారిలో దొంగలు. రెండురోజులు ప్రయాణము, ఆమెనుగూడఁ దీసికొనివెళ్ళినచోఁ బరివారము, దాసీలు చాల మంది బయలుదేరవలసి వచ్చును. నాల్గురోజుల పనికింత యెందుకు' అన్నాడు. అందరు తలలూచినారు.

రాత్రి జామున్నర ప్రొద్దుపోయిన తరువాతఁ బ్రయాణమైనారు. అయిదు శకటములు. మధ్యశకటములో మెత్తని విలువగల పఱపుల పఱచినారు; అందులోఁ గుట్టానొకఁడు విశ్రమించినాఁడు. ఈబండికి వెనుక రెండుబండ్లు, ముందు రెండు బండ్లు. ఈ నాలుగు బండ్లలోను బండికి నలుగురు చొప్పున

బంటులు కూర్చున్నారు. ఈ పదునాలుగురు కాక యయిదు గురు సారథులు. అందఱును సాయుధహస్తులే. అందఱికిం దల కుట్టాన్. కుట్టాన్ కుఱ్ఱవాఁడయ్యు నతని బాహుబలము, వివేకము మధుర రాజ్యములో విస్తృతిం బొందినవే. బండ్లు బయలు దేరినవి. వీరభద్రభట్టను తక్కిన సేవకులతో నంతఃపురరక్షణకై మధురలోనే యున్నాఁడు. బండ్లు కోటతలుపుల వద్దకుఁ బోయినవి. కోటతలుపులు మూయఁబడినవి. తలుపులు తెఱువ లేదు. దళవాయి యూర లేఁడుగానఁ బ్రధాని యాతని పనిఁ జూచుచుండెను. ప్రధానియాజ్ఞ లేనిదే కోటతలుపులు బ్రహ్మ వచ్చినను దెఱువరు. రాజకుమారులయినను దీయుట కాజ్ఞ లేదు. ఒక సేవకుని వీరభద్రభట్టువద్ద కుఱికించిరి. భట్టు రా రాత్రి పోయి ప్రధానినుండి యాజ్ఞ తెచ్చినాఁడు. కోటతలుపులవద్ద రక్షక సైన్యము మిగుల జాగరూకతతో నిలిచియున్నారు. తలుపులు తెఱచిరి. అయిదుబండ్లును నొక నిమేషములో బయటకుఁ బోయెను. వీరభద్రభట్టరుని 'అయ్యా! సెలవు' అన్న మాటలు గభాలున మూయఁబడిన కోటతలుపుల ధ్వనిలో మునిఁగిపోయెను.

చీకటిలో బండ్లు పోఁజొచ్చెను.

మెత్తని దూదిపఱుపుమీఁద కుట్టాన్ పండుకొన్నాఁడు. దారి మెత్తగా నున్నది. కుట్టాన్‌కు నిదురపట్టుట లేదు. కుట్టాన్ భావనాశక్తి విజృంభించెను. 'నేను ప్రేమించిన యువతి యున్నచోటికి మా తండ్రి నేను వెళ్ళుట కెట్లనుమతించినాఁడు? ఆమె యిప్పు డచ్చట లేదా? లేక యేమగును? భార్యతో సంసారము చేయుచున్నవాఁడు మఱల నట్టి భావము లేలఁ దల

పెట్టుమనుకొన్నాఁడా? ఏకవీర యీ మూఁడునెలలనుండి యింట నొంటరిగా లేదుకదా? నేను వచ్చివేసిన తరువాత నెట్లుండునో? నేను లేనని యామె యేడ్చునా? నేను బరమేశ్వరసముద్రము నకుఁ బోయిన తరువాత నా ప్రేయసి నాకుఁ గన్పించునా ? నాకుఁ గన్పించనీయరేమో? ఆమెకు వివాహమై యామె భర్తయింటికిఁ బోయెనేమో? ఆమె నన్ను వదలిపెట్టి యిం కొకనిఁ బెండ్లిచేసికొనునా? ఏలఁ జేసికొనదు? నేను జేసికొన లేదా? నే నస్వతంత్రుఁడను గదా? ఆమె స్వతంత్రయా?' మొదలు తుదలేని యీ యాలోచన తెగలేదు.

కుట్టాన్ :—'ఎంతదూరము వచ్చితిమి ?' సారథి :— 'ఒక క్రోశము వచ్చితిమి.' కుట్టాన్ :—'క్రోశము వచ్చితిమా? నిద్దుర పట్టలేదు! ఆళ్వారును బిలువుము. కథ యేమైనఁజెప్పు నేమో.'

వెనుక బండిలో నున్న యాళ్వారు వచ్చెను. బండి వెంటనే నడచుచుఁ జిన్నతనములోఁ దనకుఁ దన నాయనమ్మ చెప్పిన కథలన్నియుఁ జెప్పెను. కొంతదూరము పోయిన తరు వాత నాళ్వారునకుఁ దెలియకుండఁగనే కుట్టాన్ నిదురపోయెను. కొంత సేపయినపిదప నాళ్వారు తన బండిలోనికిఁ బోయి పండుకొనెను. వంతులుగా సేవకులు మేల్కొనియుండిరి. తెల్ల వారువఱకు శోళాపురము చేరిరి. శోళాపురపుచెఱువు కలువల చేతను, దామరలచేతను శోభాయమానముగ నున్నది. అంద ఱును బండ్లుదిగి కాల్యకృత్యములు తీర్చుకొని మఱలఁ బయన మైరి. బండ్లు జాము ప్రొద్దెక్కువఱకుఁ దిరువెంగడవల్లూరు చేరి నవి. ఆ యూరిలో బాండ్యరాజులు కట్టించిన పెద్ద సత్ర

మున్నది. మధురనాయకులు పాండ్యరాజులు చేసిన ధర్మసంస్థలన్నియు జరుపుచుండిరి. బ్రాహ్మణ సత్రము మూసివేసిరి. సత్రములో నొకగదిలోఁ గుట్టాన్ సామానంతయుఁ జేర్చి యా గదిలోఁ బఱపులువేసి సిద్ధముచేసిరి. తక్కినవారు భోజనాదికములు సమకూర్చు పనులమీఁద నున్నారు.

కుట్టాన్ గదిలోఁ దలుపువేసుకొని కూర్చుండి తన పెట్టె దీసి యందుండి యొక మంచిగంధపుఁ గొయ్యతోఁ జేసినచిన్న చందుకాయపెట్టెనుదీసెను. ఆ పెట్టెలో నాలుఁగర లున్నవి. ఒక యరలో వాడి వత్తలైపోయిన మల్లెపూవు లున్నవి. రెండవయరలో మున్నున్నది. తక్కిన రెండరలలోను గస్తూరి యున్నది. వెనుక కుట్టాన్ తన ప్రేయసిని గలసికొన్నపు డొకరోజున నుదయమున నామెను వెంబడించి వారి యింటివఱకు వెళ్ళెను. దారిలోఁ దొందరగా వెళ్లుచుండుటచేత నామె తలలోని మల్లెపూవుల చెండు జారి పడిపోయినది. ఆ చెండు కుట్టాన్ బహుభద్రముగా దాచుకొన్నాఁడు. అవే యీ మొదటి యరలోని వాడిన వత్తలైన మల్లెపూలు. మఱొకనాఁడు సాయంకాలము కుట్టాన్ ప్రేయసి దేవాలయములో ముందుఁ బూలతోఁటలోఁ గూర్చున్నది, ఆమె లేచిపోయిన తరువాత కుట్టానచ్చోటిదుమ్ము కొంచెము తెచ్చుకొని దాచుకొన్నాఁడు. అందులో మఱికొంచెము మంచిగంధపుఁబొడికలిపి యది రెండవ యరలోనుంచినాఁడు. (ఇట్టి రహస్యములు బయలుపెట్టినందులకు మమ్ము కుట్టానును, పాఠకులుకూడ క్షమింతురుగాక.) మూఁడవది కస్తూరి. కుట్టాన్ తనప్రేయసి కొకనాఁడు కొంత

కస్తూరి పంపించెను. ఆమెయందులో సగముంచుకొని, సగము మఱల నతనికి బంపించెను. అది యిది.

కుట్టాన్ పెట్టి కన్నుల కద్దుకొని దుమ్ము కొంచెము నొసట నుంచుకొని కస్తూరి పెదవుల కంటించుకొన్నాఁడు. అతని కనులవెంట నీరుగారి యందులోఁ బడెను.

కుట్టానునకు భోజనము సయించలేదు. కొంచెముప్రొద్దు వాటారినతోడనే బండ్లుకట్టిరి. ఎండలోఁ బోయిపోయి బండ్లు ప్రొద్దుగ్రుంకువఱకు తిరుత్తణికి జేరినవి. అచట మఱల భోజనములు చేసిరి. ఇంతవఱకు బండ్లు పదియామడ వచ్చినవి. ఇఁక ముందు దొంగల భయము. రాత్రి పెందలకడనే బండ్లు కట్టిరి. అందఱును జాగరూకతతో నుండిరి.

ఆంధ్రభృత్యవంశము రోజులలోను, చోళచాళుక్యుల కాలములలోను దక్షిణదేశపు రాజులు సముద్రపు రేవులు, వర్తకము, ఇతరద్వీపములతోడను, దేశములతోడను సంబంధము వదలుకొనలేదు. చాళుక్యులనాఁడును, దత్పూర్వమునను దెలుఁగులు సముద్రమువీఁదఁబోయి యితరద్వీపములను జయించుచుఁ గూడవచ్చిరి. తరువాతఁ గాకతీయులనాఁడు వారి రాజధాని సముద్రమునకుఁ గాని, నదికిఁగాని సంబంధము లేనిచోట గట్టఁబడి తత్పూర్వనౌకాజీవనము బాగుగాఁ గుంటుపడినది. కొండవీటి రెడ్లకాలమున మఱల వర్తకము విజృంభించినది. శ్రీకృష్ణదేవరాయలవారు కూడ నౌకాజీవనము గుఱించి యెక్కువ శ్రద్ధ తీసికొనలేదు. మన శాస్త్రములైనఁ జతురంగ బలములలో నౌకలను గలుపలేదు. అందుచేత భారతరాజులు

సముద్రవిషయము లెక్కచేయలేదు. వచ్చిన యాపదయు నచటనుండియే వచ్చినది.

మధురరాజులును సముద్రవర్తకమును గురించి యాలోచించలేదు. రేవులన్నియుఁ బోర్చుగీసువారికిని, నితర దేశీయులకును వదలిపెట్టిరి. అందుకని యితరదేశీయులుకూడ మనవారినిఁ దక్కువగాఁ జూచుచుండిరి. దయావంతులగు మనరాజు లితరదేశీయులు వచ్చినతోడనే వారి నతిథిధర్మ ప్రకారము గౌరవముచేసి వారికిఁ గావలసిన పనులు చేసిపెట్టుట, వారు తిన్నయింటివాసముల లెక్కపెట్టుట తటస్థించినది.

ఇతర దేశములనుండి నానాజాతివారును వచ్చి దేశములో నన్నివిధముల నశాంతి నెలకొల్పుచుండిరి. రేవుపట్టణములన్నియు మధురరాజుల చేతిలో లేవు. దొంగలు దేశముమీఁద దోఁచుకొని రేవుపట్టణములోఁ దల దాఁచుకొందురు. దొంగ లెక్కువభాగము విదేశీయులే. యూరపులో బ్రదుకలేని జనమంతయు వచ్చి యితరదేశీయులమీఁదఁ బడుచుండెడిది. అదిసరియే. సాహసించి భారతదేశమునఁ దన మతవ్యాప్తి మొదలుపెట్టినది. ఇన్ని సంవత్సరములైన తరువాతనైనను దమమతము లెట్టివో, భారతదేశమతము లెట్టివో తెలిసికొనలేని యితరదేశీయుల యజ్ఞత విచార్యము.

రాత్రి రెండుజాముల ప్రొద్దు పోవువఱకు బండ్లు పెద్ద యడవిగుండఁ బోవుచుండెను. అందఱును శ్రద్ధగానుండిరి. ఒక పెద్ద తటాకము, దానిచుట్టు దట్టముగాఁ జెట్లు. అచటి కేఁగువఱకు దొంగలగుంపొకటి బండ్లపైఁబడెను. అందఱును గత్తులు

దూసి నిలంబడిరి. కుట్టాన్ బండిలోనుండి సింగపుగొదమవలె దూకి దొంగలను నఱికెను. దొంగలందఱును బాఱిపోయిరి. కత్తిదెబ్బ తగిలి యొకఁడుమాత్రము నేలనుండి లేవలేకయుండెను. "కరదివ్వె" వెలిగించి యాతనిఁజూచిరి. సేవకులందఱు 'పరంగి' 'పరంగి', యని కేకలు వేసిరి. అతని కాలుచేతులు కట్టి వెనుకబండిలో నెక్కించిరి. ఈ యాలస్యము వలన వారు నాఁడు పరమేశ్వరసముద్రము చేరువఱకు బండ్లకుఁ బొద్దెక్కినది.

౯

తెల్లమనిసి కనఁబడుట తోడనే పరమేశ్వరప్రజ లొరిగిపోయిరి. పరమేశ్వరసముద్రము పల్లెటూరు. తిరువత్తూరుకు బోవు మార్గములో లేకపోయిన నీ యూరికి శిలానిర్మిత మార్గము నుండెడిది కాదు. తిరువత్తూరునుండి మధురకో, మధురనుండి తిరువత్తూరునకో పోవు గుఱ్ఱముల నేనుఁగులనే గుంపులు గుంపులై వచ్చి చూచుఁ బరమేశ్వరసముద్రజనులు తెల్లవానిని వింతగాఁ జూతురనుటలో నచ్చెరువు లేదు. మూఁడువందల సంవత్సరములైన తరువాత, ముప్పాతిప్పలుపడ్డ తరువాత నిప్పటికే తెల్లమనిసిమొగము క్రొత్త వదలలేదే దేశమునకు. అప్పటి కెట్లు వదలును? అందఱు భోజనముననకేఁగిరి. పిల్లలుమాత్రము బండిచుట్టును మూఁగియే యుండిరి.

కుట్టాన్ మేనమామ కుమారుఁడు అతివీరవర్మ. అతనికి బాతిక యేండ్లుండును. మొగమున రాజకళ తళుకుకొని వచ్చుచున్నది. అతఁడు మహాపురుషుఁడు. తనయింటఁ జావడిలోఁ గూర్చుండి, 'ప్రొద్దువాటారినది, ఫరంగిని దీసికొని

రమ్మన్నాఁడు. తెచ్చిరి. ఫరంగి వినయముతో లోనికి వచ్చెను. అతివీరవర్మ 'యతనికి భోజనము పెట్టించినారా' యని యడి గెను. పెట్టించితి మనిరి. 'గాయమునకుఁగట్టుకట్టించిరా'యనెను. సేవకులు కట్టించితి మనిరి. ఊరెమంగలినిఁ బిలిపించి కుట్లాన్ మాను యతని గాయము కట్టించెను.

అతివీరవర్మ అతనిని 'ద్రావిడభాష వచ్చునా' యని యడిగెను. అతఁడు వచ్చు నని చెప్పెను.

వీరవర్మ: 'బాధ తగ్గినదా?' ఫరంగి: 'తగ్గినది' వీరవర్మ: 'మీ దేశములో నిట్టి వైద్యులున్నారా?' ఫరంగి– 'లేరు'. వీరవర్మ: 'మీ దే దేశము?' ఫరంగి: 'ఇటలీ' వీరవర్మ: 'నీ కీ దొంగవృత్తియేమిటికి?' ఫరంగి: 'మేము' క్రైస్తవులము. మా ఫాదిరీ దక్షిణ హిందూదేశములో దోచు కొనవచ్చును. హిందువులు చాలధనవంతులు. దోచుకొన్నచో దప్పులే" దన్నాఁడు. వీరవర్మ: 'అబద్ధములు చెప్పకుము. మీ క్రైస్తవ మతము చాల మంచిదఁట కదా. మీమతమును గుఱించి నీకేమైనఁదెలియునా?' ఫరంగి:—'ఏసుక్రీస్తు రక్షకుఁడు. వీరవర్మ: 'మీ మతమును గుఱించి నీ కెక్కువ తెలి యదు.' ఫరంగి: 'తెలియదు.' వీరవర్మ: 'ప్రతిమాటకుఁ దల యూపెద వేమి?' ఫరంగి: 'తెలియ కేమి? తెలియును, ఏసుక్రీస్తును నమ్ముకొన్నచో మోక్షము వచ్చును. ఇంక నేమి తెలియవలెను?' వీరవర్మ:—'మీ దేశములో మీ మతమును గుఱించి నీవలెనే తెలిసినవా రెందరుందురు.' ఫరంగి:—'చాల మంది యున్నారు.' వీరవర్మ:—'ఈ దేశీయులకు బోధచేయుదు మని వచ్చు వారందఱు మీ యందఱికిఁ జెప్పరాదా–

ఇక్కడి కేల వచ్చెదరు?' ఫరంగి: 'తిండికోసము!' అంద
ఱును బకాలున నవ్విరి. సేవకులు ప్రజను వెనుకకుద్రోలను
లేక చచ్చిపోవుచుండిరి. వారికి ఫరంగిచేయు నభినయములు,
మాటలు నన్నియుఁ జాలఁ జిత్రములుగా నుండెను. అతివీర
వర్మ యాళ్వారును బిలిచెను. ఆళ్వారు వచ్చెను. వీరవర్మ:
'ఇతని నేమి చేసెదరు?' ఆళ్వారు: మధురకుఁ దీసికొని
పోయి రాజపురుషుల కప్పగించెదము.' వీరవర్మ:—'పాపము
వదలిపెట్టరాదా?' ఆళ్వారు మాటాడలేదు. మఱునాఁడు ప్రొద్దు
టికి ఫరంగిని వదలిపెట్టిరి. అతని కా యూళ్ళన్నియుఁ బరిచిత
ములే. ఊరిబయటకుఁబోయి తనవెంట వచ్చినజనముతో 'మా
దేశముపోయి సైన్యమును దెచ్చి మీ దేశము కొల్లగొట్టెదను,
జూడు' అన్నాడు. పిల్లలు నవ్విరి. ఒక పెద్దవాఁడు 'అవును
ఏజాతిలక్షణము ఎట్టిదో' అనెను.

౧౦

కుట్టాన్ తల్లిపేరు మంగమ్మాళ్. ఆమె మొగములో
సౌందర్యము, పాతివ్రత్యము, మాఙ్గల్యముఁ బెనవేసుకొన్నవి.
ఆమె యమితశాంతమూర్తి.

నాఁడే కాదశి. మంగమ్మాళ్ రోజంతయు నుపవాసము
చేసినది. రాత్రి పిష్టాహారము తిని దొడ్డిలోఁ జాప వేసికొని
పండుకొన్నది. కాళ్ళవద్దఁ గుట్టాన్ కూర్చున్నాఁడు. ఆకునాకుఁ
గదలుట లేదు.

మంగ:—'నాయనా! ఏకవీర సురక్షితముగా నున్నదా?'

కుట్టా:—'ఊ'

ఇది తల్లి తనకు వేసిన మొదటిప్రశ్న. ప్రొద్దుటినుండి

యతఁడు తల్లినిఁ జూడలేదు. ఆమె దొడ్డిలోఁ జాపవేసి పండుకొని పుత్రునకు కబురుపంపినది. అతఁడు వచ్చి కూర్చున్నాఁడు. మంగ:- తల్లిదండ్రులు లేడముగానున్నారు. ఆమె భారమంతయు మనదే సుమా! చాల సుకుమారి. చదువుకొన్నదఁట. నీకుఁ దెలిసియే యుండును. ఆమెను ప్రేమగాఁ జూతువుగదా! భార్యాభర్తలు మీకు నేను జెప్పవలయునా! నీ వన్న నామెకుఁ బ్రేమయేకదా!' కుట్టాన్ లజ్జావనతుఁడై 'ప్రేమయే' అన్నాఁడు. ఈమాట కుట్టాన్ నోటినుండి యుతనికిఁ దెలియకుండ వచ్చినది. కుట్టాన్ తనలో 'ఆమెకు నే నన్నఁ బ్రేమయున్నదా?' అనుకొన్నాఁడు. పూలపందసంగతిజ్ఞాపకము వచ్చినది. కుట్టాన్ ప్రసంగము మార్చ దలంచుకొని 'అమ్మగారూ! మీ రిచ్చటికి వచ్చి యెన్నాళ్ళయినది? రామనాథములో నాయనగా రెట్లున్నది తెలియుటలేదు. వీరభద్ర భట్టరుగారు ఉత్తరములు నాకుఁ జూపించక కబురులుమాత్రము చెప్పుదు' రన్నాడు. మంగ:- నీవు మా కొక్కఁడవే బిడ్డవు. తండ్రీ! నీకుఁ జెప్పగూడని రహస్యము లేముండును నీతండ్రికి? నీ వట్లనుకొన్నచో నడుగుము. భట్టరుగారు నీ కుత్తరములు చూపించెద రనుకొందును.' కుట్టాన్:-'అమ్మా! అది కాదు నాయుద్దేశము. మీక్షేమము తెలియుట లేదనియే. నిన్నుఁ జూడకుండ నే నుండలేను.'

అకారణముగ మహావిప్రుఁడైన కుట్టాన్ కనులవెంట నీరుగారెను. ఒకబొట్టు మంగమ్మాళ్ పాదములపైఁ బడెను. మంగమ్మాళ్ గ్రహించెను. లేచి కూర్చుండి కుమారునిఁ గౌఁగిలించుకొని చెక్కిలిపై ముద్దిడుకొనెను.

కుట్టాన్ వ్యాకులత యతని తల్లిమోమున నతిశయిల్లెను కాని యిప్పటి యతని యీ బాష్పములు పూర్తిగాఁ దనతల్లి మొదలఁ గల ప్రేమచేతనే వచ్చిన వనుటకు వీలులేదు. కుట్టాన్ తన వంచిత ప్రేమ తలంచుకొని, తలంచుకొని దీనుఁడై పోయి నాఁడు. ఆ దీనతయే యీ మాటలలోను వ్యాపించినది. మంగ మ్మాళ్ కౌఁగిలి వదలెను.

కుట్టాన్:– 'అమ్మా! గాలిలేదు; విసరనా?' మంగ– 'తండ్రీ, వద్దు. ఏకవీరనుగూడఁ దీసికొనిరాకపోతివా? పిల్లను గూడఁ జూచెడిదానను. ఏమైనఁ జిక్కినదా? కుట్టాన్:– 'ప్రయాణము కష్ట మని తీసికొని రాలేదు. కోడలినిగూర్చి కుమారుఁ డుత్సాహముగ మాటలాడుటలేదని మంగమ్మాళ్ గ్రహించినది. యథార్థము పుత్రునినుండి లాగవలయు నని తలంచినది.

మంగ:– 'నాయనా! ఏకవీర నీ మాటలకు సమా ధానము చెప్పునా? నీవు పలుకరించిన నూరకుండునా? సమాధాన మేమిచెప్పవలయునో కుట్టానుకుఁ దెలియలేదు. మంగ:– 'నాయనా! మీరిరువురు సుఖముగా నుండఁజూచుట కన్న మా కేమి కావలయును? నాకు నలువది దాటినవి. ఇంకెన్నాళ్ళు బ్రతుకుదును? నీ కడుపున నొక కాయ కాచినచో జూచిపోయెదను'. కుట్టాన్ కంఠములో నాపరాని శోక ముండఁగట్టి గిరగిర తిరిగినది. మంగ:– 'నాతోఁజెప్పవచ్చును దండ్రీ! చెప్పుము. మీరు సుఖముగా నున్నారా! చెప్పుము.' కుట్టాన్ గొంతుకనుండి మాట పెగుల్చుకొని, 'సుఖముగానే యున్నాము; అమ్మా! అట్లడిగెద వేల' యున్నాఁడు.

తల్లిని వదలిపెట్టినతరువాత కుట్టాన్ మేడమీఁదఁబోయి పండుకొన్నాఁడు. పండుకొన్నప్పటినుండియు నొకటే యాలోచన. 'అందఱును నేకవీరను ప్రేమించు మనుచున్నారు. వీరభూపతి యదేమాట. ఇప్పటకు వచ్చినఁ దల్లియు నదేమాట. ఇందులో నేదో రహస్య మున్నది. నేను ప్రేమించిన స్త్రీని వదలిపెట్టి బలవంతముగా నా మెడకుఁ గట్టిన స్త్రీనా ప్రేమించవలెఁ? నా కర్థమగుటలేదు. ప్రేమించుట, ప్రేమించకపోవుట యనునది నా స్వాధీనములో నున్నదా? ఎవరి స్వాధీనములో నున్నది? భగవంతుని స్వాధీనములో నున్నది. ఏ భగవంతుని స్వాధీనములో నిది యున్నదో యా భగవంతుఁడే నాకీ స్త్రీని దెచ్చి పెండ్లిచేసెనుగదా! భగవంతుఁడు కాదు. నా తండ్రిచేసినాడు. భగవంతుని యిచ్ఛలేనిది నాతండ్రి యెవరు చేయుటకు? ఈ స్త్రీకిని, నాకును సంబంధ మే మున్నది? ఏమియు లేకున్న మే మిరువురము భార్యాభర్తలుగాఁ జేయఁబడుట యెట్లు? పూర్వజన్మలలో నే సంబంధ మున్నదో?"

భావనాసోపానములలో నే సోపానముమీఁదనో దొరిగి కుట్టాన్ నిదురించినాఁడు.

తెల్లవారినది. ప్రాక్సతి యనంతకాలమునుండి ప్రతియుదయమున నెట్లు ప్రకాశించుచున్నదో యట్లే నేఁడును బాలసూర్యుని యరుణబింబము మొగమునఁ గుంకుమబొట్టుగా దిద్దికొని ముసలిముత్తైదువువలెఁ బ్రకాశించినది. ఆమె మంజీర ధ్వానమువలెనే పక్షుల కలకలధ్వానములును దోఁచినవి. నిదుర మేల్కాంచి కాల్యకృత్యములు తీర్చుకొని పుణ్యస్త్రీలు గోమయంబులకై పొరుగింటి గోష్ఠాదిగృహములకుఁ బోవుచుండిరి,

నాగళ్ళుకట్టి కాపు లాకుమళ్ళ దున్నుటకై పోవుచున్నారు. ఆఁబాలలో సాబాలునకై బుడుతలు చిన్నిచెంబులు పూని, పాలుతీయుఁ దండ్రులకు దగ్గరగా నిలుచున్నారు. కొందఱు చిలుకతుక లింటిముంగిళుల రంగవల్లులుతీర్చుతల్లుల పయ్యెద కొంగులుపూని యీడ్చుచుండగాఁ దల్లులు వారిని వీపులపైఁ బండుకొనఁ బెట్టుకొని రంగవల్లులు తీర్చుచున్నారు. పాలుపితుకు చుండగా గృహస్వామి మారముగాఁ గట్టివేసిన యాదూడలు పలుపులు మెడ నొంపికొనగాఁ దల్లిపొదుగుల దగ్గరకు మెడఁ జాఁచగా పెనఁగులాడు చుండెను.

పరమేశ్వరసముద్రము పల్లెటూరు గానఁ బ్రాతఃకాల మున నింత యందముగా నుండెను. కుట్టాన్ నిద్రలేచుట తోడనే పుణ్యస్త్రీల ముఖారవిందములు తోఁచినవి. కుట్టాన్ కాల్యకృత్యములు నిర్వర్తించుకొనెను.

వచ్చినప్పటినుండియుఁ గుట్టాన్ తన ప్రియురాలినిఁ జూడవలయుననియే ప్రయత్నము చేయుచున్నాఁడు. నేఁడు ప్రొద్దున లేచినతోడనే యతని కా భావ మంతవడిగా నున్నట్లు లేదు. అతనిభావ మింటివద్ద నేకవీర యేమి చేయుచున్నదో యని పోయినది. తనకుఁ దెలియకుండ నేకవీర తన హృదయ ములో నింతదూరమెట్లు వచ్చినదని యచ్చెరువైనది కుట్టాను నకు. కుట్టాన్ తన ప్రేయసియింటికిఁ బోదమనుకొన్నాఁడు. బాగుండదేమో యని సందేహించినాఁడు ఊరకే చూచివచ్చు టలో తప్పేమున్న దని నిశ్చయించుకొన్నాఁడు. అప్పటికిఁ గొంచెము ప్రొద్దెక్కినది.

కుట్టాన్ వారి యింటికి వెళ్ళునరికి మీనాక్షి నిన్న

సాయంతనము బద్ధకముచేత దండ గ్రుచ్చుకుండ నిదురపోయిన మల్లెపూలు, బాగుగా విడిపోయినవి. చావడిలోఁ గూర్చుండి దండ గ్రుచ్చుచున్నది. కుట్టాన్ నేఁడు మఱల నామె యందము చూచి గుండె చెదరి పోయినాఁడు. మీనాక్షి తన ప్రియునిఁ జూచినది. చేతిలో నున్న దండ వదలిపెట్టి సబాష్పాక్షియై యింటిలోనికిఁ బోయినది. మీనాక్షితల్లి వచ్చి, 'ఓహో! సేతుపతి! నాయనా! ఎప్పుడు వచ్చితివి' అని చాప తెచ్చి పఱచినది. కుట్టాన్ అవనతవదనుఁడై యాసీనుఁడైనాఁడు. మీనాక్షితల్లి 'నీభార్య క్షేమముగ నున్నదా? నీ పెండ్లికి మమ్ముఁ బిలిచితివైనఁగాదు. పేదవారము. మమ్మెందులకుఁ బిలిచెదవులే' యన్నది. ఆ భాగ్యశాలినికి ఈ మాటలు కుట్టాన్ హృదయములోఁ బరశుఘాతము లగునని యేమి తెలియును? ఆమె మఱల 'మా మీనాక్షికి మంచిసంబంధ మొక్కటైనను జూచిపెట్టుము తండ్రీ! నీవు తలఁచుకొన్నచో నది యెంతసేపు, వెదకి వెదకి వారిపని యగుచున్నది. వారూరిలో లేరు. సంబంధముకొఱకే వెళ్ళినారు. రాజవల్లిపురము పోవలయుఁ, బోయినది' అన్నది. కుట్టాన్ బుద్ధి పరిభ్రమించుచున్నది. చివర మాట లతనికి వినంబడలేదు. 'ఱేపు మాఘమాసములో నెట్లయినను పెండ్లి చేసితీరవలెను. ఇప్పటికే చాలకాలము దాఁటి పోయినది. నీవే మా కల్లుఁడవు కావలసినది. మేమంత నోము నోఁచుకొనవలదా? అందని మ్రానిపండ్ల కఱ్ఱులు చాచు' టని యన్న దామె మఱల. కుట్టాన్ వంచినతల యెత్తలేదు. మీనాక్షితల్లి యమాయికహృదయ. భారతదేశములో నిట్టి పిచ్చితల్లు లెంతమంది! కొంతసేపయినతరువాతఁ గుట్టాన్ లేచి

నిలంబడెను. నాల్గువంకలఁ జూచెను. మీనాక్షి తన కెక్కడను గన్పింప లేదు. అడుగులు లెక్కపెట్టుచుఁ గుట్టాన్ బయటికి వచ్చెను. ఆనాఁడు సాయంతనమే తనతల్లి వద్ద సెలవు తీసికొని కుట్టాన్ మధురకుఁ బ్రయాణమై పోయినాఁడు.

## ౧౧

మధురకుఁ గుట్టాన్ చతుర్దశి యుదయమునకుఁ జేరెను. ఆ నాఁడు చతుర్దశి మిగులున్నది. అప్పటికమావాస్యగడియలు వచ్చినవి.

కుట్టాన్ బండి దిగినవెంటనే యంతఃపురమునకుఁ బోయెను. ఏకవీర పడకగదిలోఁ గుట్టాన్ మంచముపై శయనించి యేదో యాలోచించుకొనుచుండెను. కుట్టాన్ వచ్చిన వెంటనే మంచముదిగి, పజ్జ హైమపాత్రతో నుంచిన నీళ్ళతోఁ గుట్టాన్ పాదములు కడిగి బంగరుపువ్వులతోఁ దళతళలాడు తన చీరకొంగుపెట్టి యాపాదములు తుడిచెను. కుట్టా నిది యంతకుఁబూర్వమైన నామెను విసరికొట్టెడువాఁడే కాని యపుడేమియు ననలేదు. ఏకవీర లేచి నిలంబడినది. అవనతవదన. కాని యామె చెక్కిళ్ళనుండి యెంతసేపటినుండియో సంతత ధారగా బాష్పములు స్రవించుచున్నవని కుట్టానునకు నామె వదనము చూచినవెంటనే తెలిసినది.

కుట్టాన్ కొంచెముసేపాఁగి, 'ఏకవీరా' యని సంబోధించినాఁడు. వివాహమైన తరువాత నాల్గునెలలలో కుట్టాన్ ఆమెను సంబోధించుట కిదియే మొదటిసారి. ఆమాట వినిన తోడనే, యామె మేఘగర్జనము విన్న రాజహంసివలె బెదరి నేలపైఁ బడిపోయినది. ఆమె దేహము లుత్పులకమైనది. ఆనందభ

వాయువునకుఁ గదలిన కదళీవలె యామె నిలువెల్ల వణఁకిపోయి నది. అజానుదీర్ఘంబులై హరిన్మణిమయ స్తంభంబులకుఁ గుల స్వాములైన తనచేతులతో కుట్టాన్ ఏకవీరను నేలపైనుండి లేవఁదీసి తన యెదుటిరొమ్మున కదుముకొనెను.

ఏకవీర మహానందసముద్రములోఁ దేలిపోయినది. కౌఁగిలి వదలిపెట్టి కుట్టాన్ నిశ్చలముగా నిలుచుండి ఏకవీర మోముపై దృష్టి నిలిపి యిట్లు మొదలుపెట్టినాఁడు. 'ఏకవీరా! నిన్నిట్లు నేను సంబోధించిననే నీవు మహానంద మనుభవించితి వని నేను గ్రహించితిని. నిన్ను నేను గాఁగిలించుకొనిన నీవు పొందిన పారవశ్యమును జూచితిని. నీవు న న్నింత ప్రేమించు చుంటి వని యిదివఱకు నాకుఁ దెలియదు. ఏదో కొంచెముగాఁ బ్రేమించుచుంటి వనుకొంటిని గాని, యింతగా నని తెలియదు. ఇంతకు నీ వెంత మంచిదానవో, నేనంత మంచివాఁడనుగాను. నీవు నాయెడఁజూపించుచున్న ప్రేమలో వేయగుభాగమైన నీయెడల నేను బ్రేమఁ జూపించుటలేదు. నేను జూపించలేకున్నాను. నిన్ను నేను ఏకవీరా యని పిలిచినది, ప్రేమచేతఁగాదు. మన మిరువురమును నీ జన్మలో నిట్లొకయెడకుఁ ద్రోయఁబడినాము. నీయెడ నాకుఁ బ్రేమలేదని క్రోధమున్నదనుకొందువా? అదియు లేదు. నీ యెడ నా కెట్టిభావమును లేదు. కాని యొకమాట. ఈజన్మకు మన మిరువురమును భార్యాభర్తల మైనాము. నేను గష్టపడి నిన్నుఁ బ్రేమించుటకుఁ బ్రయత్నించెదను. ఆ ప్రయత్న మెన్నాళ్ళు పట్టునో నేను చెప్పలేకున్నాను. నెల యయిన దాటకమునుపే నిన్నుఁ బ్రేమించవచ్చును. కాదా, పదిసంవత్స రములు పట్టవచ్చును. నేను నిన్నుఁ బ్రేమించకపోయినను,

ప్రేమించినను నీవే నాకు భార్యవు. ఈ గొంతులోఁ బ్రాణ మున్నంతవఱకు శరీర మన్యాక్రాంతముచేయను. నీకు వాగ్దానము చేయుచున్నాను. ఈమాటలవలన నీకుఁ బ్రయోజనము లేదు. కాని నీకు నాప్రేమనుగుఱించి యనుమానముండవచ్చునుగాని, నాధర్మవర్తనమునుగూర్చియనుమానపడవద్దని చెప్పుచున్నాను. నీప్రేమ నాయెడ లేనపుడు నీధర్మమును గుఱించి నా కేల యందువా? అదికాదు. నీయెడ నేను ప్రేమ సాధించెద నని చెప్పుచున్నాను. నాయందు దయయు, నమ్మకమునుంచుము."

'ఇంతకుఁ గారణము చెప్పెద వినుము. మా మేనమామల యూరు పరమేశ్వరసముద్రమని యెఱుఁగుదువుగదా! మన వివాహమునకుఁ బూర్వ మాయూరిలో మా మామగారియింటి దగ్గరగా నొక యిల్లున్నది. వారు పేదవారు. మీయంతగాని, మాయంతగాని ధనవంతులు కానేకారు. వారి కొక కుమార్తె యున్నది. ఆమె పేరు మీనాక్షి. ఆమెను నేను, నన్నామెయుఁ బ్రేమించితిమి. నాయిష్టమునకు వ్యతిరేకముగానే నాకు నిన్ను వివాహము చేసిరి. నేను మొన్న వెళ్ళినది పరమేశ్వరసముద్రమునకే. ఆమెకు వివాహము కాఁబోవుచున్నది. దైవచిత్రము. మన మేమి చేయఁగలుగుదుము? ఆమెమీఁద నాకున్న ప్రేమను బూర్తిగా నాశనముచేసెదను. అప్పుడు నీ మీఁదఁ బ్రేమ పెంచెదను. నీ వేమియు ననుకొనకుము. ఈరహస్యములు నీకుఁ జెప్పకుండరా దనిపించినది, చెప్పితిని. ఎవరియెడల నెవరికిఁ బ్రేమ యున్నదో యెట్లు తెలియును? నీవు నన్నింతగాఁ బ్రేమించుటచేత ననుకొనుచున్నాను. నీవు నన్నే ప్రేమించితి వని. ఇదివఱ కెవ్వనియెడ నైన నీప్రేమ ప్రవహించెనయేని యీామన వివా

హాము నీ కెంతకష్టముగానుండును! నాస్థితియట్లేయనుకొనుము.'

ఏకవీర కన్నులలోఁ బిచ్చిచూపు లేర్పడినవి. ఏకవీర నిలుచుండ లేకపోయినది. కుట్టా నిది గ్రహించి యామెను నెమ్మదిగా మంచముపైనిఁ బరుండబెట్టి చెంబులోని నీరమామె మోమునఁ జిలుకరించి పైయుత్తరీయముతో విసరినాఁడు. ఆమె శిరస్సు తన తొడపై నిడుకొన్నాఁడు. ఇదంతయుఁ గుట్టాన్ నిర్వ్యాజముగఁ జేసినపని. ఏకవీరకుఁ దెలివివచ్చినది. కన్నులు తెఱచిచూచుసరికిఁ దనతల కుట్టాన్ తొడపైనున్నది. తొందరగా లేచి యేకవీర మంచము దిగఁబోయినది. కుట్టాన్ కూర్చుండఁ బెట్టినాఁడు. కుట్టాన్ మఱల నిట్లన్నాఁడు. 'నా కొక మిత్రుఁ డున్నాడు. అతని పేరు వీరభూపతి. అతఁడు మన యింటికిఁ దఱచుగా వచ్చుచుండును. అంతఃపురములో నున్న నీ వతనిని జూచుటకు వీలులేదు. అతఁడు చాల మంచివాఁడు. నా యీ సంగతి యంతయు నతనికిఁ దెలియును. అతడు చెప్పినాఁడు, నాకు మీనాక్షిపైఁ గల ప్రేమయంతయు నీపైకిఁ ద్రిప్పుమని. నాకీ భావము కలిగించినది యతఁడే. అతనియెడ నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.' ఏకవీరకు వీరభూపతి యెవరో యెట్లు తెలియును? కుట్టాన్ తన స్నేహితుఁడని చెప్పుచున్నాఁడు. కుట్టాన్ ఆఁగి మఱలఁ జెప్పుచున్నాడు. 'ఏకవీరా! నేఁజెప్పవలసిన దంతయుఁ జెప్పితిని. ఇంకేమి చెప్పుమనెదవు? నీ యెడల నాకుఁ గోపముగాని, ద్వేషముగాని, లేదు. నీతో నాకు మాటలాడుటకును సందేహము లేదు. ఇంటిలో నందఱతోడను నెట్లు మాట్లాడుదునో యట్లే నీతోడను మాటలాడెదను. నాదొకటే ప్రార్థన. నాయందు నీ కిప్పుడెంత ప్రేమయున్నదో, యా ప్రేమ

త్వరపడుచున్నావు. ఏకవీరా! నా మాటలు చాల గతించినవియైనా నున్న వనుకొనియెదను. ఏమందువు?'

ఏకవీర తన రెండుచేతులు కుట్టాన్ మెడచుట్టు వేసి యతని భుజములమీద నానిచ్చి, 'ఇప్పుడే ప్రేమింపుము. ఇప్పుడే ప్రేమింపుము' అని తెలిపినది.

ఏకవీర యీమాట లెందుకన్నదో యామెకే తెలియదు. 'ఊరకున్న బాగుండెడిది' యని తరువాత మనస్సులో ననుకొన్నది.

కుట్టాన్:—'నాచేత నగుటలేదు. ఏమిచేయుమందువు? క్షమింపుము. అయినను నీకేమిలోపమున్నది? నీతో మాటాడుదును. ఎవరికిని మన నిజస్థితి తెలియుటకు వీలులేదు. కుట్టాన్ అంతకంతకు నిశ్చలుడై పోయినాడు. అతని కనుల లోనుండి బాష్పములు పోయినవి. పలుకు లంతకంతకు గతినము లైనవి. అతడు లేచి ద్వారమువఱకు వెడలినాడు. ఏకవీర పోవుచున్న యాతని యడుగుల నైశ్చల్యము చూచినది. మాటాడలేదు. అతడు ద్వారమువఱకుం బోయి తలుపు తెఱచి బయటికిం బోబోయినాడు. కాలాడలేదు. వెనుక తిరిగి చూచి నాడు. ఏకవీర పోయి యతని రెండుచేతులును బట్టుకొన్నది. ఏకవీర కన్నులవెంట బాష్పము లోడుగట్టెను. అతడు 'ఏకా! చెప్పితినిక దా, నీవద్దకు వచ్చునపుడు పరిశుద్ధమైన హృదయ ముతో వచ్చెదను. అచ్ఛమైన ప్రేమకు కోరదగిన వాడను, వ్యామోహమునకై వాంఛించెద వెందుకు' అని గడప దాటి పోయినాడు. ఏకవీర మంచముపైc బడిపోయినది. ఆమె హృద

యములో 'అరండీవకాంబు — అరండీవకాంబు' అను ధ్వని మ్రోఁగుచున్నది.

౧౭

కుట్టాన్ భోజనముచేసి తనగదిలోనికిఁబోయి యొక భూర్జపత్రము తీసి దానిపైఁ 'బరాభవనామసంవత్సర వైశాఖ బ॥౧౫' అని వ్రాసినాఁడు. ఆయాకు మంచిగంధపుచందు కాయ పెట్టెలోఁ బూర్వము తాను మీనాక్షి ప్రేమచిహ్నములు దాఁచిన దానిలో దాఁచినాఁడు.

నాఁ డమావాస్య యగుటవలనఁ బాఠశాలకు సెలవు. ఏమియు దోఁచలేదు. బండికట్టించుకొని వీరభూపతి యింటికి వెళ్ళినాఁడు. వీరభూపతి యింటివద్ద లేఁడు. రాజవల్లిపుర మేఁగినాఁడఁట. వీరభూపతి ప్రక్కనున్న యింటిలో నొక యుత్తరమిచ్చి పోయినాఁడు. అందులో వీరభూపతి తనతండ్రి యుత్తరము వ్రాసెననియు, వివాహమునకేవలెఁ దోఁచుచున్న దనియు, నెట్లయినను నైదారునెలలవఱకు మఱల వచ్చుటకు వీలులేద నియు, జ్ఞాపక ముంచుకొనవలెననియు వ్రాసియున్నాఁడు. మిత్ర వియోగము సేతుపతికి దుర్భర మనిపించినది. కుట్టాన్ ఇంటికిఁ బోయినాఁడు. తనగదిలోఁ బుస్తకములన్నియు సర్దినాఁడు. ఎంత సేపటికిఁ బ్రొద్దుపోలేదు. పండుకొని నిదురకై ప్రయత్నించినాఁడు. నిదుర రాలేదు. కొంతకాలమైన తరువాత లేచి స్నానముచేసి యల్పాహారమును దీసికొన్నాఁడు. ప్రొద్దువాటారినది.

కుట్టాన్ పూలతోఁటలోఁ దిరుగఁబోయి, నిత్యపరిపోష ణముచేత నిత్యముగా వికసించియున్న పూఁదోటలోఁ గూడ నానం దమును గన్నారఁ దన ప్రియనాయకుని జూచువత్తునని పోయెను.

ప్రొద్దుక్రుంకవచ్చినది. ఏకవీర పూఁదోటలోనికిఁబోయినది. పెంపుడులేడి వెంటవచ్చినది. ఎఱ్ఱగన్నేరుమొగ్గలుత్రుంచి యేకవీర లేడిపిల్ల కందించెను. అది రెండుకొఱికి తలయూఁడించికొనుచు దూరము పోయినది. ఏకవీర దోసిలిలో నున్న తక్కిన మొగ్గలు నేలపై బోసినది. ఏకవీర మంచిపనినేరుపరి. పూమాలలు వినిర్మించుటలో నామెశక్తి యనన్యప్రాప్తము. గన్నేరులు మందారలు, మల్లెలు, జాజులు కోసి యామెయొక దండఁగుచ్చినది. ఆ దండ చిత్ర మేకవీరకే తెలియును. దండ నుటఁలాగినఁ జిన్నది, యటులాగిన పెద్దది యగును. చిన్నదైనప్పుడు జాజులు, మల్లెలు నెడమై మందారలను, గన్నేరులను మూసివేయును. పెద్దదిగా నున్నప్పు డన్నిపూవులు కనఁబడును. దండ సన్నగా నుండును. ఈదండ నెవరికిఁజూపించకుండ నేకవీర తీసికొనిపోయి తనగదిలో దాఁచుకొనెను. ఆనాఁడు ఏకవీర చిత్రముగా నున్నది. ఆమె మొగము తొల్లిటివలెవిక్కిలి ప్రకాశించను లేదు. శోకముచేతఁ గలుషితము గాను లేదు. ఆమె పుష్యమాసపునదివలెఁ బుష్టయుఁగాక, కృశయుఁగాక యొండుచేత గోధుమవన్నెఁ గలదియుఁ గాక, కొబ్బరినీళ్ళవలె నతిశబలయుఁగాక, యిప్పుడే వికసించి సంపూర్ణశోభతోఁ జెలువారని, పూర్తిగా వడిలిపోయి శోభాహీనముగాని నవమల్లికవలెఁ బ్రకాశించినది. ఆమె నిటాలమున కస్తూరిబొట్టు సెగకన్నుఁగాఁ దలపై రావిరేక చంద్రవంకగా నిటాలస్వేదబిందువు శిరస్థగాంగఝురముచెమ్మగా, నామె పార్వతివలెఁ బ్రకాశించినది.

ప్రొద్దుగ్రుంకినది. వైగై పులినములనుండి తిరిగి వచ్చిన కుట్టాన్ భోజనముచేసి రాత్రిచాలఁబ్రొద్దు పోవువఱకు నేదియో

చదువుకొనుచుండెను. రాత్రి జామున్నర యైనది. ఏకవీర యొకదాసినిఁ బిలిచి మహారాజును నేను బిలుచుచుంటి నని చెప్పుము' అన్నది. అది బయటకువచ్చి యందఱు దాసీలలోఁ గలవరము గలిగించినది. ప్రొద్దున స్వామి పరమేశ్వరసముద్రము నుండి వచ్చినవెంటనే యంతఃపురములోనికిఁబోయెను. ఇప్పు డీ వర్తమానము. అందఱు నాశ్చర్యపోయిరి. ఇది పఱికు వారను కొనిన వన్నియు నయథార్థములాయెమి? భార్యాభర్తలకుఁజాల ననోన్యన్య మున్నదిఁలె నున్నది. మొన్న దండ చీలికలై నేలపై నుంటయేమి? దానికిఁ బ్రణయకోపార్థములు కలిపింపఁబడినవి.

పనికత్తె కుట్టాన్ గదివద్దకుఁబోయి నిలఁబడినది.

కుట్టాన్ తలుపుకదలిక విని 'ఎవరువారు' అన్నాడు.

దాసి "బాబూ! అమ్మగారు — రమ్మనుచున్నారు" అన్నది. కుట్టాన్ మఱుమాటాడలేదు. పుస్తకము మూసి యంతఃపురములోనికిఁ బోయినాఁడు. అతఁడు పోయినదారియంతయుఁ బ్రశస్తమైన కస్తూరికావాసనలు గుమగుమ లాడినవి. అంతఃపురసేవకురాండ్రు నిస్తబ్ధలు, సాశ్చర్యలై పోయినారు. రాత్రిరెండుజాములయినది. గదిముందుఁ బండుకొన్న శాల సారంగి కనులుమూసికొని నడుమ నడుమ నెమరువేయుచు నిదురపోవుచున్నది.

కుట్టాన్ పోయి గదిలో మంచముపైఁ గూర్చున్నాడు. ఏకవీర నిలుచుండి తలవంచుకొని పూలదండ తీసి దీర్ఘమును, సన్నదియు నైన మాల నొక సూత్రాకర్షణము చేసి హ్రస్వమును, జిక్కనయుఁ జేసి మఱల దీర్ఘీకరించి యుపసిపంపి దల యెత్తి భావాభిరామముగఁ జూచెను.

కుట్టాన్ :—ఇది యెవరు కూర్చిరి.

ఏకవీర కనులలో నామెయే యదికూర్చిన దని స్పష్టపడె నది. ఏకవీర మాలను హాస్స్వీకరించి కుట్టాను మెడలో వేసెను. కుట్టాన్ బాగున్న దని కుడిచేతితో దానిని మెడలో సర్దు కొనెను. వ్యతిరేకసూత్ర మజ్ఞాతనుగాఁ జేతికిఁదగిలి సూత్రము పొడుగై పోయెను. జాజులు, మల్లెలు; గన్నెరులు మందారలు విడివిడిగా నయిపోయి నవి. ఇరువురుఁ జెలియొక శయ్యపై నిదు రించినారు.

రాతిరి చాలఁ బ్రొద్దుపోవుటకు నిదుర లేమి నారక్త మంజులములైన విశాలనేత్రములతో, దీర్ఘనవీనపుష్పమాలికా లంకృతవక్షఃస్థలముతో బయటికివచ్చిన కుట్టాన్ ప్రభువును జూచి యందఱు పనికత్తెలు చకితనేత్రలు, సస్మితాస్యలు, లజ్జాదరహాసాధరలు, ససంభ్రమదత్తమార్గలు నైనారు. ఉద్దేశ పూర్వకకృతకృతకమందహాసాననాంచల యేకవీర వారిని మఱింత కలవరపెట్టినది. అసంస్కృతభావలు వారామె మొగ మున నిగూఢవిచారముద్ర తెలియఁజాలరైరి.

రోజులు గడచుచున్నవి. నెలలు దాఁటిపోవుచున్నవి. ఋతువులు వెనుకఁబట్టుచున్నవి. కుట్టానులో మార్పులేదు. రోజులు గడచినకొలంది ఏకవీర యొడలినిండి యొకొక్కనిగ యుత్సర్జించుచున్నది. కొన్నాళ్ళ కామె మెడలో మంగళ సూత్రము, నల్లపూసలు దక్క నేమియు మిగులవాయెను! ఏకవీర యంతంతకు స్వచ్ఛదేహ యగుచున్నది. పాలిపోయి యామె దేహము తెల్లబడుచున్నది. కనులు నగము మూఁతలువడి క్రొత్త యందము విరజిమ్ముచున్నది.

కుట్టాన్ దినదినము మంచిగంధపు చందనపుపెట్టెఁ దీయును. దానివంక నూరకే చూచును. ఆ భూర్జపత్రముమీఁదఁ దానిపై వ్రాసినది చదువును. రోజులు లెక్కవేసికొనును. తన హృదయమును పరీక్షించుకొనును. మార్పేమియు లేదు. అది తనపెట్టెలోనుంచి యేదైన పుస్తకము తీసి చదువును. పాఠశాలకుఁబోవును. సాయంతనములయందు వైగైయిసుకతిన్నెల మీఁద నొంటిగాఁ గూర్చుండును. పొద్దు గ్రుంకిన వెంటనే యింటికి వచ్చును. మనస్సు పరమేశ్వరసముద్రములో, దేహము మధురలో.

ఏకవీర కనంబడినప్పు డేదియో పలుకరించును. అది యూరకే పలుకరించవలె నని పలుకరించినట్లు కనంబడుచునే యుండును.

## ౧౩

తిరుమలనాయకుఁ డెంతమిత్రుఁడైనను రాజకుమారుఁడు. స్నేహితుఁడైన నేమి, కుట్టాన్ కన్న గొప్పవాఁడు. అతనితో మైత్రి యుండవచ్చునుగాని, పరస్పరహృదయావేదనలు బయల్పఱచుకొనుటకు వీలు లేదు. పగలెల్ల నతనితోఁ గాలముగడుపుటకును వీలులేదు. ఏకవీర యిట్లున్నది. ఆతనికి నామెకు నేమి సంబంధము? స్నేహితునివలె మాటలాడునా? హృదయప్రేమ పంచుకొనునా? అందుచేతఁ గుట్టానునకు రోజులు గడువలేదు. తెల్లవారినది మొదలు ప్రొద్దు గ్రుంకుట యెట్లు? దినము లంతంతకు దుర్భరములై పోయినవి.

కుట్టాన్ మఱల వీరభూపతి మధురకు వచ్చినచో బాగుపడుననుకొన్నాఁడు. తనకేమి? దళవాయికుమారుఁడు. తిరు

మలనాయకుని మిత్రుడు. సంపూర్ణ ప్రయత్నము చేసినాఁడు. స్థానాపతి మాఘమాసములోఁ జనిపోయినాఁడు. స్థానాపతియుఁ గణక్కమును పారంపర్యముగా వచ్చు నుద్యోగములు కావు. అందుచేత నా స్థానమునకు వీరభూపతికై కుట్టాన్ ప్రయత్నించి సాధించినాఁడు. క్రొత్తలెక్కలు చైత్రమాసములోఁ బ్రారంభ మగును. వీరభూపతి యప్పటికి వచ్చి యుద్యోగములోఁ బ్రవే శింపవలెను.

కుట్టాన్ వీరభూపతికిఁ దెలియఁజేసినాఁడు. మాఘమాస ములో వీరభూపతికి వివాహ మయినది. వివాహములోననే యీ యుద్యోగవార్తయుఁ జేరినది. అందఱును వీరభూపతికి మంచిరోజులు వచ్చిన వన్నారు. వివాహము మహానందముగా జరిగినది. స్థానాపతి యధికారము రాజ్యములోఁ బ్రధానోద్యోగ ములలో నొకటి దానికి జీతము సంవత్సరమునకుఁ బదివేల పన్నులు. 'పన్ను' అనునది మధురనాయకుల కాలములో వాడఁబడు బంగారు నాణెము పేరు.

చైత్రము దరిసినకొలది కుట్టానుకుఁ బ్రాణములు చేరుకొన్నవి. వీరభూపతి వచ్చును.

వీరభూపతివచ్చినాఁడు. ఉద్యోగములోఁ బ్రవేశించినాడు. వీరభూపతికిఁ బెద్దసౌధ మొకటి యొసంగఁబడినది. అతఁడందులోఁ బ్రవేశించినాఁడు. చైత్రములో మీనాక్షీదేవి కళ్యాణ మైనది. వైశాఖము శుక్లపక్ష మైపోయినది. వీరభూపతిభార్యను మధు రకుఁ దీసికొనివచ్చిరి. కృష్ణపాడ్యమి ప్రయాణమునకు మంచిది. ఆ రోజున బయలుదేరఁదీసి స్థానాపతిభార్యను దదియనాఁటికి మధురకుఁ దీసికొనివచ్చిరి. ఆమె మధురలోననే యున్నది.

పూర్వపుస్థానాపతి మాఘములోఁ బోయినాఁడు. మాఘ ఫాల్గుణముల లెక్కలు పేరుకొన్నవి. వీరభూపతికిఁ జైత్ర వైశాఖముల పని బరువైపోయినది. వైశాఖాంతమునకుఁ బని కొంచెము తెలిపియిచ్చినది. వీరభూపతి వచ్చినక్రొత్తలోననే యింత శ్రద్ధగాఁ బని చేసినందులకుఁ దిరుమలనాయకుఁడు సంతోషించినాఁడు. యువరాజు ముత్తువీరప్పనాయకునితోఁ జెప్పినాఁడు. రాజుగారికిఁ జెప్పినాము. కుట్టాన్ సంతోషించినాడు. వీరభూపతికి నుత్సాహముగానే యున్నది.

ఒకరోజునఁ గుట్టాన్ నిదుర లేచి కాల్యకృత్యములు తీర్చికొని, సౌధపురోభాగమున నున్న మంటపములోఁ బ్రాతర్వాయువులు చల్లగాఁ వీఁచుచుండగా వచ్చికూర్చున్నాఁడు. పురోహితుఁడు వచ్చి నిలుచుండి 'ప్లవంగనామసంవత్సర వైశాఖ బహుళ అమావాస్య' అన్నాడు. పంచాంగము చంకను బెట్టుకొని, విభూతిరేఖలు మొగమున మెఱయఁగా శుక్రునివలె నిలుచున్న యా పురోహితుని నిలువునఁజూచి కుట్టాన్ భగవంతుఁడా రూపమున వచ్చి తన కేదో జ్ఞాపకము చేయుచున్నాఁ డనుకొన్నాఁడు. ఆ దిగ్భ్రమలోఁ గుట్టానునకుఁబురోహితుఁడుచెప్పిన వారమును వినిపించలేదు. కుట్టాన్ లేచి లోనికిఁబోయి తన పేటికలోని మంచిగంధపు చందుకాయపెట్టెను దీసి యా భూర్జపత్రమును దీసినాఁడు. దానివంకఁజూచి, చూచుచుండఁగనేయా యాకుపై నొక కన్నీటిబొట్టు రాల్చినాఁడు. పెట్టెలో నున్న వాడిన పూలచెండు విసరిపాఱవేయ నుద్దేశించినాఁడు. మనసొప్పలేదు. మఱల నవియన్నియు భద్రముగాఁ బెట్టెలో దాఁచినాడు. తొందరగా నంతఃపురములోనికిఁ జనినాఁడు. ఏకవీర

నిరాభరణసుందరమైన యొడలితోఁ, దెల్లనిచీరతో, గదితలుపు నానుకొని నిలుచున్నది. కుట్టాన్ ఎదురుగాఁబోయి నిలుచున్నాఁడు. ఏకవీర కర్థము తెలియలేదు. లోనికిఁబోయి మంచపుకోడు నానుకొని నిలుచున్నది.

ఏక:—'సేతుపతు లెందుకో వచ్చినారు? కుట్టాన్:—'ఏకా'! నేడు 'వైశాఖ బహుళ అమావాస్య'. ఏక:—'సంవత్సరము ప్లవంగ. వారము శని.' కుట్టాన్:—'నేటికి సంవత్సరమైనది.' ఏక:—'పండ్రెండు నెలలు' అని గోడవైపునకుఁ జేయిచూపినది. ఆ గోడమీఁద నల్లనిబొట్లు పండ్రెండున్నవి. కుట్టాన్ లజ్జావనత శిరస్కుఁడై నెమ్మదిగా ద్వారబంధముకడకుఁ బోయినాఁడు. వెనుకనుండి ఏకవీర యొకపాటపాడుచున్నది. ఆ పాట ద్రావిడ దేశములో నా రోజులలో జనులందఱు సామాన్యముగాఁ బాడుచుండెడిదే. జనాపవాదభీతుఁడైన రాముఁడు సీతను వనములో విడిచినతరువాత సీతాదేవి దుఃఖించుచున్న మాటలే యీ పాటలోని మాటలు. కుట్టాన్ మంత్రరుద్ధభుజంగమువలెఁ గదలలేకపోయెను. వెనుకకుఁబోయి యామెను గౌఁగిలించుకొనవలె ననిపించినది. ఒకదాసి యేదో కనుఁగొనుటకు నేకవీర కడకుఁ బోయినది. కుట్టాన్ తనగదిలోనికిఁబోయినాడు, మంచముపైఁ బండుకొని మొగము శయ్యపై నాన్చి తా నిన్నాళ్ళేల బ్రదుకవలె ననుకొన్నాఁడు. మీనాక్షి యేమైనదో? ఆమె నెవరి కిచ్చి పెండ్లిచేసినారో! ఆమెమీఁద నింకను నాస యెందులకు? సేవకునిఁ బిలిచి, 'స్థానాపతిగారి యింటికిఁబోయి నేను నేఁడు వారి యింటికి భోజనమునకు వచ్చెద నని చెప్పు' మన్నాఁడు. సేవకుఁడు పోయినాఁడు.

పెట్టె తెఱచి సేతుపతి మంచిగంధపు చందుకాయ పెట్టెలోనుంచి వాడుపూలు, గందపుదుమ్ము, కస్తూరి తీసి యింకొకచోట నుంచినాఁడు. ఒక్క భూర్జపత్రము మాత్ర మే యందుంచినాఁడు. ఆ దుమ్ము రెండుచేతులకును రాచుకొని మొగమునఁ బూసికొన్నాఁడు. అద్దములోఁజూచికొన్నాఁడు. దాక్షాయణీశోకతప్తుఁడైన శివునివలె నున్నాననుకొన్నాఁడు. వసనాంచలముతో మొగము సరిగాఁ దుడుచుకొని మిగిలిన ప్రేయసీ చిహ్నములు వేఱొకచోట దాఁచినాడు.

వంటబ్రాహ్మణుఁడు వడ్డించగాఁ గుట్టాన్, వీరభూపతులు వీరభూపతియింటిలో భోజనము చేసినారు. కుట్టాన్ మనస్సు విషాదచ్ఛన్నమయ్యెను, వీరభూపతితోఁ గలిసియున్నప్పు డతనికి సంతోషమే. భోజనము చేయుచున్నప్పుడు రెండుమూఁడు సార్లు వీరభూపతి యతనిభార్యనుగూర్చి యేమో యడుగుద మనుకొన్నాఁడు. కాని మనస్సు సరిగలేక యూరకొన్నాఁడు. ఇంతవఱకు గుట్టాన్ వీరభూపతివివాహవిషయమై యతనితోఁ బ్రస్తావించలేదు. అతఁడంతకుముందే మాటలాడలేదు. దీనికిఁ గారణము లున్నవి. కుట్టాన్ తన దుఃఖములో మునిఁగి యా విషయము సంప్రశ్నించలేదు. వీరభూపతి తనభార్యవిషయము కుట్టాన్‌తోఁ జెప్పుటకుఁ దనకు సరియైన యుత్సాహము లేక పోయినది.

భోజనానంతరమున నిరువురును రాజసౌధమునకుఁ బోయిరి. కుట్టానున కెట్లో ప్రొద్దు గ్రుంకవలయును. పగలు గడుపవలయును. మొగసాలలో ననేకులు గూర్చుండి తాటాకులమీఁద గంటములతో గ్రంథములు వ్రాయుచుండిరి. వీరంద

లకును జీతములు, బత్తెములు రాజిచ్చును. ఆ గ్రంథములు పుస్తకభాండాగారములకు, రాజ్యములోని యితర పాఠశాలలకుఁ బంపించఁబడును.

వారిరువురు నచ్చటినుండి కదలిపోయిరి. ఎదురుగా సంధ్యామంటపము కనఁబడినది. కుట్టాన్ మనస్సులోఁగస్తూరి రంగనాయకుని ఘోరమృతి మెఱుపువలె మెఱసినది. అనంతరము దళవాయికుమారుఁడును, స్థానాపతియుఁ దిరుమల నాయకునియొద్దకుఁ బోయినారు. తిరుమలనాయకుఁడు ముద్దుకృష్ణప్పనాయకుని రెండవకుమారుఁడు. అతని నేత్రములు దీర్ఘములై రక్తరేఖలతో విరాజిల్లుచుండెను. అతనివక్షఃస్థలము విశాలమై కోట యినుపతలుపులవలె నొప్పుచుండెను. అతని బాహువులు దీర్ఘములై, యాజానులంబమానములై, యాయసస్తంభములవలెఁ గఠోరములై యుండెను. అతని మొగము జూచినవాఁ డతఁడే భావిమధురరాజ్యమునకు రాజగునేమో యని యనుకొనునుగాని, యతని యన్నగారు ముద్దువీరప్పనాయకుఁడు యువరాజున్నాఁడని సందియము కలుగును. తిరుమలనాయకుని వదనము ప్రసన్నగంభీరమై యతఁడొక నిశ్చయము చేసికొన్నచో, దానిఁద్రిప్ప నెవ్వరికి సాధ్యముగాదని తెలియఁజేయుచుండెను. తిరుమలనాయకుని కప్పటి కిరువది రెండేండ్లు దాఁటలేదు. కాని యతనితండ్రిగాని, యన్నగారుగాని యతనికిఁజెప్పకుండ నేపనియుఁజేయరు. అతని సర్వావయవములందును మహాదృష్టరేఖ లున్నవి. అతనికాలములో మధుర రాజ్యము పరమోత్కృష్టమైన మహాదశపొందు నని కార్తాంతికులు చెప్పిరి. ముద్దువీరప్పనాయకుఁడు ననూయారహితముగఁ

దమ్ముని యభ్యుదయమునే వాంఛించినాఁడు. తిరుమలనాయకుఁడు కుట్టాన్ స్థానాపతులతోఁ గొంచెముసేపు మాటలాడి, కుట్టాన్‌తో, 'దళవాయీ! నీతో నొకమాట' యని చాటునకుఁ దీసికొనిపోయినాఁడు. అచ్చట నేదో రాచకార్య విషయము మాటలాడిన తరువాత, ప్రొద్దు గ్రుంకువేళకు కుట్టాన్ వీరభూపతులు వైఁగై యిసుకలకుఁ బోయినారు. నాఁటికి నేఁటికి మఱల వేసఁగిలో, వైఁగై పరిఖిన్నస్రవంతి పలుచనినీటిపొరలో స్నేహితు లిద్దరు నొకరి బుజములపై నొకరు చేతులు వైచుకొని చీలమండలు తడుపుకొని నీరు పుక్కిలించి యుమిసినారు. నేలపైనుండి గాలి కచ్చగా వచ్చినది. ఇద్దఱు స్నేహితులును నీళ్ళతో మొగములు కడుగుకొన్నారు.

## ౧౪

వీరభూపతి వైఁగైనుండి వచ్చి, కుట్టానును వదలిపెట్టి యింటికిఁబోయి, స్నానముచేసి భోజనముచేసి, మేడపైఁ జల్లగాలికిఁ బండుకొనెను. రాతిరి ప్రొద్దుపోవువేళకు నతనిభార్యయు వచ్చెను. ఆమె యతనికిఁ గొంచెమెడముగాఁ గూర్చుండి తమలపాకులు చుట్టి యిచ్చుచుండెను. అతఁడు తాంబూలమును సేవించుచుండెను గాని యతఁ డుత్సాహముగా నున్నట్లులేదు. వీరభూపతి లేచి కూర్చుండి 'ఇంక నక్కఱలేదు' అనెను. ఆమె యాకుమడుపు లిచ్చుట మానివేసెను. వీర:—'కాళ్ళునొప్పిగా నున్నవి. సేవకునిఁ బిలిచెదవా? భార్య:— 'నేను బిసికెదను.' వీర:—'నన్ను నీవు ముట్టుకొనెదవా!' భార్య:— 'సేవకభావములో దోషములేదు. మీరు మాటిమాటి కట్లె మాటాడెదరు.

ప్రభూ! నాకు దానిపై నిచ్ఛలేదు. భార్యాభర్తృత్వ సంబంధ మున కదియే ప్రధానమా? నా మనస్సున కట్లు తోఁచుట లేదు. నే నేమి చేయుదును?' వీర:— సనాతనుల ఋషుల మతమది. "ప్రజార్థై గృహమేధినాం" అన్నాఁడు. సంతానార్థి కావుననే వివాహము చేసికొనుట. నా తల్లిదండ్రులు చీఁకులు. నా జీవితమంతయు వారిని సంతోషపెట్టుటకే వ్యయపఱచుచున్నాను. నీతోఁ జెప్పితినిగదా? నిన్ను వివాహము చేసికొనుటఁగూడ వారిని సంతోషపెట్టుటకే. నాల్గునెలలు గడచిపోయినవి. నీ విట్లే యథాప్రకారముగా నా యెడల విముఖవై యున్నావు. నీ యీ విముఖత్వమునకుఁ గారణము నాకుఁ దెలియుటలేదు. ఎన్నిసారులు ప్రశ్నించినను జెప్పవు.'

భార్య:—స్వామీ! మీ యెడల నాకేమియు విముఖతయే లేదు. అట్లనుకొనెద రేల? మీయందు నాకుఁ బ్రేమయుఁగలదు. మీతో భార్యవలె మాటలాడెదను. నేను జేయవలసిన పరిచర్య లన్నియుఁ జేసెదను. ఏలనో యీ కార్యమునెడల వైముఖ్య మేర్పడినది. నాకు సంతానమక్కఱలేదు. ఎందులకు సంతానము? ఈ జన్మయే దుఃఖభూయిష్ఠము. ఇంకను సంతానముగని వారలనుగూడ నెందుకు దుఃఖములపాలు చేయవలె?'

వీర:—'నీ యీ సిద్ధాంతము సర్వజనసమాచరణీయ మగునయేని, నేటితో సృష్టి యంతమగును. పరమేశ్వరుని లీల కెదురు నడచెదవా?' భార్య— 'క్షణభంగురమైన యీ సౌఖ్యమునకై యింత యాయాస మెందులకు? నిత్యానందాభిలాషుల మేల గారాదు? ఈ దుర్మోహములోఁబడి నశింతు మని యెపుడు మనకు సరిగాఁ దెలియుట?

వీర :—'అట్టులైన వివాహ మేలఁ జేసికొంటివి ? నీ తలిదండ్రు లతో నీ మాటలే చెప్పకపోతివా? నిన్నుఁ బెండ్లిచేసికొన్నవాఁడు లోకసామాన్యముగ ని న్ననుభవించుట కిచ్ఛయింపఁడా ? అతని కేల నీ వపకారిణివైనావు ? తొలుతనే యోగినివి కాక పోతివా?' భార్య :—'నా తలిదండ్రులు నామాట వినలేదు; పతులు మీరైన, నామాట వినరాదా ? నిజముగా మీరు నన్నుఁ బ్రేమింతురేని, నా యీ కోర్కెకనుగుణముగ వర్తించుటకన్న నా కెక్కువ యిష్టమేమికూర్తురు ?' వీర :—'నీకు నాకన్న నెక్కువవాఁ డెవఁడైనఁ బతికావలయు నని కోర్కె యున్నది కావలయు. లేకున్న నింత యలజడి యేల కలిగించెదవు ?' భార్య :—'నా కిది గొప్ప సంబంధముకాదా ? నేను స్థానాపతిభార్యనగుదు నని యెవరనుకొన్నారు? నాతలిదండ్రుల పేదతనమునకు మీరు నాకు లభించుట మహాభాగ్యము. మీరు గనుక మా సంబంధ మొప్పుకొన్నారు'. వీర :—'దానిలో మా సద్భావ మేమియు లేదు. వివాహానంతరమునఁ దెలిసినది నాకీ యుద్యోగమైన దని. తత్పూర్వము మేమును మీవంటి వారమేగా ? నాకీ యుద్యోగమైనను మామిత్రునివలన నైనది'. భార్య :—'ఎవ రామిత్రులు ?' వీర :—నీ వెఱుఁగవా ? నేఁడు మనయింటికి భోజనమునకుఁ గూడ వచ్చెనుగదా !' భార్య :—'ఎవరో స్నేహితులు వచ్చి రని వింటిని. వా రెవరో తెలియదు.' వీర—'అతనిపేరు కట్టాన్. ఉదయణ సేతుపతి దళవాయికుమారుఁడు.'

అతనిభార్య యచటినుండి మెఱపువలె లేచిపోయినది. వీరభూపతి యే పనిమీఁదనో వెళ్ళిన దనుకొన్నాఁడు.

చాల ప్రొద్దుపోయినది. రాత్రి రెండుజాములు తిరిగినది. వీరభూపతి లేచి లోనికిఁబోయినాఁడు. దీపము చందమామ వలె వెలుతురులుగాయుచున్నది. వీరభూపతిభార్య మంచముపైఁ బండుకొన్నది. ఆమె బంగరుదేహమునందు నగలు కలసి పోవుచుండెను. మొగము కలకల నవ్వుచుండెను. వీరభూపతి యామె నిదురపోవుచున్న దనుకొన్నాఁడు. దగ్గరకు వెళ్ళి చూచి నాఁడు. ఆమెచెక్కిళ్ళవెంట నీరుకారుచున్నది. వీరభూపతికిఁ గారణము తెలియలేదు. పుట్టినిల్లు వదలిపెట్టి చాల రోజు లైనది. అందుకనియేమో యనుకొన్నాఁడు. నాలుగైదురోజు లలోఁ బరమేశ్వరసముద్రమున కొకసారి పంపించెద నను కొన్నాఁడు. ఆ దివ్యసుందరవిగ్రహమును జూచిన వీరభూ పతికి మనసాగలేదు. ఒక్కసారి ముద్దిడుకొనవలె ననిపించినది. ఇదివర కాతఁడామెను దాఁకిగూడ నెఱుఁగడు. ఆమె యతనితోఁ జక్కగా మాటలాడును. అవసరము వచ్చెనేనిఁ గొంచెము నవ్వును. అంతియ. అతఁడామెను ముట్టుకొనెనా, యామెరౌద్ర మూర్తి యగును. అందుచేత వీరభూపతి వివాహమునాఁటి నుండి యామె యిష్టప్రకారమే నడచుచుండెను. ఇప్పుడు ముద్దిడుకొన్న నామె లేచునేమో? వీరభూపతికి గుండె చలించి నది. అతనిపని యెట్లున్నది? పెరటిలో ధననిక్షేపము మూల్గు చున్నది. ముట్టుకొన్నచోఁ ద్రాఁచై కరవవచ్చును. తదేక దృష్టితో నామెవంకనే చూచుచున్న వీరభూపతికిఁ బూర్వపు నిగ్రహము సడలినది. అనన్యస్పృష్టములైన యామె గులాబి పూరేకులవంటి పెదవులమీఁద నతని నల్లని మీసములు తుమ్మెదలవలె నాడినవి. వీరభూపతి కొడలు తెలియలేదు.

అతనిభార్య నిదరపోవుచుండుటలేదు. వీరభూపతి తన్ను ముద్దిడుకొన్నాఁడని యామె గ్రహించినది. అతనికిఁ దనపై నింతప్రేమ యున్నందులకు మఱల నతనిఁ దాను ప్రేమింపఁజాల నందులకుఁ దన్నుఁదాను నిందించుకొన్నది. అపుడు కనులు తెఱచుట కామె కిష్టములేదు. నిదురలోనే త న్నాయన ముద్దిడుకొన్నాఁడని వీరభూపతి ననుకో నిమ్మను కొన్నది.

వీరభూపతి నెమ్మదిగాఁ దనగదిలోనికిఁ బోయినాఁడు. తలుపు లోపల మూసికొన్నాఁడు. పెట్టె తెఱచి యందులోని తనపూర్వప్రణయినీలేఖ తీసి చదువుకొన్నాఁడు. ఆమె యెవ్వరో మఱలఁ గనుపడలేదు. తెలియలేదు. తన మనసునుండి గ్రహించి యామె రూపము నతఁడు చిత్రించినాఁడు. ఆ చిత్రముగూడ నందులో నున్నది. దానివంక నద్దెప్రకారముగా నరగడియ సేపు చూచిచూచి, మఱల నవి పెట్టెలో నుంచినాఁడు. వీర భూపతి ఫాల్గుణమాసములో తనభార్య చిత్రమునుగూడ గీసి నాఁడు. అది తీసి దానివంకఁగొంతసేపు చూచి, యీచిత్రము నా చిత్రము నొకచోట నుంచినాఁడు. అవి యట్లుంచి తనభార్య నిదురపోవుచున్న గదిలోనికిఁ బోయి యామెను బిలిచినాఁడు. ఆమె మేలుకొనియే యున్నది. పలుకలేదు. మంచముదగ్గరకుఁ బోయి వీరభూపతి 'ప్రియా!' అని పిలిచినాఁడు. ఆమె పలుక లేదు. ఎడమచేతితో నామె పాదము పట్టుకొని కదల్చినాఁడు. ఆమె లేచి కూర్చున్నది.

భార్య :—'న న్నెందులకు వృథా వేధించెదరు? మీరు మఱలవివాహము చేసికొనుటకు నే నొప్పుకొన్నాను స్వామీ!

ఆ వివాహమునకు నేనుగూడ వచ్చెదను. నన్ను క్షమించుడు.
వీర :—'ఆమాట ని న్నెవ్వరడిగినారు? నేను మరల వివాహము చేసికొందునని నీతోఁ జెప్పితినా? అనవసరముగా మాటలాడు చున్నావు.' వీరభూపతికిఁ గోపము వచ్చినదనుకొన్న దాని భార్య :—'క్షమించుఁడు. ఇప్పు డెందులకు నన్ను మేల్కొల్పితిరి?'

వీరభూపతి 'నీతోఁబనియున్నది. ఇటుల రమ్ము' అని పోఁదొడంగెను. ఆమెయు నతని ననుసరించినది. ఆ గదిలోనికిఁ బోయిరి. వీరభూపతి యామెకు రెండు చిత్రములను జూపి, 'ఈ యిద్దఱిలో నెవ రందముగా నున్నారు?' అన్నాఁడు. ఆమె తనది కాని చిత్రము చూపించి, 'ఇది యెవరిది' అని యడిగెను. వీరభూపతి యామె చిత్రమును జూపించి, 'ఇది యెవరిదో యెఱుఁగుదువా?' అని యడిగెను. ఆమె 'తెలియదు, ఎవరిదో చెప్పుడు' అన్నది. వీరభూపతి 'ఆమెనే యడుగుము' అన్నాఁడు. ఆమె గ్రహించినది. తనదే అని తెలిసికొన్నది. తల వంచుకొని, 'ఇది యెవరు వ్రాసినారు' అన్నది. వీరభూపతి 'నీ యీ దాసుఁడు' అన్నాఁడు. అతనిభార్య నేలమీఁద మోకాళ్ళూఁది 'క్షమించుఁడన్నది' దోసిలిపట్టి. వీరభూపతి యామెను లేవఁదీయుటకుఁ జేతులు పుచ్చుకోఁబోయినాఁడు. ఆమె చేతులు వెనుకకు లాగుకొన్నది.

ఆమె 'రెండవచిత్తరు వెవరి' దన్నది. వీరభూపతి యీ కథ యంతయుఁ జెప్పినాఁడు. అతనిభార్య యాశ్చర్యపడినది. వీరభూపతి యీ లేఖ యామె కిచ్చినాఁడు. ఆమె చదువు

కొన్నది. భార్య:—'ఆమె పేరేమి? ఉత్తరముక్రింద నామె పేరు చూపించినాఁడు వీరభూపతి. అతనిభార్య ఆ పేరు పది సార్లు చదువుకొన్నది. గడియనే పాచిత్రమువంకఁ జూచినది. భార్య:— 'మీరు మఱల నాయకారే పోలేదా?' వీర:— 'నీతోడు'; తొలికోడి కూసినది.

౧౫

ప్లవంగ పోయినది, కీలక వచ్చినది. అది వైశాఖము. తెల్లవారినచో నమావాస్య. తెల్లవారులు కుట్టానునకు నిదుర పట్టలేదు. అతనికి హృదయములో నేమో భయము వేసినది. రాత్రి రెండుజాములప్పుడు లేచి యొక్కఁడును బాదచారియై స్థానాపతియింటికిఁ బయనమైనాఁడు. ద్వారమువద్ద నిదురపోవు చున్న సేవకుఁడు లేచి, ప్రభూ! ఎచ్చటకు?' కుట్టాన్ మాటాడకుండఁ బోవుచున్నాఁడు. సేవకుఁడు కత్తిదూసి స్వామి వెంట నడిచినాఁడు. స్థానాపతి యింటికిఁబోయినతరువాత సేవకుఁడు ఖడ్గము నొరలోనుంచి 'ప్రభూ! తలుపు తట్టుదునా?' యన్నాఁడు. లోనుండి తలుపు తెఱువఁబడినది. వీరభూపతిని మేల్కొల్పిరి. వీరభూపతి లేచివచ్చి సేవకునిఁ గుట్టానును జూచి, 'నాయనా! ఇప్పుడు వచ్చితి వేమి?' యని కుట్టానును కౌఁగిలించుకొన్నాఁడు. ఇరువురును సౌధాగ్రభాగమునకుఁబోయి నారు. కుట్టాను సేవకుఁడు మఱలిపోయినాఁడు. స్థానాపతియింటి తలుపులు గడియ వేయఁబడినవి.

సౌధాగ్రభాగమున స్నేహితు లిరువురుగూర్చుండిరి. కుట్టాన్ కనులవెంట నీరు కార్చఁదొడంగెను. వీరభూపతి కుట్టాను నోదార్చుచు 'బాబా! నేనుండగా నీ కింత దుఃఖ

కెందుకు? నేను నాదుఃఖమంతయు భరించగలగుదును. నీ దుఃఖమును బంచుకొనఁ గల్గుదును. నాతోఁ జెప్పుమన్నాఁడు. కుట్టాను జేపటికి రెండుసంవత్సరము లన్నాఁడు. వీరభూపతి నాకుఁ దెలియుటలే దనెను.

కుట్టాన్ 'ఈ రహస్యము నీనుండి యిన్నాళ్ళుగా దాఁచితిని. నీకుఁ జెప్పకూడదని కాదు. కాని, యేమో చెప్ప లేదు. పరాభవనామసంవత్సర వైశాఖ బహుళ అమావాస్య నాఁడు నాభార్యతోఁ జెప్పితిని. "నే నిదివఱకుఁ బ్రేమించిన స్త్రీ నుండి నా మనస్సు మఱల్చుకొని నిన్నుఁ బ్రేమించెద" నని. 'నాకీ సద్బుద్ధి నుపదేశించినది వీరభూపతి యను నామిత్రుఁడున్నాఁడు; అతఁడని చెప్పితిని అన్నా! ప్రయత్నము చేసెద' నని చెప్పి జేపటికి రెండుసంవత్సరములు. చేసినప్రయత్న మేమియు లేదు. ఇప్పటికిని నాహృదయ మంతటిమీఁదను నాపూర్వప్రణయి నియే సామ్రాజ్యము సేయుచున్నది. సూర్యోదయ మెట్లు చూతునా యని భయము వేయుచున్న దని కనులకుఁ జేతు లడ్డముము పెట్టుకొని కుట్టాన్ ప్రభువు విలపించినాడు. వీరభూపతి కిని గనుగొనలనుండి రెండు బిందువులు పడెను. వీరభూపతి 'కుట్టాన్! ఓదారు మోదారుము. నీవంటి విద్యాధికులును, వీరులే యోర్వలే రేని, జగత్తులో దుఃఖము లోర్వఁగలవా రెవ్వ రన్నాఁడు.

కుట్టాన్:— అన్నా! యీ యంతఃపుర రహస్యములెవ్వ రికిఁ జెప్పనవికావు. అందులో మనము గొప్పయిండ్లఁ బుట్టి నందున మన స్త్రీలకు రాణివాసములు. ఏ విషయము నెవ్వరి తోను జెప్పుటకువీలు లేదు. నీతోఁ గాక యిం కెవ్వరితోఁ జెప్ప

దును? నాకు స్వాతంత్ర్యమున్నచో, నేను నా భార్యను ప్రేమించినచో నిన్ను నా యంతఃపురములోనికి దీసికొనిపోయి యుందును. నిన్ను నే నంత ప్రేమించుచున్నాను.

వీరభూపతి కుట్టాన్ చేయి పట్టుకొని గద్గదస్వరముతో 'నాకుఁ దెలియును; నాకుఁ దెలియు' నన్నాఁడు. కుట్టాన్ మఱల 'నే నీ దుఃఖాగ్ని నెట్లు చల్లార్చుకొందును? నా భార్య యంతఃపురములో వడలిపోవుచున్నది. ఈ యప్రతిష్ఠ యెన్నాళ్ళని భరింతును? — కుట్టాన్ నోటినుండి రోదనధ్వని బిగ్గఱగా వచ్చెను. వీరభూపతి యతనిశిరస్సును కౌఁగిలించుకొని యెదుఱొమ్మున కాన్చుకొని, చేతులతో నతని శిరస్సును నిమిరెను. వీరభూపతి 'కుట్టాన్! ఇంతమాత్రమునకే యింత దుఃఖించెద వెందుకు? నాలో నెంతమహాగ్ని నే నిముడ్చుకొన్నాను ఆరోజున నీతోఁ జెప్పిన కథ యంతయు జ్ఞాపకముం దున్నదా? అదిగాక నా శిరస్సుపై నొక క్రొత్తబెడంద వచ్చిపడినది. ఇది నీతోఁ జెప్పలేను. నీ దుఃఖమునకు, నాదుఃఖమును జోడించు టెందులకని, దినదినము నీవిషణ్ణవదనముఁ జూచుటకుఁ జాలదా యని. కాని నీ యీదుఃఖము చూచి నాహృదయములో నా రహస్యము దాఁగుటలేదు. చెప్పుచున్నాను వినుము. నేను వెనుక నీయూరినుండి పోయినది నా తండ్రి యొద్దనుండి వచ్చి యని తెలియునుగదా? ఇంటికిఁ బోయినవెంటనే మాతండ్రి సంబంధము స్థిరపఱచినాఁడు. ఈపిల్లనే నేను వద్దని చెప్పినాను. జీవితాంతము బ్రహ్మచారిగ నుందు నన్నాను. నాతండ్రి యొప్పకొనఁడని నాకుఁ దెలియును. అయినను నాభావములు చెప్పవలయుననియే చెప్పితిని, వివాహము జరిగినది. ఆ పిల్ల యత్యంత

సౌందర్యవతి. వెనుక సీతతో నేను జెప్పిన యామెకన్న సీతయే యెక్కువ యందకత్తె యేమో యని సందేహము కలుగుచున్నది. అయినను నామె నన్నుఁ బ్రేమించినది; నే సీతను బ్రేమించినాను. అదియే భేదము. వివాహములో నామె తల యెత్తి నావంకఁ జూడలేదు. ఐదవనాఁడు గదిలో తలుపుదగ్గరగా నిలుచున్నది. ఆమెను జూచిన నాకే యప్సరఃస్త్రీయో యనిపించినది. ఆ తెల్లవారులు నాదగ్గరకురాలేదు. ఆమూఁడు రేలు నాతో మాటాడలేదు. నేను బలుకరించినఁ బలుకదు. తాఁకఁబోయినచో నావంకఁ గ్రోధదృష్టిఁ బఱపును. కుట్టాన్! నీవుఁ న న్నెఱుఁగుదువుగదా! నే నేమి పశువును గాను. పశుమార్గ మవలంబించలేదు. ఆమెను సానునయముగాఁ, "ప్రియా! ఏల నాయెడల నీ కింత వైముఖ్యము. నే నేమి తప్పుచేసితిని? విరాగిణివో? అనవసరముగ న న్నేల వివాహములోనికి దించితివి? దగఁగొన్న నాపితరులకేల మృగతృష్ణికలు చూపించితివి" అని యేమేమో చెప్పితిని. వారి యూరిలో మూనాళ్ళు గడచినది. మాయూరు వచ్చితిమి. క్రమక్రమముగ నాతో మాటలాడుట మొదలుపెట్టినది. కాని నన్ను ముట్టుకొననీయలేదు. ఇంతవఱకు నే నామె నెఱుఁగను. ఈ రహస్యము లెవరితోనైన జెప్పినవేనా? ప్రాణబంధుఁడవుకనుక నీతోఁ జెప్పుచుంటిని. తలంచుకొనిన నాహృదయము వ్రయ్యలగుచున్నది. ఆ పోయిన దుఃఖముచాలక భగవంతుఁడు నా కీక్రొత్తదుఃఖము సంపాదించి పెట్టినాఁడు. మాటలాడుట మొదలుపెట్టిన తరువాతఁగొన్నాళ్ళ కామె నెమ్మది నెమ్మదిగాఁ దనకు—'

ఇక్కడ వీరభూపతి యాఁగినాఁడు. కుట్టాను తాను చెప్ప

టకు సంశయించుచున్నట్లుగఁ గనఁబడినది. కుట్టాన్ వీరభూపతి చేతిలోఁ జేయివైచి యతని మొద్దువేళ్ళసందునఁ దన నైదు ప్రేళ్ళు దూర్చి, 'వీరా! నాతోఁ జెప్పుటకు సంశయపడవలెనా? నీకుఁ దెలిసిన దొకటియు, నాకుఁ దెలిసిన దొకటియునా? ఈ శిరస్సు పడిపోక ముందు నీరహస్యము లీ నోటిలోనుండి బయటకుఁ బోవునా?' యన్నాఁడు. వీరభూపతి నిట్టూర్పు విడిచి 'కుట్టాన్! నీ వన్నదాని కాధారము లేదు. ఈ ప్రపంచములో నీకన్న నాకుఁ బరమాప్తుఁ డెవ్వఁడు? నోటివెంట నామాటలు చెప్పలేకున్నాను! చెప్పలేకేమి? చెప్పెదను వినుము. తనకు సంసార వాంఛ లేదన్నది; లోకముతోఁ దనకు సంబంధము లేదఁట. మఱి నన్నెందుకు వివాహము చేసికొనవలె నన్నాను. తన తల్లిదండ్రులు చేసినా రన్నది. ఈపరమయోగిని నాపాలఁబడినది. నాకేమియు దుఃఖము లేదనుకొనుము! నా తలిదండ్రులయొక్క కోరిక యథారీతిగా ఫలించినది. ఇట్లని నీతోఁ జెప్పితిని. నే నిది చెప్పుట యేల యనఁగా, నాదుఃఖము నీవు పంచుకొనుటకుఁ గాదు; నీ దుఃఖము నీవు మఱచిపోవుదు వని. ఆమె యింతవఱకు కల్లెయున్నది. గృహములో సరిగానే ప్రవర్తించును. పనికత్తెలుండియుఁగూడ నా కనేకపరిచర్యలు తానే చేయుచుండును. తమలపాకు మడుపులందిచ్చును. ఈబాధ నా హృదయములో శల్యమువలె నాటుకొన్నది. ఆమె వదనము చూచినప్పుడు ప్రయత్నించి చేసిన మందహాసములోపలి తత్త్వము గోచరించు చున్నది. ఆమెను నేను దాఁకరాదు. తాఁకినచో నామె గోధుమవన్నె త్రాఁచువలెఁ జుఱచుఱఁజూచును. పురుషుఁడనైకూడ, కుట్టాన్, ఆమెవద్ద స్త్రీవలె నైపోతిని. కాదని యామెను దిర

స్కరించి మఱల వివాహము చేసికొందునా ? ఇప్పటికి రెండు
ప్రణయయాత్ర లిట్లు ఐనవి. మూఁడవదానినిగుఱించి గగనసౌధ
నిర్మాణములు చేయుదునా ? చూచితివా ? నా దుస్థితి ! ఇంచు
మించుగ నామె యాజ్ఞాబద్ధుఁడ నై పోయినాను. ఆమె మంద
హాసములకే సంతోషించుచున్నాను' అని వీరభూపతి సహజ
మైన ధైర్యము వీడి వలవల యేడ్చినాఁడు. కుట్టానునకు దుఃఖ
మాఁగలేదు. ఇరువురు నిశ్శబ్దముగఁ జాలసేపు కూర్చుండిరి.
కొంతసే పైనతరువాత కుట్టాన్ నెమ్మదిగ 'నీ యత్తవా
రేమో' రన్నాడు. వీరభూపతి కొంచెముసే పూరకుండి 'పర
మేశ్వరసముద్ర'మన్నాఁడు. కుట్టానున కేమోయొడ లంతయుఁ
దేళ్ళు ప్రాకిన ట్లయ్యెను. కుట్టాన్ లేచి నిలుచుండెను. 'వీరా !
మీ మామగారిపేరు?' వీరభూపతి 'దొడ్డదేవరా' అని సమా
ధాన మిచ్చినాఁడు కుట్టాన్ :— 'నీ భార్య పే రేమి?'
వీరభూపతి 'మీనాక్షి' యన్నాఁడు. కుట్టాన్ 'అయ్యో' యని
క్రిందఁ బడిపోవుటకు సిద్ధమైనాఁడు. వీరభూపతి లేచి యతనిని
సందిటఁబూని పరుండఁబెట్టినాఁడు కొంతసేపటికిఁ గుట్టానునకు
మెలుకువ వచ్చినది. కుట్టాను లేచి తొందరగా బయలుదేరి
పోవుచు, 'నేనుబోవుచున్నాను !' అనెను. వీరభూపతి 'ఏమట్లు
ఐతివి? అని యడిగెను. కుట్టాన్ కంఠమునుండి యేడ్పుతోఁ
గలసిన గద్గదధ్వని 'ఏమియు లేదు, ఏమియు లేదు' అని బయటికి
వచ్చెను. అనుచునే కుట్టా నాఁగ లేదు. తొందరగాఁ
బోయినాఁడు.

ఎదురుగా గమ్మరవానికొలిమిలో బండ్రగాగిన ఇనుము
గుండువలె సూర్యోదయ మైనది. కు ట్టా నరగడియలో దవ

సౌధమునకుఁ బోయెను. పోవుచునే యంతఃపురములోనికిఁ బోయెను. గదిలో గోడమీఁద నెత్తుటిబొట్లు రెండు నెత్తురులు చిమ్మినవి. అప్పుడే రెండవసంవత్సరము గుర్తుపెట్టిన ఏకవీర చేతికైన నూనె కలిపిన కుంకుమవర్ణ మతని హృదయమునుండి యామె నెత్తురు తీసిన ట్లతనికిఁ దోఁచెను.

## ౧౬

రాజునకు గొప్పవ్యాధి సంక్రమించినది. రాజు బ్రదుకునట్లు లేదు. దళవాయికి రమ్మని యుత్తరము వ్రాసినారు. రాజ్యములో లెక్కలన్నియు సరిగాఁ జూచుచున్నారు. స్థానాపతి తెల్లవారకముందే రాజాస్థానమునకుఁ బోయెను. రాత్రిప్రొద్దు పోవువఱకు నింటికి వచ్చుటకు వీలులేకపోయెను. ప్రొద్దున కుట్టాను జాలదుఃఖముతో నింటికి వెళ్ళినాఁడు. అతఁ డెట్లున్నది వీరభూపతికిఁ దెలియలేదు.

కుట్టా నంత దుఃఖించుటకుఁ గారణము వీరభూపతికిఁ దెలియలేదు. తన భార్యపేరు చెప్పినపు డతఁ డట్లుగా నయ్యెనను భావ మతనికిఁ బోలేదు. కుట్టాన్ తన దురవస్థలు తలంచుకొనియే యట్లయ్యె నని యనుకొన్నాఁడు.

వీరభూపతి రాత్రి ప్రొద్దుపోయి యింటికి వచ్చి, భోజనముచేయకయ కుట్టానువద్దకుఁ బోయినాఁడు. కుట్టాన్ నిదుర పోవుచున్నాఁడు. వీరభూపతి యొక సేవకునిఁ బిలిచి, 'మీస్వామి నేఁ డెట్లున్నాఁడు' అని యడిగెను.

సేవ:— బాబూ! ప్రొద్దుటి నుండియు భోజనము చేయలేదు. స్నానమాడలేదు. వారివద్దకుఁ బోవుటకు మాకు భయమువేసినది. కనులు చింతనిప్పులవలె నున్నవి. ఏమో

ఆలోచించుచున్నారు. పగ తెల్ల నిల్లంతయుఁ దోఁటయంతయు నేదో పని యున్నట్లుగాఁ దిరుగుచున్నారు. జాముప్రొద్దున్న దనఁగా నీ నిద్దురకుఁబడినారు. ఇప్పుడు జాముపొద్దు పోయినది. నిద్ర లేవలేదు. ప్రాణము శోష వచ్చునేమో? లేపనైన లేవుడు.'

వీరభూపతి కుట్టానును గదల్పవద్దని చెప్పి యింటికిఁ బోయినాఁడు. ఆ రాత్రియంతయు నిశ్శబ్దముగఁ బ్రశాంతగంభీర ముగఁ గడచిపోయినది.

తెల్లవారినది. ఆణిమాసము వచ్చినది. పలుచని సంజ మొగిలు తెరచాటున నుదయించిన సూర్యబింబము కొంచెము పైకి వచ్చినతరువాత స్వచ్ఛకిరణసమూహములతో లోక మున కంతయు వెలుఁగు విరఁజిమ్మెను.

రాజున కా నాఁడు కొంచెము నెమ్మదిగా నున్నది. సేనాపతి రానక్కఱ లేదని కబురువచ్చినది. కొంచెము నెమ్మ దిగనే యున్న దని దళవాయికి వర్తమానము చేసిరి.

కుట్టానుకు జాముప్రొద్దెక్కిన తరువాత మెలకువ వచ్చినది. లేచి మంచముపైనిఁ గొంతవఱకు శాంతముగాఁ గూర్చుండి, స్నానాదికములు చేసినాఁడు.

వీరభద్రభట్టరును బిలచి యంగడికిఁబోయి రెండువందల పన్నుల వెలఁగల యొక చీరయుఁ, బసుపు కుంకుమ తత్క్షణము తేవలయు నని చెప్పినాఁడు.

అవి వచ్చెను. మంచిగంధపు చందుకాయ పెట్టెలో నుండి భూర్జపత్రము తీసి, యా యరలలో వాడినపూలును, గస్తూరియు మఱల నుంచి, యా పెట్టెయుఁ చీరయు, పసుపు

కుంకుమలును బూని వీరభూపతి యింటికిఁ బోయినాఁడు. నిన్న నెల్ల భోజనము లేకపోవుటచేత నడువలేక పోయెను. బండి వద్దనెను.

వీరభూపతి పసుపు, కుంకుమ, చీరయుఁ జూచి యివి యేమి టని యడిగెను. కుట్టాన్ :—'నెమ్మదిగాఁ జెప్పెదను. తొందరపడకుము;' (కొంత యాఁగి) నే నీ రోజున నిచ్చటనే భోజనము చేసెదను.' వీరభూపతి 'సరే' ననెను. కుట్టాన్ :—'మన మిరువురమే కూర్చుందము. మనకు నీ భార్య వడ్డన చేయవలెను. వీర :—'ఆమె నడిగెదను. ఆమె యొప్పుకొన వలయుఁగదా! నీవు దళవాయి కొడుకవు. నీ యెదుటకు వచ్చునో రాదో ?' కుట్టాన్ :—'నే నడిగెదను. అన్నగారి వద్దకు రాఁగూడదా? ఎంత తెరచాటయినను నంతఃపుర స్త్రీలయినను, నన్నలకు, బంధువులకుఁ గనంబడరాదా?'

ఇరువురును మేడపైఁ బెకిక గదిలోనికిఁ బోయిరి. మీనాక్షి లేచి నిలుచున్నది. కుట్టానును గుర్తుపట్టినది. లోఁతైన కనులతో నతనివంకఁ జూచినది. కుట్టాన్ కనులు క్రొత్తగాఁ గాపురమునకుఁ బోయిన చెల్లెలిని జూచు నన్నగారి కనులవలె సోదరస్నేహసూచితమందహాసములు వెలిఁగ్రక్కినవి. ఆతని విశాలములైన నేత్రముల కొనలయందు బాష్పములు నిండినవి.

వీర :—'మీనా! మీ అన్నగారికి నేడు నీవు భోజనము పెట్టవలెనఁట. ఈయన నెఱుఁగవు కాఁబోలు. ఈయనే కుట్టాన్ సేతుపతి. నీకుఁ జెప్పితినిగదా నాకుఁ బరమాప్తుఁ డని. నేను దినుచున్న ప్రతిముద్దకును నితనిదే.'

మీనాక్షి స్తబ్ధ యైపోయెను. ఆమె నేత్రముల వెంట రెండుబాష్పబిందువులు రాలెను. వారివంకఁ జూడలేక తల వంచుకొన్నది.

కుట్టాన్ :—'అమ్మా! ఎందుల కట్లు నిస్తబ్ధ వయ్యెదవు? ఇది కోరరాని కోరిక యనియా? నీ భర్తకు నాకు నున్న స్నేహ మట్టిది. నీవు నాకు సహోదరివి. సందియ మెందులకు? నీవు వడ్డించఁగా భోజనము చేయవలె ననిపించి నది. అందుచేత వచ్చినాను. నీ విష్టపడవేనిఁ బోయెదను.'

మీనాక్షి పెద్దనిట్టూర్పు పుచ్చి, 'అన్నా! వడ్డించెదను. నేను నిస్తబ్ధ నైనది యందుకుఁ గాదు. తరువాతఁ జెప్పెదను' అన్నది.

ఆ మూఁడునెలలనుండి మీనాక్షి నంతయుత్సాహముగా నెవ్వరును నెప్పుడును జూడలేదు. భోజనానంతరము వఱకు నామె మహోత్సాహముతో నున్నది. మీనాక్షి కూడ భోజనముచేసి వచ్చినది. మేడపైగదిలోఁ దివాచి పఱచి కూర్చున్నారు. మీనాక్షినికూడఁ గూర్చుండు మని కుట్టాన్ బలవంతము చేసినాఁడు. ఆమెయుఁ గూర్చున్నది. కుట్టాన్ వీరభూపతితో నిట్లు మొదలు పెట్టినాఁడు. 'అన్నా! నీకు నే నిప్పుడు కొన్నిసంగతులు చెప్పఁబోవుచున్నాను. అవి విచారకరమైనవో, ఆనందకరములైనవో నాకే తెలియదు. చెప్పవచ్చునో, చెప్పరాదో కూడఁ దెలియకున్నది. అవి యన్నియుఁ జెప్పుటకు నాచెల్లెలు మీనాక్షి యనుజ్ఞకూడఁ దీసికొనవలసియున్నది' అని యామెవంకఁ జూచినాఁడు. ఆమె తల వంచుకొని తన యభిమతమును శిరశ్చాలనముచే నా

తెలిపినది. కుట్టాన్:- 'వీరా! నీవంటి ధైర్యవంతుఁడు, బుద్ధిమంతుఁడు నివియన్నియు విన్నతరువాత యథాప్రకారముగనే ప్రవర్తింపఁగలఁడను నుద్దేశముతోఁ జెప్పుచున్నాను. నే నిపుడు నీ కొకమాట చెప్పఁబోవుచున్నాను. భయపడకుము. నిగ్రహము పూనుము. చెప్పుదునా?' వీరభూపతి తల యూఁచినాఁడు. కుట్టాన్ :- 'నీతో నే నిదివఱకుఁ బ్రేమించితిని నని చెప్పితినే - చాల జాగ్రతగానుండుము - ఆమె యీమె.' వీరభూపతికిఁ దల తిరిగిపోయినది. అతడు 'ఆ!' అని బిగ్గరగా నఱచినాఁడు. మీనాక్షి యేకధారగాఁ గన్నీళ్ళు జార్చుచున్నది. కుట్టాన్:- 'వీరా! ఇదియేనా ధైర్యము? ఓర్చుకొనుము. మించివచ్చిన దేమియు లేదు. ఇదియంతయు భగవంతుని లీల. మన మేమి చేయఁగల్గుదుము? నేను నీకుఁబరమాప్తుఁడను. నాకన్న నిన్నుఁ బ్రేమించువారు జగత్తులో నీ కింక నెవరు? అధైర్య మెందుకు? శోకమెందులకు? అన్నా! నీక శుభముకల్గుటకుఁ బూర్వము నాగొంతుక తెఱుగుకొనిపోనిమ్ము." వీరభూపతి కొంచెము యథాస్థితికి వచ్చినాఁడు. కుట్టాన్:-'మొన్నరాత్రి నీవు నీసంగతియంతయు నాతోఁ జెప్పినావు. నేను బాతాళమునకుఁ ద్రొక్కబడితి ననుకొన్నాను. హఠాత్తుగా విన్న యీవార్త నాతల బ్రద్దలుకొట్టినది. ఇది వినుటకు నీ కెప్పు డెట్లున్నదో నాకు నప్పు డట్లున్నది. అప్పు డింటికిఁబోయి, యేమిచేయుదును? ఏమియుఁ దోఁచలేదు. ఏమో నేను నూఱు బ్రహ్మహత్యలు చేసిన ట్లనిపించినది. వీరా! నాకుఁ బిచ్చియెత్తు ననుకొన్నాను. అపుడు పిచ్చియే యెత్తినది. కాని శ్రీ సుందరేశ్వరుఁడు నాయం దున్నాఁడు. ఈ మహాకల్లోలము నిన్నపగలు రెండుజాములు దాఁటువఱకు

దాఁటినాను. నీవు నాకుఁ బరమాప్తుఁడవు. నీకన్న నాకుఁ బ్రపంచములోఁ బ్రేమింపఁగలవారు లేరు. అట్టి నీ భార్యనా నేను బ్రేమించుట? నాహృదయము కణకణలాడు నిప్పులలోఁ బడవేసి కాచిన ట్లయినది. విషసంలిప్తాగ్రములైన వెయ్యి బాకు లొక్కమాఱుగా నాహృదయములో దిగవేసినను నంత బాధయుండదు. చివరకీ ప్రవాహములోఁబడి నశించిపోకుండ నొడ్డుకుఁ జేరుకొన్నాను. ఈమెయెడ నిదివఱకు నాకుఁగల ప్రేమ యంతయు సోదరప్రేమగా మార్చుకొన్నాను. వీరా! నాకు అక్కలుగాని, చెల్లెండ్రుగాని లేరు. భగవంతుఁడు నా కా లోప మీ ప్రకారముగఁ దీర్చినాఁడు. నిజముగా మీ రిర్వురు సుఖముగా సంసారము చేయుచున్నఁ జూచుటయే నేను గోరునది. ఇఁక నా పూర్వవిషయము నాకు జ్ఞప్తికి రాదు. ఏలన, నిన్న దానికంతకుఁ దగినంత నరకబాధ మానసికముగా ననుభవించితిని. ఆ భావము నాలోనుండి పోయినది. ఇప్పు డీమెను నేను సోదరివలెఁ జూచుచున్నాను. అట్లు చూడఁగలను. వీరా! ఏ దురూహయు లేకుండ నీమె నిపుడు కౌగిలించుకొనఁ గలను. నా చెల్లెలనుచు నెవ్వరైన నున్నచో నామె నెట్లు కౌఁగిలించుకొందునో, యీమె నట్లు కౌఁగిలించుకొనఁగలను. నిన్న నేను బొందిన మహాబాధవలన, నా తప్పువలన నాకీ శక్తి వచ్చినది. వీరా! ఈ జీవితములో నన్ను నీయొడ నెంత కృతజ్ఞునిగాఁ జేసికొంటివి! నన్ను ఘోరపాపమునుండి రక్షించితివి. నాధర్మపత్నిని ప్రేమించుటకు మార్గము చూపితివి. ఇం కేమి చేయవలయును? నీవు నాకు గురువువంటి వాఁడవు'— అని కుట్టాన్ ఏడ్చుచు వీరభూపతి పాదములు కనుల కద్దుకొనెను,

వీరభూపతి యతని చేతులు తీసి, 'కుట్టాన్!' నా పూర్వజన్మ సుకృతమువలన నీవు నాకు స్నేహితుఁడ వైనావు. నీకు నాకు పోలిక యెక్కడ? నీవు ఋషివి. నే నింకను మనుష్యుఁడనే. శ్రీ సుందరేశ్వరుఁడ విట్లవతరించినావు' అని కన్నీళ్ళు పెట్టుకొన్నాఁడు. కుట్టాన్ చీరయు, పసుపు కుంకుమలును, పండు కాయ పెట్టెయు మీనాక్షి కిచ్చి, 'అమ్మా! బుద్ధిమంతురాలవు. విద్యాధికురాలవు. నీకు నేఁ జెప్పవలసిన దేమున్నది? ఈచీర కట్టుకొనుము' అనెను. ఆమె కన్నీళ్ళు తుడుచుకొని యాచీర ధరించివచ్చి కుట్టానునకును, భర్తకును నమస్కారము చేసెను. నమస్కృతిలో మీనాక్షి వీరభూపతి పాదములను జేతులతోఁ జక్కఁగా నిమిరెను.

౧౭

మీనాక్షి 'అన్నా! యింక రెండునాళ్ళు లుండు' మన్నది. వీరభూపతి పోనిచ్చినాఁడు కాదు. కుట్టాన్ పంచమివఱకు వీరభూపతి యిల్లు వదలి పెట్టుటకు వీలులేకపోయినది. కుట్టానున కేకవీరను జూడవలె నని యున్నది. ఆమెతో నిదియంతయుఁ జెప్పవలె ననిపించినది. మీనాక్షిమాట తీసివేయలేక యున్నాఁడు. రాజునకుఁ దదియనాఁటికే యెక్కువ యయినది. దళవాయిని దొందరగా రమ్మని మఱల వర్తమానము చేసినారు; దళవాయి వచ్చుటకు వీలులేకపోయినది. మారవ దేశము ముద్దుకృష్ణప్పనాయకుఁడు రాజ్యమునకు రాక పూర్వము దొంగలచే నిండియుండెను. రామనాథము, మధురకును రామేశ్వరమునకును మధ్య నున్నది. రామనాథము వద్దఁ బెద్ద చెఱువున్నది. దానికి 'పాండ్యకమై' అని పేరు.

అది పూర్వ మెప్పుడో పాండ్యులు త్రవ్వించిన చెఱువఁట. ఆ తటాకమువద్దఁ జోరులు మూఁగి రామేశ్వరమునకుఁ బోవు మార్గములో యాత్రికులను దోఁచుకొనుచుండెడివారు. ఈ మార్గములో విశ్వనాథనాయకుని కాలమునుండియు నిట్లే యున్నది. కాని ముద్దుకృష్ణప్పనాయకుఁడు దానివిషయమై శ్రద్ధతీసికొని దళవాయి నచ్చటికిఁ బంపించి, యీ మారవదేశ మును స్వాధీనము చేసికొనెను. మధురనాయకులకు రామ నాథదేశము స్వాధీనము చేసికొనవలసిన యగత్యమున్నది. సముద్రపు టొడ్డంతయుఁ బోర్చుగీసువారి యధీనతలో నుండి పోయెను. పోర్చుగీసు రాజప్రతినిధులచేత నియమింపఁబడిన యధికారులు సముద్రపు టొడ్డుననున్న పల్లెలలోఁ, బట్టణము లలో వర్తకముచేత వచ్చుచున్న రాబడులు, పన్నులును వసూలు చేసికొనుచుండిరి. ఆ యాస్థలములయందు నేరములు, శిక్షలు మొదలగు సర్వాధికారములు బోర్చుగీసువారే చూచుచుండిరి. స్వదేశరాజులనుండి యట్టి యధికారమును బోర్చుగీసువారు పొందలేదు. పారవులు (పల్లెవారు) తూర్పు సముద్రతీరములం దున్నవారందఱు పోర్చుగీసు రాజునకే ప్రజ యఁట. అక్షరజ్ఞానము లేని యీ సముద్రతీరప్రజను బోర్చుగీసువారు మతబోధకులవలనను, నల్పపారితోషిక ముల వలనను నాకర్షించి వారినిఁ గ్రైస్తవమతములోనికి మార్చి, వారియందఁగొని యిట్టి యక్రమములను దేశములో జేయఁజొచ్చిరి. ఈ రాజకీయదౌర్జన్యమును, ధననష్టమును నివారించుటకు మధురరాజులు మారవదేశమును జక్కఁగా నేలుచుట యవసర మైనది. రామేశ్వరమునకుఁ బోవు యాత్రి

 

కులను దోచుకొనుటఁ గూడ నాకోజులలో క్రైస్తవమతాభి వృద్ధి చేయుటగా భావింపఁబడెనుగాబోలు. మొదట ఉదయణ సేతుపతి యీపనిమీఁద నియమింపఁబడినది విశ్వావసునామ సంవత్సరమున.

సేతుపతి దళవాయి యిచ్చటకుఁ జేరినతోడనే మొట్ట మొదట రామేశ్వరమునకుఁ బోవుమార్గము బాగుపఱచుటకై రామనాథమునకును, బాగళూరునకును కోటలుకట్టి యచ్చోట సైన్యముంచెను. యాత్రికులను గుంపులు గుంపులుగాఁ జేసి, ప్రతి గుంపువెంటను కొందఱు సైనికులను బంపించుచుండెను. రామనాథమునుండి యిట్టి యాత్రికులు ప్రొద్దున నొకగుంపు, సాయంతన మొకగుంపునుబయలుదేరుదురు. వారివెంటనేఁ బది సైనికులు వీరివెంట నేఁబదిసైనికులును బోవుచుందురు. ఈ రెండుసైనికుల జట్టులును మఱునాఁడు రామేశ్వరమునుండి వచ్చు యాత్రికులతో వత్తురు. ఇచ్చటినుండి మఱునాఁడు మఱి రెండు యాత్రికులగుంపులు బయలుదేరును. ఇట్లు మొదట యాత్రికులకు సౌలభ్యముచేసి, యనంతరమున నా చుట్టుపట్ల నిరంకుశముగాఁ బ్రవర్తించుచున్న చిన్న చిన్న పాళెగారులనాయకు లను గ్రమక్రమముగ సాధించి కాళయార్కోవెల, పట్టమంగ ళము మొదలగు స్థానములలోఁదగిన యుద్ధశాలల నుంచి కట్టు దిట్టములు చేసెను. తరువాత సేతుపతి రామనాథము చుట్టు పట్ల నున్న యరణ్యములను ఛేదించి పాంక్యకమ్మైజలముతో భూమియంతయు సాఁగుచేయించెను. దేశము చోరభయము లేక తృణజలకాష్ఠసమృద్ధిఁ గలిగి సేతుపతి పరిపాలనమున శాంతి గలిగియుండెను. పరదేశీయుల యుబ్బును దాక్షాలిక

ముగాఁ దగ్గెను కాని మతవిషయికమైన యే పనులు నేతుపతి చేయలేదు.

రాజునకుఁ జాల జబ్బుగా నున్నది. రమ్మని కబురు వచ్చుటచే దళవాయికి భయమువేసినది. రాజున కేట్లుంకునో! ఒకవేళ రాజు మృతినొందెనా, తానీ రామనాథ ప్రాంతము లలోఁజేసిన ప్రయత్నము లన్నియు నిష్ఫలము లగును. సామా న్యముగా రాజు మాఱినపుడు సామంతులును, శత్రువులును దమ స్వాతంత్ర్యమునకును బోయినభూములు మఱల సంపా దించుకొనుటకును బ్రయత్నింతురు. కనుక నిదియే సమయ మని, దళవాయి రాజధానిలో ననేక కార్యములు చూచు చుండును, వచ్చుటకు వీలులేదని తెలిసి, యణఁగద్రొక్కఁ బడిన చిన్నచిన్ననాయకులు మఱలఁ దమ స్వాతంత్ర్యమును వహించిరా, యీసారి వారిని గెలుచుటకుఁ గూడఁ గష్టమై పోవును. అందుకని తాను రాజధానికిఁబోకమున్న తనకుమా రుని రమ్మని దళవాయి కబురంపినాఁడు. తనకుమారునిఁ దన యధికారములో నుంచి తాను రాజధానికిఁబోవలయును. దళ వాయి తత్క్షణము రాజధానికిఁబోవలె. కుట్టాన్ తత్క్షణము రామనాథమునకు రావలయును.

జ్యేష్ఠ శుక్ల పంచమినాఁడే కుట్టాన్ బయలు దేరవలసి వచ్చెను. ఏకవీరను జూచుటకుఁగూడ వీలులేక పోయినది.

దళవాయి మధురకు దళమికిఁ జేరుకొనెను. రాజు ముద్దుకృష్ణప్పనాయకుఁడు మంచములోఁబరుండియే తనయొద్దకు కొడుకులను, దళవాయిని, బ్రధానిని, రాయసమునుగూర్చుండ బెట్టుకొని రాజ్యమంతయుఁ దనకొడుకుల కప్పగించెను. పెద్ద

కుమారుఁడైన వీరప్పనాయకుని రాజును జేయవలసిన దని నిర్ణయించెను. రెండవ కుమారుఁడును, మహాసమర్థుఁడైన తిరుమలనాయకునితో నన్నగారికిఁ జేదోడు వాదోడుగా నుండుమనియుఁ గస్తూరి రంగప్పవలెఁ బ్రవర్తించరాదనియు, నట్లయిన రాజ్యము బహుధా పంచుకొనిపోయి శత్రువులకు సాధ్యమగు ననియుఁ జెప్పెను. తిరుమలనాయకుఁడు తండ్రి పాదములవద్ద గూర్చున్నవాడు, సాష్టాంగమువ, లేచి, కర్తివ్యూని, తనయన్న గారినే సేవించెద ననియు, నన్నగారికి సంతానము కలిగెనేని యతని తరువాతఁ దనయన్న సంతానమునే రాజుఁ జేసెద ననియుఁ బ్రమాణము చేసెను.. తరువాత రాజు దళవాయి, ప్రధాని, రాయసములతోఁ దననువలెనే తనకుమారునిఁగూడ సేవించవలె ననియు, వారి రాజభక్తివలననే రాజ్యము సాఁగుచున్న దనియుఁ జెప్పి, సేతుపతి చేసిన మహాత్కార్యములను, నతఁడు చూపించిన రాజభక్తిని గొనియాడెను. వారందఱును రాజ్యమును బూర్వమువలెనే కాపాడెదమని ప్రమాణముచేసిరి. తరువాత రాజు చాలసేపు శాంతముగా నుండెను. అదివఱకే పాళెగాం డ్రందఱు ననేక కార్యముల మిషమీఁద మధురకుఁ బిలిపింపఁ బడిరి. రాజు సాయంతనమున నొక రొక్కరినే పిలిచి వారివద్దనుండిగూడ వాగ్దానములు తీసికొని యానాడే వీరప్పనాయకుని కభిషేకము చేయించెను. క్రొత్త రాజున కందఱును జోహారులు చేసిరి. మఱునాఁ డేకాదశి. ఆనాఁడు చంద్రోదయ సమయమునకు శ్రీ ముత్తుకృష్ణప్పనాయకుఁడు పరమపదించెను.

రాజసౌధ మంతయు రోదనధ్వనులతో నిండిపోయెను. దళవాయియుఁ దిరుమలనాయకుఁడును బోఁబు యూరడించిరి,

పంచిగంధపు చెక్కమీద నేతిగిండ్లు క్రుమ్మరించి వృద్ధరాజు శవము వాహాంతి చేసిరి. వీరప్పనాయక మహారాజులుంగారు సహస్ర గోదానములును, శతాగ్రహారదానములుఁ జేసెను.

సామంతరాజులయుఁ బ్రధానాధికారులయు రాజభక్తి వలన రాజ్యము మఱల శాంతముగా జరుగుచుండెను. క్రొత్త రాజునకుఁ బాళెగాండ్రిచ్చిన కానుకలతో రాజసౌధము నిండి పోయెను. వృద్ధరాజు పోయినాఁడన్న దుఃఖ మేయంతఃపురము నందు దాఁగియున్నదో కాని, మధురరాజ్యమంతయు నూతన భూపతిపట్టాభిషేకోత్సవము నందలి యానందచిహ్నముల తోడనే కలకలలాడుచుండెను.

వీరభూపతి యుదయన్ సేతుపతి నొకనాఁడు భోజనమునకుఁ బిలిచెను. వీరభూపతి చిన్నవాఁడు. చనిపోయిన వృద్ధ నరపతికూడ వీరభూపతికి స్థానాపతి యధికారము వచ్చి మూఁడు నెల లయినను మిక్కిలి నమర్థతతో వర్తించినాఁడని చెప్పెను. వీరభూపతి నిదివరకు వృద్ధసేతుపతి చూడలేదు. అతనికి యుద్యోగము కట్టాన్ తిరుమలనాయకునితోఁ జెప్పి యిప్పించెనని యతనికిఁ దెలియును. వీరభూపతిని జూచిన ఉదయన్ సేతుపతికి ముద్దయినది. కుఱ్ఱవాఁడు, తెలివితేటలు కల వాఁడని.

భోజనవేళ మీనాక్షి వడ్డించినది. దళవాయి మీనాక్షి నెఱుఁగును. ఆశ్చర్యపోయినాఁడు. వీరభూపతి నడిగినాఁడు స్థానాపతి కథయంతయు సంక్షిప్తముగా దళవాయికిఁ దెలియ జేసెను.

మీనాక్షి 'తాతా! అన్నకు నా [illegible] నంత్రమెు

యనుకొంటిరి' యన్నది. తన కుమారుని సంసారమునకు మంచిరోజులు వచ్చినవని దళవాయి సంతసించినాఁడు. ఇప్పుడు కొడుకును, కోడలిని విడిగా నుంచరాదు. దళవాయి నాఁటితిథి యడిగెను. 'ఆషాఢ బహుళ చతుర్దశి.'

## ౧౮

మీనాక్షి సేతుపతుల సౌధమునకుఁ బోవుచు వచ్చుచుండెను. ఏకవీరకు నామెకు మిక్కిలిఁ జెలిమియైనది. ఏకవీర కూడ రెండుమూఁడుసారులు స్థానాపతియింటికి వచ్చినది. ఆమె వచ్చిన రెండు మూఁడుసారులును స్థానాపతి యింటివద్ద లేఁడు. రాజకార్యము లంత యొత్తిడిగానున్నవి. వీరభూపతి యింటికే వచ్చుట లేదు. వరుసగా వారముదినము లీ పూఁట వచ్చుటకు వీలులేదు, ఈపూఁట వచ్చుటకు వీలులేదని యతఁ డింటికి వర్తమానము లంపెను. మీనాక్షి సేతుపతుల ప్రణయమును గూర్చి వీరభూపతికిఁ దెలిసిన తరువాత కుట్టాన్ మూఁడు దినములు వీరభూపతి యింటనే యుండెను. అనంతర మతఁడు రామనాథమునకు వెడలిపోయెను. ఆ తరువాత మీనాక్షి వీరభూపతుల చర్యలలోఁ జాలమార్పులు కలిగెను. వీరభూపతి పైనిఁ బ్రేమ నానాటికి మీనాక్షి కభివృద్ధి నొందుచుండెను. మీనాక్షి నిత్యము వీరభూపతి యున్నచోటఁ గాని యుండదు. ఆతనితో మాటాడునపు డామె మొగములో నవ్యక్తములైన స్వర్గవాంఛలు తలచూపుచుండును. ఆ నాలుగైదు రోజులలో మీనాక్షి తనంతటఁ దాను వీరభూపతిని రెండుసారులు కౌఁగిలించుకొన్నది. కాని వీరభూపతిలోఁ గదలిక లేదు, అతఁడు మున్నువోలె నామెను బలుకరించుటకూడ

లేదు. తనవద్దనే కూర్చున్న మీనాక్షి నచటనుండి లేచి పొమ్మనును. ఆమె తనవద్దకు వచ్చినవెంటనే తనకేదో పని యున్నట్లు లేచిపోవును. మీనాక్షి యతనిఁ గౌఁగిలించుకొన్న పుడు రంభాపరిష్వంగమున నిశ్చలుండును నియతేంద్రియుఁడు నైన శుకునివలెఁగూర్చుండును. ఇతని యీ తూష్ణీంభావము మీనాక్షికి దుఃఖము కలిగించలేదు. అంత కంత కామె ప్రేమ వృద్ధియగుచునే యుండెను. పొంగి వచ్చు నా ప్రేమప్రవాహ మును వీరభూపతి తాళుకొనలేకపోయినాఁడు. ఆమె చేయు ప్రేమోద్యోతక కార్యముల నోర్చుకొనలేకపోయినాఁడు. అతని మనస్సు కదలిపోయినది. సేతుపతి, మీనాక్షి – వీరిరువురి ప్రేమయు నతని మనస్సు నావరించెను. ఇప్పుడు వారి ప్రేమ సోదరీసోదరప్రేమకదా! శారీరకమైన సంయోగము లేక పోయినను వారిరువురే భార్యాభర్తలు. వారి యా ప్రేమ యూరకే పోవునది కాదు. వారిజీవితము లున్నంతవఱకు నది తుడిచివేయఁబడునది కాదు. ఇప్పటి వారియునికి యథార్థ మైనను ప్రథమప్రేమ, మీనాక్షిహృదయపుమొగ్గ, కుట్టాక సేతుపతియే వాసనచూచినాఁడు ఇప్పు డది యనన్యభోగ్యము. వీరభూపతికి నిద్రలేదు. ఆహారము లేదు. నిరంతరము మీనాక్షీసాహచర్య మోర్చుకొనలేక రాజసౌధమునకుఁ బోయి యందే నివసించుచుండెను

వీరభూపతి యింటికి వచ్చి వారము దినము లయినది. మీనాక్షి యతనికొఱకు రాజసౌధమునకుఁ బోదమనుకొన్నది. కాని యట్లు చేయరాదనుకొన్నది. ఉన్నన్నినా ళ్ళుండవచ్చునా, యిఁక తొందరలో రావచ్చుననుకొన్నది. తొందరపడి సంఘ

మర్యాద నుల్లంఘించుట యేల ననుకొన్నది. వీరభూపతిని గూర్చి యామె యూహించినపుడెల్ల నామె మొగము చివరలు రేఖాసౌష్ఠవసీమలును, గనులు జ్యోతిరాస్థానములు నగుచుండెను. ఆమె యొడలంతయుఁ బులకరించినట్లుండెను.

ఈ మహాప్రేమలో నామెకు వీరభూపతికిఁ దనయెడ నట్టిభావ మున్నదో తెలియలేదు. తన పూర్వనైల్యమంతయుఁ గుష్టాన్ తపస్సుచేఁ బరిక్షాళితమై పోయిన దనుకొన్నది. వీరభూపతివంటి బుద్ధిశాలి కందలి సమున్నతార్థము గోచరింపకుండుట దుర్లభ మనుకొన్నది. వీరభూపతి యీ యంతఃపురాశ్రయము పనియొత్తిడివలననే కలిగె ననుకొన్నది. రాజు పోయిన క్రొత్తరిక మా యూహకు బల మిచ్చినది.

నాఁడు శ్రావణ శుద్ధదశమి. ఆకసమున మొగిళ్ళు కృష్ణసారమృగమువలె, అగురు ధూపములవలె, ఎలుఁగుబంట్లవలె ఏనుఁగుగున్నలవలె దుముకుచుండెను; వ్యాపించుచుండెను. కదలకుండెను; ఘీంకరించుచుండెను. తూరుపునఁ బట్టిన మబ్బు చుట్టుపట్ల నున్న పదిమబ్బులఁ గలుపుకొని వాన యొలుకబోసినదే యనిపించినది. కాని యింతలో నొకపెద్దగాలివచ్చి దానిని బునరేకాదశధా విడఁబఱచెను. సూర్యుడుమాత్ర మప్పుడప్పుడు పలుచని మబ్బులలోనుండి మందరశ్మిలు వెలయించునేగాని యింతలో మఱల నొక నల్లకానుగుల గుమ్మువంటి మేఘమడ్డు వచ్చి యతని లోకమును వేఱుపఱచును.

ఒంటరిగా నున్న మీనాక్షి కేమియుఁ దోఁచలేదు. ఆమెకు వీరభూపతి దగ్గరలేమి వియోగభారము ననిపించలేదు. ప్రతిక్షణ మతని రాక నెదురుచూచు నామె దేహము మాటి

మాటికి గ్రొత్తక్రొత్త పులకలచే గరగరికలు దాల్చుచుండెను. ఆమె కింతలో నేకవీరవద్దకుఁ బోవలె ననిపించినది. ఇదివర కామె యేకవీర యింటికిఁ బదిసార్లదాఁకఁ బోయియుండవచ్చును. ఏకవీర యనిన మీనాక్షికిఁ జెప్పరానంత ప్రేమయున్నది. ఆప్రేమకుఁ గారణమున్నది. ఆమెను జూచినంతనే మీనాక్షికిఁ దన జీవితమంతయు జ్ఞప్తికి వచ్చును. తన జీవితరహస్యమంతయు నొక గుళికవలె నామెలో నున్నట్లనిపించును. కాని యేకవీరకు మీనాక్షిమీఁద నేటిప్రేమ? మీనాక్షి యేకవీరకు స్థానాపతి భార్య. స్థానాపతికి దనభర్తకు స్నేహము. స్థానాపతి కుద్యోగ మిప్పించినది తనభర్త. అందుచేతఁగూడఁ దనయందు మీనాక్షికిఁ బ్రేమ కలుగవచ్చును. అయినను నంతప్రేమ చూపుచున్న మీనాక్షిని హృదయముతోఁ దాను ప్రేమించలేకపోయినను, లోకమర్యాద యెంతవర కభిలషించునో యంతవఱ కామెను ప్రేమించునట్లు వ్యక్తపఱచుచుండెను. అందుకనియే యంతవర కిల్లుకదలని యేకవీర రెండు మూఁడుసార్లు స్థానాపతియింటికి వెళ్ళినది. వెళ్ళినది కొంచెము సేపుమాత్రమే యుండి తిరిగియు వచ్చినది. మీనాక్షి యామెకుఁ దన యిల్లంతయుఁ జూపించనెంచినది. ఏకవీర యామె కెడమీయక వెళ్ళినట్లే వెళ్ళి తిరిగి వచ్చినది. మీనాక్షి సహజముగ వివేకవతి; లోకులభావములు వారి ప్రవర్తనలవలనఁ దెలిసికొనునేర్పు కలదియుకాని, యిప్పటి యామెస్థితి యొక తన్మయత్వముగా నున్నది. తన తొల్లిఁటి ప్రేమ, దాని పరిణామము, తన యిచ్ఛలేని తల్లిదండ్రుల బలవంతమువలన పెండ్లి, ఆ వచ్చినభర్త తన యిచ్ఛ నడిపిన

వాఁడు, దైవాద్యా కుట్రాళ కలయిక, అతని మహత్తర త్యాగము - ఈ విచిత్రసంఘటన మెల్ల నామె యెడందలో దేనినిగూర్చియు నాలోచించుట కెడమియ్యు లేదు. తన వివాహ మైననాఁటినుండి తన పతియెడలఁ దనదోష మామెను వేధించుచుండెను. ఇతర మైన యే సంగతిని గూర్చి యూహిం చుటకుఁ దా వియ్యని యామెమనసు తనశక్తినంతయు నీవైపు నకుఁ ద్రోసినది. దివారాత్రము లామె వీరభూపతిని గూర్చియే యూహించుట. ఏకవీర తనయెడల నెట్లు ప్రవర్తించినది యామెకు గుర్తేలేదు. నాఁడు మఱల నేకవీరను జూడఁబోనెంచి శకటవాహకునిఁ బిలిచి బండి యాయత్తపఱుపు మనెను.

తాను దల దువ్వుకొని, క్రొత్తచీరఁ దాల్చి, నగలు ధరించి, ముంగిట నిలిచిన శకట మారోహించి బయటికి వచ్చెను. ఆమె ప్రొద్దున నొక సేవకుని వీరభూపతిని నాఁటి రాత్రికిరమ్మని కబురంపినది. వాఁడు వచ్చి స్థానాపతి రాత్రికి వత్తునని చెప్పిరని వార్త తెచ్చినాఁడు. వానిని బంపించి మీనాక్షి బండిలోఁ గూర్చున్నది.

బండిలోఁ గూర్చున్న మీనాక్షి కన్నులలో వీరభూపతి యాడినాఁడు. ఎట్టినిమానిసి. శాంత మైన వదనము. ఎట్టి మొగమున నల్లని మీసముల చివరలు మెలికలు తిరిగి తామరమీఁదఁ దుమ్మెదలాడిన ట్లునికి. ఆజానుబాహువు. చక్కని కన్నులు. ఎప్పుడు నవ్వుచున్న మొగము. మీనాక్షి తాఁగప్పుకొన్న బంగరు పూవులు గల తెల్లని పట్టుసేలువ లోపల రెండుచేతుల ప్రక్కలకదుముకొని, కన్నులు మూసి కొని, బండిలో నొకవైపున కొదిగి కూర్చున్నది. రంయి మని

చల్లనిగాలి తెరలసందుగా లోనికి దూరినది. మీనాక్షి కన్నులు మఱింత మూసికొని, నక్కి-నక్కి మూలమూల కొదిఁగి యొదిఁగి కూర్చున్నది.

ఆ శకటము రాజదత్తము. ప్రధానాధికారులకుఁ బ్రతి వారికి రాజుగారి శకట మొకఁడు కానుక. అది యిది; బండికి నాల్గుచక్రములు. క్రొత్తరంగు. నందీశ్వరునివంటి రెండు వృషభములు బండికిఁ గట్టఁబడెను. బండివాఁడు బహుప్రయత్న మున వృషభముల నంకెకుఁ దెచ్చుచున్నాఁడు. బండికి నొగవద్ద సేనాపతి పేరున్నది. ఎద్దుల వీపులమీఁదఁ గప్పబడిన యొజ్జని పట్టుసెల్లాలమీఁద సేనాపతిపేరు వ్రాయఁబడియున్నది. ఎడ్ల కొమ్ములు కోసఁదేరి చివరల హొన్నుపొన్ను లమర్పఁబడి యున్నది. అద్దాలు, మువ్వలు; చిఱుగంటలు నమర్చిన వెండ్రుకల త్రాళ్ళ సికమారులు, మెడలకు గంటలపట్టెడలు, నాలుఁగు కాళ్ళకు వెండ్రుకలత్రాళ్ళుఁ బ్రకాశించు రెండువృష భములు దక్షయజ్ఞధ్వంసవేళ వీరభద్రుని వెన్నాఁడిన నందీశ్వర భృంగీశ్వరులవలె నురుసులు గ్రక్కు-చుండెను. పార్వతీదేవికి హిమవద్రాజు పంపించిన సారెవలె, మీనాక్షీదేవికిఁ బ్రతి సంవత్సరారంభ వేళాకృతకళ్యాణార్థపరిగుంఫితమంటపము వలె నాబండి వీధివెంట జరజర దొరలిపోయినది.

బండి సేతుపతిసౌధముముందాఁగినది. ఆఁగి నెమ్మదిగా నంతఃపుర ప్రదేశముకడకుఁ బోయినది. ఏకవీర గవాక్షము నుండి మీనాక్షినిఁజూచి మేడదిగివచ్చి యామెను గలసికొన్నది. మీనాక్షి యేకవీరను జూచినది.

ఏకవీర యానాఁడు తెల్లని పట్టుచీరధరించినది. శిరోజము

లభ్యంజన మాచరించినట్లు పొడిపొడిగా నున్నవి. ఆమె కనులలో నొక లోలత్వ మున్నది. అది లోలత్వమనుట కన్న మోహానత్వ మనిన బాగుండును. కంచుకముకూడ బంగరు పూవులుగల తెలిపట్టుది. అపు డామె తెలి మొగిలిపొరవలె నున్నది.

ఆనాఁడామెను మీనాక్షి చూచినంతనే పూర్వమామె నెప్పుడో చూచితి ననిపించినది. ఉలికిపడి మఱలఁ జూచినది. ఇంతలోఁ బరిచారిక తెచ్చిన మెట్టుసేలువ నేకవీర కప్పుకొన్నది. మీనాక్షికి మఱలఁ దన పరిచితురాలే కనుపించెను. ఏకవీర వివాహ మైనది మొదలు ఆకుపచ్చ చీరలు ధరించును. సర్వావయవములయందు నేడువారముల సొమ్ములు తాల్చును. వివాహోత్పూర్వము తెల్లని పట్టుచీరెలు తాల్చెడిది. తల యెప్పుడుఁ బొడిపొడిగా నుంచుకొనెడిది. వివాహానంతరమునఁ దెలిచీర తాల్చినది. కుట్టాన తన శయ్యమీఁద నామె నిద్రించినది చూచినరాత్రియే మొదటిసారి. అదిమొదలు కుట్టాన పెట్టిన గడువుమొదలు నెలనెల కమావాస్యనాఁడు తాల్చుచు వచ్చినది. గడువు రెండేండ్లు గడచినది. ఏకవీరకుఁ గుట్టాన మాటలయందు నమ్మకముపోయినది. మనసు క్రమక్రమముగాఁ దాను దొల్లి ప్రేమించిన యతనిమీఁదికిఁ దిరుగుచు వచ్చినది. అతనినిగూర్చి యూహాలు వచ్చినప్పు డెల్ల నేకవీర తెలియుడుపులు ధరించుచుండెను.

ఏకవీర కతనియూరు తెలియదు; అతనిపేరు తెలియదు. మఱి యేమి తెలియును? చంద్రసుకుమార మైన యతని మొగ మెఱుఁగును, అతని దీర్ఘాకృతి తెలియును,

అతని సూదులవంటి కనులు తెలియును. అతని తుమ్మెద రెక్కలవంటి మీసములు తెలియును. ముందుఁ బాయలుగాఁ దీసి వెనుక ముడికొదిగిన యతని కేశపింఛము తెలియును. తమ యిద్దఱనడుమఁ ద్రెంచరానిదిగా నున్న స్వచ్ఛప్రేమ బంధము తెలియును తన మొగములోని సౌందర్య మంతయు దాను దెల్లచీర ధరించి తల పొడిపొడిగా నుంచినప్పుడు పట్ట రానిదిగా నుండు ననికూడ నామెకుఁ దెలియును. వివాహమైన రెండు సంవత్సరములుగా నేకవీర యాతని మఱచిపోయినది. అతనిస్థానమునఁ గుట్టానునకు వసతి నిర్మించినది. కుట్టా నా వసతిలో నిలిచినాఁడు కాఁడు. తాను నిర్మించిన ప్రేమసౌధమునకు గుట్టాను తీసిన నిర్దయాద్వారమునుండి తన తొల్లిఁటి వలపు కాఁడు ప్రవేశించినమాట యేకవీర కవగతము కాలేదు; తన కిప్పుడు పెరిగిన తెల్లపట్టుచీరలమీఁద మక్కువ వెదకి చూచుకొనలేదు. తన తొల్లింటి ప్రేయోమూర్తి యామెకనులకుఁ గట్టినట్లుండెను. ఆమె యతని ప్రత్యక్షమైన మూర్తినిఁగూర్చి, దాని నిలుకడనుగూర్చి వితర్కించుకొన లేదు. అది యామెకు సర్వలోకములనుండి తాను గుప్తపఱచుకొన్న ధనము. ఆ ధనమునకు యాథార్థ్యము లేదని యామెకుఁ దెలియును. ధర్మమునకు సాధనము యాథార్థ్యమునకు దవ్వైనది. అందుచేత నామె ధర్మబద్ధయై యా ధనముమాట మఱచిపోయినది. ధర్మముతోడి ధనము నభిలషించినది. ఈ క్రొత్తధన మామెకు స్పర్శదూర మతిగమించినది. ఈ రెండుధనము లామె కయథార్థములైనవి. మొదలిధనము మధురప్రేమమయమైనది. రెండవ

ధనము ధర్మప్రేమమయ మైనది. తనకు దూరముౖలైన యీ రెంటిలో నేది మనస్సున నిల్పుటకు యోగ్యమైనదో ఆమెకుఁ దెలియ లేదు. తెలివికొలఁది రెండవ దానిని మనసున నామె నిలుపును. తనకుఁ దెలియకుండ మొదటిది తాను వచ్చి తన మన సావరించును. ఆ యావృతి యామెకుఁ దెలిసీతెలియన ట్లుంచును.

తన్నుఁజూచినంతనే మీనాక్షి యులికిపడిన దెందుకా యనుకొన్నది. ఏకవీర మఱలఁ దన సౌందర్యమునకు ముగ్ధురా లయిన దని సమాధానము చెప్పుకొన్నది. ఇంతలో నిద్దఱుఁ దొల్లింటి పరిచితలవలె మాటలాడుకొనిరి ఆ యులికిపాటు మీనాక్షి మఱచిపోయినది. ఏకవీరకు మఱపు రాలేదు.

ఇరువురును జాజిపందిరి క్రిందగా నేకవీరగదికిఁ బోవు చుండిరి. ఒక పసరుమొగ్గ యేకవీరపైఁ బడినది. ఒక పచ్చి యాకు మీనాక్షిపైఁ బడినది. పందిరి యంతయు వర్షము కొఱకు నెదురుచూచుచున్నట్లు చెదరుపూలు విసిరినది. వర్ష మును రమ్మన్నట్లు చిన్నగాలికి ఆకులు కదలుచున్నవి. పంది రిలోఁ జీకట్లు క్రమ్మినవి.

ఆకసమునఁ బడమటిదిక్కున బురదవలె వ్యాపించిన నల్లని పెద్దమేఘము నుద్ధ్రుతిచూచి బండివాఁడు వర్షాశంకి శకట మును దూరాననున్న శకటములు నిల్పు చావడికిఁ గొంచుఁ బోయి యెడ్ల తలత్రాళ్ళ చక్రములకు బిగించికట్టి సేతుపతుల శకటసారథుల పసిపిల్లలలో నెనిమిదేండ్ల బాలికతోఁ బ్రసంగములోనికి దిగెను. దానిపేరు అమృతము.

పిల్ల :—ఎవరు వచ్చినది ? బండివాడు ;—స్థానాపతిగారి అమ్మవారు.

పిల్ల పరికిణీ తొడపైకిలాగి జనపనార త్రాడు పేను చుండెను. ఆపిల్ల తలవెండ్రుకలు సంస్కారహీనములై రాగి బొచ్చువలె దాని మొగముమీఁద వ్రాలుచుండెను. త్రాఁడు పేనుచుండగా నాపిల్లకుఁ దొడ మంటపెట్టి యుమ్మితీసి తొడకు రాచుకొని బండివానివంకఁ జూచి యతఁడు తనవంకఁ జూచుట లేదని మఱలఁ దత్రాఁడు పేనుకొనుచుండెను. చల్లనియీాదురు గాలి యొకఁడువచ్చి యాపిల్ల తలమీాద నెండుతుంగగుబురు మీాఁదవలె యథేచ్ఛముగా విజృంభించెను. దాని కనులలోఁ జల్లగాలి చొఱఁబడి చిన్ని కన్నీటిబొట్లు తెచ్చెను.

బండివాఁడు :—కుట్టాన్ సేతుపతి మహారాజులుంగా రెపుడువత్తురు? పిల్ల :—ఎవరు? బండి :—బాబుగారు. పిల్ల :— బాబుగారా? (అని ఆఁగి) నాకుఁ దెలియదు.

చిన్నతుప్పర మొదలుపెట్టెను. అది పెద్ద వర్షమునకు మొదలని బండివాఁడనుకొనెను. పిల్ల లేచి చూరుదాకఁబోయి తనచేతులు వానలోఁ జాచి చేతులు తడిసిన తరువాత రెండు చేతులు మొగమున రాచుకొనెను. బండివానినిఁజూచి నవ్వెను. అంగడినుండి యేవో సరకులు కొనితెచ్చు సేవకుఁడు తడిసి పోదునని తొందగా నడచుచుండెను. తుప్పర పెద్ద దయ్యెను. గుఱ్ఱపుసాలలోఁ గట్టివేయబడిన గుఱ్ఱములు పెద్ద చినుకులు నేలపై నాకులపైఁబడి చేయు సవ్వడికిఁ గనులు పెద్దవిచేసి వెనుఁదిరిగి జూచెను. ఒక గుఱ్ఱము సకిలించెను. ఆ సకిలింపు నందిపుచ్చుకొని గుఱ్ఱము లన్నియు సకిలించెను, ఆరుబయట

నున్న తడియరాని వస్తువులను బరిచారికలు లోనికిఁ దీసికొని పోవుచుండిరి.

ఇరువురుగలసి లోనికిఁ బోవులోపుగా నేకవీర సేలు వంచు తడిసినది. ఇరువురును గదిలో పట్టుపఱుపులపైఁ గూర్చుండిరి. ఒక పరిచారిక వచ్చి యేకవీరపై సేలువ తీసి దులిపి దూరమున గాలి కారఁబెట్టెను. ఇంకొకదాసి మఱల నింకొక సేలువ తెచ్చులోపల మీనాక్షి చకితయయ్యెను, ఎక్కడనా యీమెను జూచితినని. ఆమె పోల్చుకొనలేక పోయెను. మీనాక్షి యాకదలిక యేకవీరకుఁదెలియకపోలేదు. ఆ కదలిక కేకవీర చెప్పుకొన్న యర్థము వేఱు.

మీనాక్షి గార్హస్థ్యవృత్తాంత మేకవీరకుఁ దెలియదు. ఏకవీరసంగతి మీనాక్షికిఁ దెలియును. మీనాక్షికిఁ దెలియునని యేకవీరకుఁ దెలియదు. ఏకవీర యూహలోఁ దమప్రేమల గూర్చినంతవరకు నొకరిసంగతి నొకరు తెలియరాని గూఢతఁ జేసి గౌరవమునందు సమానప్రతిపత్తి కలదని విశ్వాసము. మీనాక్షికి స్థానాపతికి గాఢప్రేమను కాబోలును, లేకున్న మీనాక్షి కింతయుత్సాహ మెక్కడిదని యేకవీర. మీనాక్షి యూహలో నేకవీరరహస్యముఁ దనకుఁదెలిసి యునికి నసమాన ప్రతిపత్తి. ఆమె రహస్యము తనకుఁ దెలిసియుంటఁజేసి యేకవీర యనిన నొకవిధమైన లోఁకువ. ఆ లోఁకువతనములో నగౌరవ మీషత్తునులేదు. ఆ రహస్యము తెలిసిన మీనాక్షికి నేకవీరతోఁ జనవు సహజముగాఁ బుట్టినది. ఈ సంగతి తెలియని యేకవీర కా చనువుభాగ మవగతము కాలేదు.

స్త్రీలు సామాన్యముగాఁ గలిసికొన్నపుడు తమ భోగ

ములనుగూర్చి వారికి దెలియఁజేయుట యలవాటు. దొడ్లు, త్రోవలు, పడకగది, జవాహిరీ యితరస్త్రీలకుఁ జూపించి వారి దృష్టిలోఁ దాము గౌరవము సంపాదించుకొనుట స్త్రీలకు సహజము. ఆసంగతిఁ దెలిసికొన ప్రయత్నించుట నూతనలకు సహజము. ఇన్నినా ళ్లేకవీరామీనాక్షులు కలిసికొనినను మీనాక్షి యీ ప్రసంగము తెచ్చినది కాదు. ఏకవీర కను మానము. తమ వైముఖ్యము స్థానాపతికి దెలియు నని కుట్టాన్ తనకుఁ జెప్పినాఁడు. స్థానాపతి భార్యతోఁ జెప్పియుండవచ్చును. ఇది యేకవీరకు మనస్సులో నొక కష్టశల్యము.

ఆనాఁ డేకవీర మీనాక్షిని దీసికొనిపోయి, యిల్లంతయుఁ జూపించెను. ఆమహాసౌధముననున్న శిల్పమునకు, వైశాల్యమునకు, భాగ్యమునకు మీనాక్షి తల తిరిగిపోయెను. చివరకుఁ బడకగది చూపించెను. ఆ యెత్తయిన మంచము, ఆమంచమునందలి పనితనము, గోడలలోనున్న దేవతావిగ్రహములు : మీనాక్షి కది యొకస్వర్గ మనిపించినది. ఇరువురును మెట్లమీఁదుగాఁ బెద్దమంచముపై కెక్కి దానిమీఁదఁ గూర్చున్నారు. బయట జాజిపందిరిమీఁదఁ జినుకులు పటపటధ్వనులు చేయుచుండెను. చల్లనిగాలి గవాక్షముగుండ గదిలోనికి బొంయి మని పోసికొన్నది. ఇద్దఱ సేలువలు తొలగిపోయినవి. వారు మఱల సర్దుకొనలేదు. మీనాక్షి మనస్సులో నొక వర్షాకాలగాఢనీలావిలశర్వరీమధ్యవేళాగగనభాగపరివ్యాప్త కాలమేఘగర్భభేదియైన సౌదామని మెఱసి మఱల గాఢాంధకారములు క్రమ్మివైచెను. పరిశోధితమైన యొక

పాపవాంఛాస్మృతి యామె మనసు లోతులలో సంగత మయ్యెను. లోని మాధుర్యానుభవము ధర్మభీతి నంకురించ నీయలేదు. ఏకవీర పయ్యెద తొలఁగెను. నేత్రము లర్ధనిమీలితము లాయెను. వాన జోరు మని కురియుచున్నది. వంతెన క్రింది తూములనుండి నిండుకాలువ నీరు పడఁబోసికొన్నట్లు మఱల నీరురుగాలి గదిలోనికిఁ బోసికొన్నది. మంచముపైని దుప్పటి లేచి వారి యిరువురపైఁబడ్డది. ఆ గాలిచలికాఁగలేక యేకవీర తన సేలువ తీసి కప్పుకొని లోని తనదేహము ముడుచుకొన్నది. ఆ గాలిచలి కొడలు పులకించి మీనాక్షి కంచెలమునుండి సడలినిచ్చి యెదుట్రొమ్మున వానచినుకులు పడి రెండుచేతులు చాఁచి చల్లనిగాలిని గౌఁగిలించుకొన్నట్లు చేతు లెద నదుముకొన్నది.

కొంతసేపటికి వాన వెలిసినది. బండివాఁడు శకటము తెచ్చినాఁడు. మీనాక్షివచ్చి శకట మధిరోహించెను. బండి తరలిపోయెను. బండిలోఁ బోవుచున్న మీనాక్షికన్నులు నేకవీరకన్నులుఁ గలసినవి. అదే వీడుకోలు. వచ్చినది మొదలు వెళ్ళువరకు మీనాక్షికి నేకవీరకు నొకమాటయైన జరగలేదు. ఏకవీరకు విచిత్రమైనది. సేతుపతులసౌధము దాఁటిపోవుచున్న మీనాక్షికిఁ జెరసాలనుండి బయటఁ బడ్డట్లయినది; ఆమె పెద్ద యూపిరి తీసికొన్నది. వానచేత రాచబాట యంతయుఁ దడిసినది. దారిప్రక్క నీళ్ళు నిలచినవి. ఇంతవాన కురిసిన దని మీనాక్షికిఁ దెలియనేలేదు.

వర్షర్తువు సకల ముఖముల విజృంభించినది. గగన కూటపు టెల్లలయందు గుంపులు గుంపులై మవ్వపుశంపల

వంపులు సొగసుచాళ్ళు హరించినవి. మొగిళ్ళు అంపిలి నల్దెసల మెరసినవి. ఆకాశమునందు దూరమునుండి రివ్వుమన్న సవ్వడి వరుసకట్టిన బలాకముల ఱెక్కలదో, పరుగెత్తుకొనివచ్చు వానజల్లుదో తెలియుట లేదు. భూతమాంత్రికునిచేత బలాత్సమాహూతమైన యొకశక్తి వాయువీధికల ఛేదించుకొని వచ్చినట్లు, వాయువ్వలు పెల్లుఱేగి మహాధ్వానముతో విజృంభించినట్లు, నిశ్శబ్దనిశావేళఁ దుపాను రేఁగిన సముద్రపు హోరు వినవచ్చినట్లు దూరమునుండి వానజల్లుల మ్రోఁత వినవచ్చి జనులు వెనుఁదిరిగి చూచుచుండిరి. వడగళ్ళకై వెదకులాడి యొక చప్పని వడగల్లు నోటవైచుకొని పిల్లలు తమకుఁ దగిలిన దెబ్బలు మఱచిపోవుచుండిరి.

అందందుఁ జిన్నపడెలు పడెలుగా నైన వానసీళ్ళలో గోరంకలు దంపతియుక్తముగాఁ గీఁచు కీఁచుమని ఱెక్కలు తడుపుకొనుచుండెను శిశిరచంద్రజ్యోత్స్న కలహాంతరితవోలె జలదాంతరిత గూఢబాష్పయై విముఖకా, మొగలిపొట్టలలో నీరు నిలచి ఖండితాసజలదీర్ఘసితాపాంగభ్రాంతిఁ గల్పింప, రాజహంసి భీతయై ప్రోషితభర్తృకవలె తామరతీఁగగొడుగాకుక్రిందఁ దలదాచుకోఁగా, నెమ్మి పురివిప్పి స్వాధీనపతికవలె నృత్యాభిరామమూర్తికా, మందారపూవును వదలి రాలేక రాలేక వచ్చిన తుమ్మెదమొడ నెఱ్ఱగన్నేరు ఈర్ష్యాకషాయితకా, వాసకసజ్జికవోలె నలంకరించుకొని కడిమి మేఘనాథునకు స్వాగతముపూన, బలాకాపాంగ మేఘనీలపటపరివృత యాకాశలక్ష్మి కాలపురుషుని నభిసరించ, విప్రలబ్ధాకృశీభూతదేహయష్టివలెఁ బోకమ్రానుపై మొవ్వులోని యాకులవెంటఁ గన్నీరుగార్చ, వర్షాశ్రీ సర్వర్తుసాకృతి

వలె మోహనాతిమోహన మయ్యెను. నాగలి నఱ్ఱున లాగుచున్న పొలముకాపువలె దున్నుచుండి తన మొగమున నిలచిన వాననీరు తలకదల్చి విదల్చుకొనుచుండెను. పెద్దచినుకు, రాయి పెట్టి కొట్టినట్లు పడగమీద విసరుకొనఁగా బుస్సుమని యెగిరి కోడెత్రాఁచులు గాలి కబళము ప్రక్కవాటుగాఁగొంకి దున్నిన మెట్టచాలుల వెంట పొలము కోరడివెంటఁ గంచెలలోని పుట్ట లకుఁ బరువులెత్తెను. ప్రాచిపట్టిన పెద్దపొలముబావుల నీటిమట్టపు కొండరాళ్ళు వెలికివచ్చి ప్రక్కదారులఁ బడియున్నట్లు బావురు కప్పలు వర్షాలక్ష్మి లంబాడియువతివేషమువేసి కాలధరించిన నత్తగుల్లల గొలుసుల బొణుగురురవమువలె రాత్రిందివము లోకటే యఱపు లఱచినవి. వాన వెలిసి క్రిందబురద; పైని తూనీఁగలాడుట, గాలి లేమి, సాయంసమయములందుఁ బొలము కాపులకు కిచాట్లై పోయినది.

౧౯

ఆ సంవత్సరమున శ్రావణశుద్ధముననే వర్షములు విజృంభించినవి. కాళయ్యార్ కోవెలలో నుదయన్ సేతుపతి కోటకట్టి కొంత సైన్య మచటఁ గాపుంచెను హఠాత్తుగా నుదయన్ సేతుపతి వెళ్ళిపోవుటయుఁ గుట్టన్ సేతుపతి వచ్చుటయు, సూచనగా రాజు వ్యాధి, యాయన మృతి రామనాథమున వార్తగాఁ బొక్కివ్యాపించెను. కుట్టన్ కుఱ్ఱవాఁడు, అతనిప్రతాపమెఱుఁగని కాళయ్యార్ కోవెలలోని దోపిడిగుంపులకు అతఁడన్న భయము లేకపోయినది. చెదరిపోయిన గుంపులను జేరదీసికొని యొకనాఁటిరాత్రి హఠాత్తుగఁ బోర్చునీసువాఁడొకడు నాయకుఁడుగాఁగాళయ్యార్ కోవెలదుర్గముముట్టడింపఁబడెను, లోనరెంకు

వందలసైన్యము మాత్రమే యున్నది. వారే కోటతలుపులు మూసి యుద్ధమిచ్చిరి. రెండువందలమంది మధురరాజసైనికులు నిరాయుధులై బయటనుండిపోయిరి. ఈ వార్త కుట్టానునకు మఱునాఁడు ప్రొద్దునఁ దెలిసెను. ఆవరకే దుర్గము శత్రువులకు స్వాధీనమైయుండునని వార్తావహులు వచ్చిరి. కుట్టాన్ మాటాడ లేదు. మఱలమఱల రాయబారులచేత నడుగఁబడి కుట్టాన్ తానప్పుడు రామనాథమువదలి వచ్చుటకు వీలు లేదనియుఁ దాను వచ్చినచో రామనాథములో నల్లరులు పేటురేఁగ వచ్చుననియుఁ జెప్పి వారినిఁ బంపించెను. రాయబారులు విషణ్ణవదనులై వెడలిపోయిరి. ఈ వార్త రామనాథమున వ్యాపించెను. కాళ్ళయ్యార్ కోవెలకును వ్యాపించెను. కాని రామనాథమునఁ బట్టమంగళమున దుర్గములు యుద్ధమునకు సిద్ధము చేయఁబడుచుండెను. రాజసైనికు లాయుధములు పదును బెట్టుకొనుచుఁ గోటలోనికి సాధనసామగ్రి నింపుకొనుచు ముట్టడి కెదురుచూచు చున్నట్లు తోఁచిరి. అందఱును గాళయ్యార్ కోవెలశత్రుహస్తగతమైనదనుకొనిరి. లోని సైనికులు నిరాశులైరి. వారిలోఁ గొందఱు కోట శత్రువులకు స్వాధీనము చేయుదమని మరికొందరు వద్దని వాదపడిరి. కోట వెలుపల నాలుగువందలమంది ప్రజలు. కత్తులు కటారులు తుపాకులు నున్నవిగాని వారికి గుఱ్ఱములు, నేనుఁగులు, ఫిరంగులు లేవు.

మూఁడవనాటి సాయంతనమున ముట్టడి. ప్రజలు కోట తలుపులవద్ద ద్వారభేదనప్రయత్నములు చేయఁజొచ్చిరి. వారం దఱిలో నొకయువకుడు మిగుల నుత్సాహము చూపుచుం డెను. అతఁడు సులభముగాఁ దక్కినవారిహృదయ మాకర్షించెను.

గడ్డపలుగులతో ఛేదించి పెద్దదూలములను ద్వారముల కానించి రెండువందలమంది పూనినట్టి తలుపులు ఛేదించ వీలులేక చివరకు నొక యుపాయ మా యువకునికిఁ దట్టెను. తలుపు క్రిందఁ జిన్న గొయ్యిగాఁ ద్రవ్వి తమవద్దనున్న తుపాకిమందు దానిలోఁ గూరి యగ్ని ముట్టించవలెనని. అందరును సంతోషించిరి. గుంపులో నున్న పోర్చుగీసువారు కూడ శ్లాఘించిరి. ఈ ప్రయత్నములు లోపలివారికిఁ దెలిసెను. వారిలో వారు క్రిందమీఁదఁబడి తలుపులు తెఱచుటకు నిశ్చయించుకొనిరి. ఆ వార్త బయటనున్న వారికిఁ దెలియఁజేసిరి. జయజయధ్వానములు పిక్కటిల్లిపోయెను. కాని తలుపులు తెరవఁబడకపూర్వము కొన్ని షరతులకు వారంగీకరింపవలెను. కోట కధికారి హిందువుఁడే యైయుండవలెను. లోపలనున్న సైనికులుకూడఁ గలిసెదరు. వారినిఁగూడ ముట్టడి వారిలోఁ జేర్చుకోవలెను. కొంతవిచారణమైన తరువాత నీ షరతుకు ముట్టడివారిలోని పోర్చుగీసులు కూడ నొప్పుకొనిరి. సంధ్యారాగము కృశించి చీఁకట్లలముకొనువేళ కోటతలుపులు తెఱచిరి. లోని వెలి సైనికులు మొదట బెరుకుతోఁ దరువాతఁ జిరునవ్వుతో మఱికొంత సేపటికిఁ గొంత చనవుతోఁగలసికొనిరి. ఇరుపక్షములవారును బెద్ద కాగడాల వెలుతురున సభ చేసిరి. కోట యెవరి యొద్దికలో నుండవలెననియు, మఱల రాజసైన్యమువచ్చి ముట్టడివేసినచోఁ గోట నెట్లు రక్షించవలెననియు ప్రశ్నలు బయలుదేరెను. కోట ముట్టడివేళ నుత్సాహము నెఱపిన యువకుఁడు కోటకు నాయకునిఁ దీర్మానించినచో నతఁడే తక్కిన సంగతులు విచారించుకొను నని చెప్పగా నందఱును సంతసించిరి, పోర్చుగీసుల ప్రాముఖ్యము మనస్కరించలేదు.

కాని వారి సంఖ్య ముప్పదికి మించిలేదు; అందుచే వారు వంగీకరింపక తప్పినదికాదు. సర్వజనీనముగా నాయువకుఁడే కోటకధికారిగా నెన్నుకొనఁ బడెను.

అతఁడు మఱునాఁడు కందకము బాగుచేయించెను. క్రొత్తగా నీరు పెట్టించెను. కోటగోడ సడలినచోట బాగుచేయించెను. ముట్టడివేళ బయట మిగిలిపోయిన రాజసైనికులకు గబురంపి వారినిఁగూడ రప్పించి యందఱను గలియనిచ్చెను. ఊరిలోనున్న వారిలోనెవరైన దండులోఁ జేరెడివారుండిరేమో యని వెదకింపగా నుత్సాహముకొలఁది రెండువందలమందివచ్చి చేరిరి. సైన్యము వెయ్యిమంది యయినది. వెయ్యిమంది సైన్యమును బదిభాగములుగాఁ జేసి కోటలోనున్న రాజసైన్యములో వారిని ఆరితేరిన వృద్ధులను తొమ్మండుగురను, దానును బది భాగముల కధికారులనుగా నిర్ణయించెను. పోర్చుగీసువారిని ముప్పదిమంది నొకభాగములోనుంచి తక్కిన సైన్యమునుండి యా భాగములో నుండుట గౌరవ మనుకొన్నవారి నందఱను దెప్పించి యాభాగములోఁ జేర్చెను. ఈ భాగమునకుఁ దానే నాయకుఁడు. తాను వారిని మిక్కిలి పొగడి కోటయొద్దడివేళ వారే సహాయపడవలెనని యుద్బోధించి తక్కిన తొమ్మిది వందలమందినిఁ గోటకు నాల్గువైపుల నాల్గురెండువందల నునిచి వందమందిని తనకు ననుచరులుగా నేర్పఱచుకొని యా పోర్చుగీసు భాగమునకుఁ బని నేరుపఱుపక వదలెను. కోటకు మిక్కిలి యపాయము వేళఁగాని వారినిఁగదల్పరాదని చెప్పెను. వారును బ్రమత్తులై యథేచ్ఛముగా నూరివెంటఁ దిరుగుచుఁ గోటకు వచ్చుచుఁ బోవుచుండిరి. రెండుమూనాళ్లయిన తరువాత

నాయకుఁడు వారిని గ్రామములోనికిఁ బోవునపు డాయుధములను గోటలోననే వదలిపోవలెనని యాజ్ఞయిచ్చెను. వారు ప్రమత్తులై త్రాగియా రెండునాళ్ళుగా గ్రామములోఁ జేసిన యల్లరుల మూలముగా నీయాజ్ఞ సైన్యమంతకు సమంజసముగానే కనంబడెను. ఒకనాటిరాత్రి పోర్చుగీసు సైన్యభాగము కోటలోనికి రాలేదు. రాతిరి కోటతలుపులు వేయఁబడెను. వారు వెళ్ళిపోవునపుడు వా రాయుధములు కోటలో వదలియే పోయిరి. ఆ రాత్రి నాయకుఁడు సభచేసి వా రా రాత్రి కోటకు రాకపోవుట దోషమని నిరూపించి నెమ్మది నెమ్మదిగా వారు గర్వము గల వారని, పోర్చుగీసువారిని నమ్మరాదని, వారినిఁ బాను బాగడెన పొగడ్త యబద్ధమని, వారెవ్వరునుగాని తక్కిన వానికన్న పెద్ద యుద్ధనిపుణు లేమి కాదని, సైన్యముమనస్సు వారియెడల విముఖముగాఁ జేసెను. రాజసైన్యముమీఁదఁ దిరుగుబాటు చేసిన ముట్టడినాయకులనందఱను నాయకుడా భాగములోనికిఁ దీసెను. నాయకుఁడు వారిని గూర్చి చెప్పుచు వారే ముట్టడికి ప్రధానులని మొన్న రాజసైన్యముమీఁద దిరుగఁబడిరి, రేపుతమమీఁదఁ దిరుగబడెద'రని చెప్పెను. సైన్యములో నెక్కువభాగము వారి యెడల విముఖతఁ దాల్చెను. ఆ పెద్దసభను వదలి నాయకుఁడు సైన్యభాగముల నాయకులను బిల్చి ప్రత్యేకసభ చేసెను. వారు తొమ్మండుగురు రాజసైన్యములోని నమ్మికబంట్లని నాయకునకుఁ దెలియును. అందుచేత నాయకుఁడు వారితో నిట్లనెను. "రేపు ఉదయమున సేతుపతి ఫిరంగులను దెచ్చును. పదివేల సైన్యమైనను దెచ్చును. రాజసైన్యము ముందు మనము నిలువలేము. మనము పోర్చుగీసులను సహాయము పిలువవలెను. లేదా

రాజునకు లొంగవలెను. ఇందు మీకేది యిష్టము?'' పదిమంది యు నొకరి మొగము లొకరు చూచుకొన్నారు. నాయకుఁడు మఱల నన్నాఁడు: 'మీరీ సంగతి పోయి మీ సైన్యములతో సంప్రతించి జేపు నాకు సలహానిండు. నేను జేపుదయమున బోర్చుగీసు సైన్యభాగముతో నొక సాహసకార్యమునకుఁబోవుచున్నాను. ఎల్లుండి సాయంకాలమున కిందుండెదను. ఈలోపుగాఁ గోట వీరయ్యప్పనాయకుని క్రింద నుండును.'

వీరయ్యప్పనాయకుఁడు తెలుఁగుకాపు మధుర రాజుల క్రిందఁ బేరుమోసిన జోదు. ఏఁబదియేండ్లు దాటినవాఁడు. కోట యిట్లు దోపిడీకాండ్ర వశమగుటకు దుఃఖించుచున్నవాఁడు.

మఱునాఁడు పోర్చుగీసు సైన్యభాగము ప్రొద్దుననే కోట లోనికి వచ్చెను. వచ్చిన దాలస్యముగ నాజ్ఞమీద సాయుధమై నాయకుఁడు ముందుగా గుఱ్ఱములమీఁదఁ గోటనుండి వెడలి పోయెను. వెనుక తలుపులు కిఱ్ఱుమనుధ్వనితో మూయఁబడెను. నాయకునకు ముప్పదియేండ్లలోపు. నల్లనివాఁడు. కొంచెము పొట్టివాఁడు. విశాలములైన నేత్రములు. మీసములు నల్లగాఁ దుమ్మెద ఱెక్కలవలె నుండును. శరీర మాయసస్తంభమువలె నున్నది. అతని సేనానాయకలక్షణములును, గుఱ్ఱముమీఁదఁ బోవు నతనిలాఘవమును జూచి వెనుకనుండి సైన్యము కోట గోడలమీఁదిది, అతని వెనుకనే వచ్చునది యతని యెడల భయభక్తులు పెంచుకొన్నది.

వింట విడిచిన శరమువలె సైన్యము రెండు జాముల వఱకు స్వారిచేసెను. నాయకునియాజ్ఞ నొకచోట దిగి వారు గడియపాటు విశ్రాంతి తీసికొనిరి. వెంట తెచ్చుకొనిన యాహార

మును భుజించిరి. మఱల గుఱ్ఱములెక్కి యెక్కువవేగముతోఁ బోయిరి. సైన్యభాగమున నున్న దేశీయుల కందఱకు వారు రామనాథమును సమీపించుచున్నారని తెలియును. వారు తమ నాయకునియెడల నాశ్చర్యము పొందుచుండిరి. అతని సాహస మునకు నివ్వెఱపోవుచుండిరి. ఆనందపడుచుండిరి. అతని సాహస ములో నాయకుఁడు తమయెడల నెంతో యాశపెట్టుకొన్నాఁ డన్నందువలనఁ గలిగిన గర్వము నున్నది. ప్రొద్దుగ్రుంకఁబోవు వేళకు రామనాథము చేరిరి.

నాయకుఁ డూరిబయట సైన్యభాగము నాపి యిట్లు చెప్పెను. "ఇది రామనాథము. రామనాథ దుర్గవృత్తాంత మంతయు నాకుఁదెలియును. ఇప్పు డొక మహాసాహసము చేయు చున్నాను. మీరందఱు రామనాథసైన్యపుదుస్తులలో నున్నారు. మీ కేమియు గుర్తుపడిపోవుదుమన్న భయము లేదు. ఈకార్యము నెగ్గెనా మీయశస్సు దిక్కుల నిండగలదు" అని పోర్చుగీసు సైనికుల ముప్పదిమందిని ఒకభాగముగాఁ దక్కిన డెబ్బది మందిని ఏడుపదులుగాఁ జేసి మూఁడుపదులు తనతో రమ్మని తక్కిన నాలుగుపదులు కోటనాలుగుదిక్కుల నున్న ద్వార ములకడకుఁబోయి రాతిరి రెండుజాములవఱకు వేచియుండుఁ డనెను. ఆనాల్గుపదులును విడివడిపోయెను. రివ్వున నలువదిమంది సైనికులతో నాయకుఁడు కోటవద్దకుఁబోయెను. దుర్గద్వారము తీసియున్నది. నిరభ్యంతరముగ లోనఁ బ్రవేశించెను. ప్రవేశించి నంతనే కోటతలుపులు మూయఁబడెను. నాయకుఁడు రాజ సౌధమువద్దకు శరవేగమునఁ బోయెను. రాజసౌధముముందు విశాలమైన ప్రదేశమున వేయిమంది యశ్వసైనికులు కవాతు

చేయుచుండిరి. నాయకునిఁ జూచినవెంటనే సైన్య మంతయు జోహారుచేసెను. సేనానాయకుఁడు గుఱ్ఱమును నాయకునివద్దకుఁ దెచ్చి వంగి నమస్కారముచేసి 'స్వామీ! యేమి యాజ్ఞ!' అనెను. నాయకుఁడు నవ్వి 'సుందరేశ్వరనాయకుఁడా! మీకుఁ బోర్చుగీసుబంటులు కావలయునేని యీముప్పదిమందిని మీరు సైన్యమునఁ జేర్చుకొనవచ్చును. తక్కిన ముప్పదిమంది కాల్బలము. వారికి శిక్ష చాలదు. గోవిందనాథుఁడుగారికిఁ జెప్పి వారినిఁ బదాతులలోఁ జేర్చుకొనుఁడని చెప్పుఁడు' అనెను, వెంటవచ్చిన యఱువదిమంది మొగములు వెలవెలఁబోయినవి. అందఱును గుఱ్ఱములు దిగుటకు వెంటనే యాజ్ఞాపింపఁబడిరి. వెయ్యిమంది యాశ్వికదళము నెదురుగాఁ జూచుచు వా రేమి చేయుదురు? గుఱ్ఱములు దిగిరి. కొత్వాలు వారి పేరులు నమోజు చేసికొనెను. ఆరాత్రి నాల్గుద్వారములవద్దఁ గాచిన నలుబదుండ్రుడు సౌజన్యముగా నాయకుని ప్రత్యేకదర్శనము పొంది రామనాథసైన్య దళములోఁ జేరిరి. ఆ నూరుగురు నీ విచిత్రమైన వంచనకు ముగ్ధులైపోయిరి. పరవశులైరి. భీతిఁగొనిరి. కొందఱు కోపగించిరి. వారికోపములు చుట్టుననున్న వేలకొలది సైన్యముఁ జూచినంత రంగువేసిన గుడ్డతోఁ జేసిన గులాబిపూవుల రంగువలె జారిపోయినవి. వారిలోఁ గొందఱకు నాయకుఁ డెవరో తెలిసినదికాదు. అందులో నొకనికి రాజ్యసైన్యమున నెఱిఁగిన వాఁడొకఁడుండెను. వానితో రహస్యముగ 'నాయన యెవరు' అని యడిగెను. అతఁ డాశ్చర్యపోయి, 'నీ వెఱుఁగవా? కుట్టాన్ సేతుపతి మహారాజగారు, ఉదయన్ సేతుపతి మహారాజుగారి కుమారుఁడు' అనెను. వానికిఁ జేయి గుండెలోపలకుఁ బోనిచ్చి

గ్రుద్దినట్లయ్యెను. రాత్రి తెల్లవారు లా నూఱుగురకు నిద్దుర పట్టలేదు. వారితోఁబాటు మఱి నూఱుగురకుఁ బట్టలేదు.

కడచిన మూఁడునాలుగుదినములుగా మబ్బుపట్టినయాకాశము మఱునాఁ డెండకాచినది. కాళయ్యార్ కోవెలలో నున్న నాలుగువందల రాజసైన్యములో నున్నవారికి బంధువులు, స్నేహితులు రామనాథసైన్యమునుండి రెండువందలమందియేరఁబఱిగి. వారితోఁగుస్తాన్ సేతుపతి కాళయ్యార్కోవెలకు నాఁటి సాయంకాలము ప్రయాణమై యామఱునాఁడు సాయంకాలమునకు నెమ్మదిగాఁ గాళయ్యార్కోవెల చేరెను నాయకుఁడిబ్బడి సైనికులతో వచ్చుటచూచి కోటతలుపులు సంతోషముగాఁ దెఱువఁబడెను.

స్నేహితులు స్నేహితులు కౌఁగిలించుకొనిరి. బంధువులు బంధువులు చనవుకొలది యోగక్షేమము లడుగుకొనిరి. క్రొత్తవారందరు రామనాథసైనికులని క్రొత్తవారిలో నాలుఁగు వందలమందికిఁ బైగాఁ దెలియును. ఈ విచిత్రసంయోగము నిగూఢార్థవంతమైపోయెను. అంతలో సైన్యమంతయు సమావేశము కావలెనన్న పిలుపు హాజారపుగంటలు పిలిపించెను. పదునొకండువందలసైన్యమా చిన్నికోటలోని బయలునఁ గిక్కిరిసి పోయెను. నాయకుఁడు సైన్యము నిట్లు సంబోధించెను; 'నా వెంట రామనాథసైన్యము వచ్చుటను మీ రాశ్చర్యపోవుచుండిరి. ఇచటినుండి పోయిన నూర్గురు సైనికులు రామనాథసైన్యములోఁ జేరి నిన్ననే మొదటినెల జీతము ముందుఁగాఁ బుచ్చుకొనిరని మీకుఁ దెలిసినచో మీరు మఱియు నాశ్చర్యపడెదరు. మీసంశయము తీరుట కొక కథ చెప్పెదను. ఉదయన్

## ౨౦

ఉదయన్ సేతుపతి మధురలోఁ బట్టాభిషేకోత్సవములు పూర్తియైనతరువాత భాద్రపదశుక్ల పాడ్యమినాఁడు బయలుదేరి పంచమినాఁటికి రామనాథమునకు వచ్చెదనని తన కొడుకునకుఁ గబురంపెను. కాళయ్యార్ కోవెల తిరుగుబాటును గూర్చి కుట్టాన్ తండ్రికి వర్తమానమంపెను. సేతుపతి కోవెల తిరుగు బాటు రాజుతోఁ జెప్పెను. రాజు సేతుపతిని బొమ్మని తొందర పెట్టెను. తిరుమలనాయకుఁడు 'కుట్టానున్నాఁడు ఫరవాలే'దని పట్టాభిషేకోత్సవము లైనతరువాతనే సేతుపతి పోవచ్చు నన్నాఁడు. ఉదయన్ సేతుపతికిఁ దొందర యెక్కు-వైనది. చిత్ర ముగాఁ దాను బూర్వము రాజుమాట తీసివేయఁజాలనట్లు తిరు మలనాయకునిమాట కాదనఁజాలమి నెఱింగికొని యుదయన్ సేతుపతి యాశ్చర్యపోయెను. అదిమొదలు తిరుమలనాయకుని దాను గలసికొనినప్పుడెల్ల నతనినిఁ బైనుండి క్రిందకుఁదిగ బాఱఁ జూచెడివాఁడు.

నాఁడు శ్రావణ బహుళదశమి. వర్షము జోరుమని కురియుచున్నది. కుట్టాన్ రామనాథమున రాజసౌధముపైఁ గూర్చున్నాఁడు. కాళయ్యార్ కోవెలగెలుపువలన నతనిమనస్సు మహానందమున మునిఁగియుండెను. కాని యతని మనస్సులో నొకశంకకూడ నుండెను. క్రొత్తగా నైదువందలమంది సైన్యము జేర్చుటకుఁ దన కేమి యధికార మున్నది? తండ్రి కోప గించును. అట్లు చేర్చుకొనకపోయినచో మఱలఁ దాను అల్లరుల కవకాశమేర్పఱచినవాఁడ నగుదునని కుట్టాను తలంచెను. తృప్తి లేని యైదూరువందలమందిని వదలినచో నొకపెద్ద శత్రుసైన్య

మును లేపి వదలిపెట్టిన ట్లగును. అట్లువదలినచోఁ దాను జేసిన వంచనకు వారిలోఁ బ్రత్యపకృతిబీజమును నాటినవాఁడగును. అందుచేత వారిని సైన్యములోనికిఁ దీసికొనక తప్పినది కాదు.

జరిగిన వ్యవహారమంతయుఁ గుట్టాను లేఖ వ్రాసి రాజుగారికిని, దండ్రికిని బంపించెను. ఒకవేళ రాజీక్రొత్తసైన్యము నంగీకరించనియెడలఁ దానేమిచేయవలెను? దూరమున నాకసములో నొకమెఱుపు మెఱసెను. కుట్టానుక కేకవీర కనులకుఁ గట్టినట్లు కనిపించెను. కట్టతెంచిన బోదె నీరు పొలములోనికిఁ బోసికొన్నట్లు వాని మనస్సు జలజల ప్రవహించి యేకవీర తనయున్నాళ్ళ పొందికలేని జీవనము, మీనాక్షీవీరభూపతుల వివాహము, తన మనఃపరివర్తనము, తన మనస్సులో నేకవీర తాల్చిన ప్రణయరూపము, ఆమెను దాను జూడరాని రాచకార్యముల యభ్యంతరము నూహపై నూహగా నతనిని గ్రమ్ముకొనెను.

రెండుసంవత్సరములనుండియుఁ దనమామగారు రాలేదు. కూతును జూడలేదు. తనకుఁ దన మామగారికిఁ బూర్వమేమియు సంబంధములేదు. మామగారు సైన్యము దాను దీసికొనునేమో! ఆయన మంచి సరదారు.

ఏకవీర మొదటిసారి తలంటిపోసికొని తన మంచముమీఁదఁ దెల్లనిచీరఁదాల్చి నిద్దురవోయిన – పెండ్లియయిన తరువాత మూఁడునెలలనాటి కథ స్మృతికివచ్చెను. మెఱపు తటాలున మెఱసెను. కుట్టానునకుఁ దెల్లచీరదాల్చిన యేకవీరను జూచినట్లయ్యెను. ఏకవీర తనకు భార్య యగుటచేత దన సుముఖతయే యభ్యంతర మగుటచేత నిరభ్యంతరముగా మన

సులోఁ గుట్టాన్ ఏకవీరను గాఁగిలించుకొనెను. ఆమె భుజములు, కంఠము, నేత్రములు ముద్దులతో నింపెను. ఆమె రహో విస్రబ్ధయై యతనియెదుఱొమ్ముపై విశ్రమించెను. అప్పుడు తమ గుఱ్ఱపువాళ్ళపిల్ల అమృతము తొంగిచూచెను. కుట్టానునకు నవ్వువచ్చెను.

మజిల సైన్యముమాట తోఁచెను. తండ్రి కోపగించెను మామగారు తాను భరించలేననెను. తానే స్వంతముగా సైన్యమును బోషించుచుండెను.

ఇంతలో వీరభూపతి స్మృతికిఁ దగిలినాఁడు. మీనాక్షీ వీరభూపతులు సుఖముగాఁ గాపురము చేయుచుండిరి. తాను వారింటికి మజిల భోజనమునకు వెళ్ళెను. మీనాక్షి గర్భవతి యయ్యెను. తా నామెకు సారె చదివించెను.

మజిల నిఁకొకయూహ. తాను, దన భార్యయుఁగలసి యామెపుట్టింటికిఁ బోయిరి. అందుఁ దాను భూలోకస్వర్గ మనుభవించెను. తనభార్య తన్ను ముగ్ధమనోహరాపాంగములలో, నూత్న నూత్న విలాసములలో ముంచివేయుచుండెను.

కందాలోని నల్లపిల్లి యొకటి మేడమీఁదకు వచ్చి తివాచిమీఁదఁ జలికి ముడుచుకొని పండుకొని యెందులకో కన్నుతెఱచి మెల్లగా 'మ్యావు' అనెను.

కుట్టాన్ మనస్సు కదలిపోయెను. దానివంకఁ జూచెను. మజిల ధ్యానము.

తండ్రి సైన్యమును వదలివేయు మన్నాఁడు. తాను వద్దన్నాఁడు. ఇరువురకుఁ బోట్లాట జరిగినది. సైన్యము లన్నియుఁ

దనవైపు. వృద్ధసేనాపతులు మాత్రము తండ్రివైపు. తిరుమల నాయకుఁడు దూరమునను౦డి చూచుచున్నాఁడు.

మఱల నింకొక యూహ. మీనాక్షీ వీరభూపతులకుఁ బడుటలేదు. మీనాక్షి తనకుఁ గాక వీరభూపతికి గాక పోయినది. మీనాక్షి యుసురు తనకుఁ దగిలినది. తనకుఁ దనభార్యకుఁ బొందిక లేదు. ఏకవీర తనవలెనే చిన్నప్పటి నెవరినో ప్రేమించినది. అది కారణముగాఁ దనయం దామెకు మక్కువ లేదు.

మీనాక్షీ వీరభూపతులు; తాను దనభార్య; క్రొత్త సైన్యము, తండ్రి; రాజు, తిరుమలనాయకుఁడు; తన మేనమామ గారియూరు- గిట్టిన కుట్రాన్ మనస్సులో చక్రభ్రాంతి పొందెను. వాన కురిసి కురిసి వెలిసెను. ప్రొద్దు గ్రుంకినది. హజారము నుండి ఘంటాధ్వని వినవచ్చెను.

శ్రావణ బహుళదశమినాఁడు మధురలో వర్షము కుండలతో దిగఁబోసెను. ఏకవీర తన పడకగదిలో మగని పెద్దమంచముమీఁద ద్వారబంధమునంటి గవాక్షమునుండి జాజిపందిరి వంకఁజూచుచుఁ గూర్చుండెను. వానబొట్లు జాజి యాకులచివరల జాజిపూవులమీఁద నిలచి ముత్యములవలెఁ గులుకుచుండెను. ఆ నిలచిన ముత్యము క్రొత్తనీటిబొట్టుచేఁ దఱుమఁబడి నేలఁబడి యా స్థానమునఁ గ్రొత్తనీటి బిందువు నిలుచుచుండెను. వాన ధారగాఁబడుటచేతఁ దుమ్మెదలు పూవులమీఁద నిలుచు నాస్కారము లేక వానలోఁ దడియుచుఁ బందిరిపైనిఁ బరిభ్రమించుచుండెను. చల్లనిగాలిపొర యేకవీరమీఁదికి విసరుకొనెను. ఏకవీరకన్ను లర్ధనిమీలితము లయ్యెను. ఆమె పయ్యెద కదలాడెను. ముంగురులు తూఁగాడెను ఆమె త్వగింద్రియముమీఁద

మెఱపుమెఱసినంత కాలములో నొకతడిగుడ్డ వేసి తీసినట్లు తోఁచినది. ఏకవీర చలించలేదు.

వానధారలు ముక్కుటమయ్యెను. జాజిపందిరిమీఁద వానజల్లుపడినకొలఁది పెద్దధ్వనిఁ జేయఁజొచ్చెను. జాజియాకుల చివరనుండి నీరు ధారగాఁ బడుటయేగాని నీటిబొట్లు కొంచెము సేపయినను నిల్చుటకు వీలులేకుండెను. తుమ్మెదలు పందిరి మీఁద నిలువలేక పందిరిక్రిందకుఁబోయెను. మఱల నొక చల్లని గాలితెర యేకవీరమీఁదఁ బోసికొనెను. ఆ గాలివేగమునకు జాజిపందిరి కదలాడి పోయెను.

ఏకవీర జుట్టుముడి వీడి యామెభుజములమీఁదఁ బ్రాలెను. ఆమెపయ్యెదలొలఁగిపోయెను. ఆమెకనులు మూసికొనిపోయెను. ఆమె త్వగింద్రియము రక్తప్రవాహదఘ్నముగా నీ చల్లగాలినిఁ గొలుచుకొనెను. గాలి మఱల మఱల నామెమీఁదికే విసరుకొన్నది. గాలిపొర వచ్చినప్పుడెల్ల నామె సరిగాఁ గొలుచుకొన్నది.

వర్షమింకను బెద్దదైనది. పందిరిమీఁద జినుకులు పడుటయేగాని; పడుట, మఱలపడుటయను కాలవ్యవస్థ గోచరించుట లేదు. వానకుఁ దడిసి కంచుప్రోఁత పోయిన నగారామీఁద సన్ననిపుల్లలతో నెడతెఱపిలేక ప్రోగించిన ప్రోగించుటలో గొఱవి గిఱ్ఱునఁద్రిప్పినచోఁ ద్రిప్పుచున్న జ్ఞానముపోయి యొక్కటియే యొఱ్ఱని యగ్ని వలయాకృతి యేర్పడినట్లు వేగముగా ప్రోయించిన నొక్కఁడే మొదలు, తుద, మధ్యస్థితిలేని యేకమైన ప్రోఁతకలిగినట్లు పందిరిమీఁద ధ్వని కలుగుచుండెను. వానబరువునకుఁ బందిరి కదలిపోవుచుండెను. వర్షధ్వని తప్ప

యుంకొకధ్వని గాలిలో లేదు. మఱలఁ బెద్దగాలి రివ్వున విసరెను. పందిరి సౌధముమీఁది కొఱఁగెను. మంచముమీఁదఁ బఱచిన బంధురకలంకారుదుప్పటి యెగిరి యంచులు ముడుచుకొనెను. ఏకవీర విడివడినజుట్టు ఆమె మొగమున వక్షస్సున భుజముల మీఁదఁ బ్రవాహవేగమున విధూతమైన శైవలమువలె నల్లల నాడెను. ఏకవీర కన్నులు గట్టిగాఁ దారకలపైని గనురెప్పలు, రెప్పలకండలు నాలుగంగుళముల పొర యేర్పడునట్లు మూసి కొనెను. నిష్కంచుకమైన యామె యెదుఱొమ్ము వనవరాహము దూసి చన్న వెదురుపొదవలె సోర్ధ్వాధోభాగముగఁ గంపించెను. ఆమె త్వగింద్రియముయొక్క స్పర్శగుణవ్యాప్తి చర్మము దాటి లోని గోరువెచ్చని రక్తప్రవాహము దాఁటి శల్యములదాఁకఁ దాఁకెనని తోఁచిన దామెకు. ఆమెకు బాహ్యజ్ఞానము పోయినది. ఇంతలో నీఁదురుగాలివెంటఁ జక్కని వానజల్లు వచ్చి యామెమీఁదఁ దుపాను మొదలుపెట్టువేళ సముద్రపు కెరటము లొడ్డుననున్నవాని మీఁద గొట్టుకొన్నట్లు కొట్టుకొనెను. ఆమె పంచేంద్రియగుణములు స్పర్శగుణత్వము పొందెను.

కొంతసేపటికిఁ బెద్దవానయాఁగిపోయి మఱలఁ దుప్పరలో నిశి దిగినది. అంతసేపటికి ఏకవీరకు స్మృతికలిగినది. తన్నుఁ దాఁ జూచుకొన్నది. తల విరబోసికొన్నది. ఎదుఱొమ్ము దిగ్వాసముగా నున్నది. వాన తగ్గినది. సన్నని గాలి రేగినది జాజి పందిరి యాకులు పూవులు సన్నని నీటిబిందువుల బరువుచేతఁ గదలలేక కదలుచున్నవి. ఏకవీర ప్రక్కగా జూచినది. గుజ్జాపు వాళ్ళపిల్ల అమృతము తన పెద్దకన్నులు మఱింత పెద్దవి చేసికొని

ఏకవీరవంకఁ దదేకదృష్టితోఁ జూచుచున్నది. ఏకవీరకు నిలువెల్ల సిగ్గయినది. తొందరగాఁ దల ముడివైచుకొని సేలువ యెదుఱొమ్ముమీఁదికి లాగుకొన్నది మఱల అమృత మున్నయెడఁ జూచినది. అమృత మందు లేదు.

ఏకవీరకు భయము వేసినది. ఆపిల్ల తనవంక నేల యట్లు చూచినది? ఈసారి దానినిఁ జూచినప్పుడు కోపించవలె ననుకొన్నది. మఱల నేమో విచారింప నారంభించినది.

చిన్నప్పటినుండియు నేకవీరకు వర్షాకాలమన్నఁ దన్మయత్వము. మఱియుఁ జిన్నప్పుడు వానలోఁ దిరిగి తండ్రిచేత దెబ్బలు తిన్నది. మఱి కొంచెము పెద్దయైన తరువాతఁ బట్టుచీరలు వానలోఁ దడిపి తల్లిచేఁ జీవాట్లు తిన్నది. ఒకసారి వానలో నిలుచుండి బిగుసుకొనిపోయినది. ఇదివఱ కామె వానలకుఁ జల్లగాలులకుఁ దన్మయత్వము భజించెడిది. రెండు సంత్సరములుగా నామెలో నొక క్రొత్తమార్పు వచ్చినది. ఆమెకు గాలి తన చల్లదనము కొలిచిచెప్ప మొదలు పెట్టినది. ఆమె దేహము క్రమక్రమముగా వాయువుయొక్క శైత్యోష్ణతల పరిమాణము కొలుచు విచిత్రయంత్రమువలె నైనది. కస్తూరిపూఁత, మంచిగంధపుపూఁత, కప్పురపుపొడి, వట్టివేళ్ళ విసనకఱ్ఱ, మలయానిలము — వీని ప్రత్యేకస్పర్శసుఖానుభవమామె మనస్సునకుఁ జక్కగా నేరుపఱచి చదివిన పాత్రములోని యర్థమువలె విజ్ఞాతతత్త్వగాఢకించిద్గాఢత్వాగాఢత్వముగా విస్పష్టముగాఁ దెలియవచ్చెను.

అమృతము మఱలవచ్చి తొంగిచూచి పాఱిపోయెను. ఏకవీర కలవరపడెను.

వర్షాసాయంసంధ్య వచ్చెను. పగలెల్ల వెలుఁగురేక తెలుఁగనిరోదసి యావేళకుఁ బడమటిదిక్కున నల్లనిమేఘముల నలువులో గ్రుడ్డిమెఱుపులు తిరిగెను. శివరాత్రినాఁటి కృష్ణపక్ష గాఢయామినీవేళ గర్భగుడిలో నేకాభిషేకముచేతఁ జెమ్మగిలిన యవకాశమున కర్పూరనీరాజనము వెలిఁగించగా దట్టమై నల్లనైన హారతిపొగ హారతిజ్వాలను గ్రమ్ముకొన్నట్లు పొలిచిన దా వర్షాసాయంసంధ్య. దీపము వెలిగించుఁ బరిచారిక గదిలోనికి వచ్చి యేకవీరను సవినయముగాఁ బిలచెను.

శ్రావణశుద్ధ దశమినాఁడు వత్తునని కబురంపిన వీరభూపతి బహుళ పాడ్యమినాఁడుగాని యింటికి రాలేదు. వచ్చి భోజనముచేసి మఱల రాజసౌధమున కేఁగెను. ఆనాటి కీనాఁడు బహుళదశమినాఁ డింటికివచ్చెను. ఈకాలములో మీనాక్షి ప్రేమ బీరువోలేదు. క్రొత్తక్రొత్తరుచుల వంటకములతోఁబతి నారగింపించి తాను గబగబ రెండుమెతుకులు తిని మేడపైకిఁ బతి ననుసరించెను. వర్షము ద్రుతతాళ మందుకొన్నది.

మీనాక్షి గవాక్ష పక్షములు మూసినది. లోపల జీకటియయినది. వీరభూపతి మంచముపైనిఁ గూర్చున్నాఁడు. మీనాక్షి ప్రక్కనిలుచుండి తమలపాకుల కీనెలు తీసి సున్నము రాచి చేయి చాచినది. వీరభూపతి చేత నందుకొన్నాఁడు. కొంతసేపటికిఁ బతి చాలు ననెను. చాలు నన్నతరువాత మీనాక్షి యొకయాకు చిలుకచుట్టి వీరభూపతి నోటి కందిచ్చినది. అతఁడు నోరు తెఱువలేదు. మీనాక్షి పక్కఁ గూర్చుండి యాకుతోఁ బెదవులనదుము సందుచేయఁ జొచ్చెను. అతఁడు కోపగించెను, ఆమె చిన్నపుచ్చుకొనెను. అతఁడంగీక

మూర్ఛినది. వీరభూపతి అంగీ చల్లఁబడెను. మీనాక్షి :— గాలికిఁ గిటికీ త్రోసికొనివచ్చెను. నిద్రాభంగమైనది. వీర :— (కొంచె మాఁగి) నిద్ర పట్టనే లేదు.

మీనాక్షి కలవరపడినది. కాని లజ్జా ప్రథమసోపానము దాటితి ననుకొన్నది, విచారించినది. తానేమి తప్పు చేసినది? తన వాంఛ ధర్మబద్ధమైనదే యనుకొన్నది.

వీర :—రాజసౌధమునకుఁ బోవలయును. మీనాక్షి :— బండివాఁడు రాలేదు. వీర :—నడచిపోయెదను. మీనాక్షి :— తడిసిపోదురు. వీర :—పని యున్నది.

మీనాక్షి నవ్వి యేదో యన్నది. వీరభూపతి కది వినఁబడలేదు. అతనికిఁ గోపము వచ్చినది.

మొగ మటు త్రిప్పుకొన్నాఁడు. మీనాక్షి దగ్గఱకుఁ బోయి "కోపమెందుకు? 'పని తడిసిపోవునా' యంటిని. క్షమించుడు" అనెను. వీరభూపతి కుక్కిఱిబిక్కిఱి యయ్యెను. దొడ్డిలో నేదో పెద్ద ధ్వని యయ్యెను. మీనాక్షి భయపడెను. వీరభూపతి "దొడ్డిలో నేదో చెట్టు గాలికిఁ బడెను గాబోలు' నన్నాఁడు. ఆమె పతిదగ్గరగా నిలుచున్నది. వీరభూపతికి ఒక కాలువ తూర్పుగట్టుమీఁద నిలుచుండి పడమటిగట్టున కెట్లు చేరుదునా యనుకొన్నట్లయినది. ఇంతలో నతనికి. గన్నులు గిఱ్ఱునఁ దిరిగి ఱెక్కలు వచ్చినట్లయి పడమటి గట్టుమీఁదికిఁ బోయి తూర్పుగట్టున కెట్లు చేరుదునా యనుకొనుచున్నట్లు తోచినది. తనజీవితము పూర్వము తాను చేరవలసిన స్థానము పడమర నున్నది. అది విచిత్రముగాఁ దూర్పునకుఁ [illegible]వచ్చినది. తాను పడమటిగట్టుపై నున్నాఁడు.

వర్షము బయటఁ గొంతసేపు మద్దెలలు వాయించినట్లు, కొంతసేపు పెను ఘ్లాడినట్లు, కొంతసేపు తాటియాకు లీడ్చినట్లు, కొంతసేపు అవ్వాయిచువ్వ లెగురవైచినట్లు తోటాలు కాల్చినట్లు, పిచ్చివానివలె నల్లరి చేయుచుండెను. ఇరువురును రెండవగదిలోనికిఁ బోయిరి. మీనాక్షి కనులు తన చిత్రము మీఁదికిఁబోయెను. దానికి దూరమున నున్న వీరభూపతి చిత్రమును దెచ్చి యామె రెండును దగ్గరగా నుంచెను. వీరభూపతి బొమ్మ కలకల నవ్వినది. స్థానాపతి యాలోచనానిమగ్నుఁడయినాఁడు. మీనాక్షి బొమ్మ విచారముఖము సూచించినది. మీనాక్షి మొగము కలకలలాడినది.

పతి మాటాడలేదు. మీనాక్షికిఁ గనులయెదుటఁ దెరగా నాడినది. ఆమె చూపు తన పతి పూర్వ్వప్రణయినీచిత్రము మీఁద నిలిచినది. ఆ చిత్రమున నామె తెల్లని చీర ధరించినది. కేశపాశము పాడిపాడిగానై ముంగురులు గాలికిఁ గదలుచున్నవా యనునట్లుండెను. మీనాక్షి యులికిపడినది. 'స్త్రీసంస్థానం చాప్సరస్తీర్థ మారాదాక్షిప్యైనాం జ్యోతిరేకం తిరోభూత్' అన్న వాక్యములోని యనుభవమునకు సాజాత్యమైన యొక యనుభవ మామె మనోనేత్రము నెదుటఁ గలిగినది.

బయట వాన తగ్గి మఱల మొదలు పెట్టుచున్నది. ఇంత జాము ప్రొద్దుండవచ్చును. మీనాక్షి నిరస్తభావయై యింటఁ బనులు చూచుకొనుటకుఁ బోయినది. వీరభూపతి సంకల్ప వికల్పశక్తిఁ గోల్పోయిన మనస్సుతో మఱల నిద్రకుఁ బడినాఁడు.

పట్టాభిషేకోత్సవములు వర్షాకాలమునఁ బడిపోయినవి.

ఉత్సవములకన్నఁ గ్రొత్తరాజ్యకింద జేయవలసిన రాజ్యపుఁ గట్టుబాటులకే చాలకాలము పట్టుచున్నది. వర్షము వెలిసిన సాయంకాలముల రాజసౌధపు టేనుఁగులు మొగసాలనుండి రతనాలు కుట్టి వెలగల జరీపనులుచేసిన పట్టుహౌదాలతో నూరు తిరిగి రాఁబోయి మఱల రాజసౌధమునకు బురదమరక లతో వచ్చుచుండెను. ఉత్తమజాత్యశ్వములకుఁ గూడఁ గాలు జారుచుండెను. రాజసౌధపు ముంగిటుల నౌబత్తుఖానాల మ్రోఁతకూడ వానలకుఁ జెమ్మగిల్లి నట్లు మందముగా విన్పబడు చుండెను. విద్వద్బ్రాహ్మణులు రాజుగా రిచ్చిన క్రొత్తసేలు వల బంగారము దర్భాసనములలో దాచి తడిసిపోవు నని భయము వదలక వంగి వంగి పోవుచుండిరి. సాయంసంధ్యలు నల్ల నల్లనై విషాదభావము మూర్తికట్టినవి.

భాద్రపద శుక్లపంచమినాఁటికి మధురనుండి రామనాథ మున కుదయనసేతుపతి బదులు రాజలేఖ యొకటి పోయి నది. ఇంకొక నెలపైగా సేతుపతి రాజనగరమున నిలువక తప్పదు. కుట్టాన్ శౌర్యమునకు, రాజనీతి వేత్తృత్వమునకు రాజు మెచ్చెను. కానుకలు పనిచెను. తిరుమలనాయకుఁడు చెలికానినిఁ బొగడి యుత్తర మొండు వ్రాసెను. క్రొత్తసైన్య మాఱువందలు వెంటనే మధురకుఁ జేర్పవలయును. కుట్టాన్ తండ్రి వచ్చువఱకు రామనాథముననే యుండవలెను. దశమి నాఁడు బయలుదేరి క్రొత్తసైన్యములు గోవిందనాథుఁడు నొగిఁగా మధురకుఁ బ్రయాణమయ్యెను. కుట్టాన్ పేరువిన్న చుట్టు పట్ల పాళెగాండ్రకు, దోపిడిగాండ్రకుఁ బోర్చుగీసువాండ్రకు

సింహాస్వప్నమైనది. భాద్రపదము గోరంటపువ్వులతో వెనుకఁ బట్టెను.

మధురపై నాకాశమునఁ దెల్లని మేఘములు గాలికిఁ గదలు దోమతెరవలెఁ గదలఁజొచ్చెను. పవళ్ళకు సూర్యకాంతి మొగమువాపు తగ్గెను. మీనాక్షీదేవాలయమున కాంధ్రద్రావిడస్త్రీలు సాయంకాలమునఁ జేమంతిపూవులు కుట్టిన పెద్దజడలతోఁ బోవుచుండిరి. నందీశ్వరుని యొడల రాచిన నూనెయుఁ నాయనకొమ్ములపై ప్రవేశించి తద్విషాణమధ్యము నుండి శివలింగదర్శనము చేయు భక్తు లుంచిన విభూతి పులుముకొని తెల్లఁబడఁజొచ్చెను. యామ్యాదిశ నేకచుళుకాహంకారనిశ్శేషశోషితపాథోధిపయస్కుఁడైన ముని తోఁచె.

వైగైనది పతిప్రేమ జాఱిపోవుట తోఁచినకాంత మొగమువలె తన చివరల తెల్లబడఁజొచ్చెను. ఆమెలోని రాగచ్ఛాయ విఱిగిపోఁజొచ్చెను. కంఠేకాలుని శిరఃకోటీరమునకుఁ జంద్రకాంతమాలలు సమృద్ధిగా దొరకెను. శరల్లక్ష్మి యొక నాఁటిప్రొద్దున నున్నట్టుండి దిగంతవిశాలరమ్యదీర్ఘహాసము చేసెను. గుజ్జుపువాళ్ళపిల్ల అమృతముకూడ నాఁటిప్రొద్దున సెలవివాఱ దిగంతవిశాలరమ్యహాసము చేసినది. అమృతము తెలివిగలపిల్ల యని గ్రహించి యొకబ్రాహ్మణుఁ డామెకుఁ బది నాళ్ళుగాఁ జదువుచెప్పుచుండెను. ఆమె పదినాళ్ళలో నక్షరములు నేర్చి మాటలు చెప్పుఁడని యాయనను బలవంతపెట్టగా నాయన 'అతిచ్చూడి'లో మొదటివాక్యము 'అఱంజేవిరుంబు' అని యామెకు నేర్పెను. ఆమెయు నామాటఁ దెచ్చి బొగ్గుతో నేకవీరసౌధకుడ్యముమీఁద వ్రాసెను. ఏకవీర యది మఱునాఁడు

చూచి యేలొకో భయపడి పాఱిపోయెను. ఈసంగతి యమృతము చూచి యెందులకో దానికిఁ దెలియకుండనే యొకపెద్ద నవ్వు నవ్వినది. ఆనవ్వు శరత్కాలము లేఁతయెండలోఁ గలసి జాజిపందిరిమీఁద బ్రాకిపోయెను; సౌధకుడ్యముల సున్నము కాంతిలోఁ గలసిపోయెను.

ఎండలు ఘొల్లుమనఁ గాసెను. వర్షవేళ గొడ్లు త్రొక్కిడి బురదలైన ప్రదేశములు వాని కాలిగిట్టలగుర్తులు గుర్తులు గానే బిగియఁ జొచ్చెను. తెల్లపూవులు దూరపుటెండ పొరలలోఁ దళతళలాడెను. పంట బోదెలవెంటఁ దెల్లనిరొంపు విరిగిపోయిన కొబ్బరిపాలవంటి నీరము సన్నగాఁ బ్రవహింపఁ జొచ్చెను. బోదెమలుపులలో జాలరులు మావులు నిలిపిపోయిరి. పచ్చని వరిపైరు నలుపుతిరిగి గుమ్మలుకట్టి పై నాకాశపు నీలిమకుఁ బ్రతిగా నుండెను. కొత్తిమేరచేలు నాఁగటిచాళ్ళలోఁ జిన్ని చిన్ని మొక్కలుగా గాలి పొరలలోఁ జిన్నితల లాడించెను. సెనగచేల మొక్కలు లేఁతప్రాయపుఁ బుల్లతనము రాత్రులపుడు కొంచెను కొంచెము మంచునకుఁ గొంచెము కొంచెముగా దినదిన మెదుగుచుండెను. ప్రొద్దుటిపూటఁ జల్లని లేయెండ, మధ్యాహ్నమున వేసఁగియెండ, సాయంతన సమయముల నెండ యనిపించనియెండ, రాతిరి రెండుజాముల వఱకుఁ ఒలుచని మేఘముల చాటున విరియఁబోసికొన్న చిక్కని పాలవంటి వెన్నెల, రాతిరి రెండవజాము మొదలు మంచు కురియుట, యిదిశరత్కాలపు దివారాత్రములకు సహజ మయ్యెను.

అమృతమును శిక్షించవలె నని ఏకవీర. ఏకవీరకుఁ గన

బడకుండ నమృతము. మేఘపు మఱుఁగున నున్న పలుచని చీఁకటులు వెన్నెల యొకదాని నొకటి పారద్రోలఁగా, దప్పించుకొని తారాడఁగా నొప్పినట్లు వా రిర్వురు శరద్రాత్రుల కొక సాటువ తెచ్చుకొనిరి. శరద్రాత్రుల గగనభాగ మొకవింత కళ తాండవించినది. కొంతసేపు తెల్లని చిక్కని మేఘములు గాలిచేత బరువులై మనుజుల పశువుల పాదఘాతములు లేని యిసుకతిన్నెలు గాలి దుమారములచేత నొక్కులు నొక్కులుగానైనట్లు, సముద్రపు కెరటములు వెనుకకుఁ బోవుచు, నొడ్డున నున్న యిసుకనేలఁ జిన్నచిన్ని మొల్లుగా నమరించినట్లు, తెల్లనిచేప యొడలి పొరలట్లు, ఒకటిరెండు కాన్పులైన ముగ్ధపురంధ్రీరహోవేళాస్పృష్టము, దీపపువెలుఁగున మెఱయుఁబొత్తికడుపట్లు రమ్యముగా నుండెను. మఱికొంతసేపు వలయాకారమందందుఁ జెడిన చిన్నచిన్న తెల్లనిమేఘములు, వానినడుమ నల్లని మేఘములు, తెల్లనివి చంద్రకాంతిచే మెఱసి, నల్లనివి చంద్రకాంతి నాపి, హూణదేశపుటావు నొడలివలెఁ దామర గొడుగాకులు పూవులు నీటిపైకి లేచిన చెఱువు పైభాగము వలె, పూలుపూచిన సొరపాదువలె మనోహర మయ్యెను. మఱికొంతసేపు పడమటిగాలి విసరి, యాదిక్కునఁ జలువచేసి యారవైచిన ఖద్దరువస్త్రముల వలెఁ జిక్కని తెల్ల మొగిళ్ళు, తూర్పునకు గాలివిసరున నెగిరిపోవుచు నక్షత్రములను, జంద్రుని బడమటిదిక్కునకుఁ బరుగెత్తించు చున్నట్లు కనిపించుచుండెను.

అదియొక శరద్రాత్రి. కుట్టాన్ భార్య కొకలేఖ వ్రాయ సంకల్పించి నాల్గుసార్లు వ్రాసి చింపివేసి కొంతసేపు మేఘములవంకఁ జూచి శరజ్జ్యోత్స్నలో నేకవీర కన్నుల తళతళ

యున్నదనుకొని యామెకుఁ దన ప్రేమ హఠాత్తుగాఁ దెలియఁజేసి యామె గాఢతరపరిష్వంగము లోఁతులు త్రవ్వుకొందమను నాస రేఖ వ్రాయుట మాని తెల్లవారు లామెనే ధ్యానించు చుండెను. ఏకవీర తన్నుఁ గుట్టాన్ ప్రేమించుట స్వప్నగత వృత్తాంత మనుకొని, యాపరాని తన పూర్వప్రేమోమూర్తినిఁ బ్రయత్నముచేత మనసు చొఱకుండ నాపరాని వానిని, శరత్కాలపు వెన్నెలల తెలికాంతులవలనఁ దాను ధరించు తెలి పట్టుచీరలలోని యొక విశేషానుభవమునలన మఱియుమఱియుఁ దనయూహలో నిలుచువానినిఁ జూచి, యూహించి, సాత్త్విక భావములకు లోనయి, యొడలెల్లఁ బులకించి యాసుఖము తన రక్తమాంసములలోనికిఁగూడఁ జొచ్చిపోవునట్లు భావించుకొని, యింతలో నమృతము తనవంకఁ దొంగిచూచుచున్నట్లులికిపడి, 'ఆరంజేవిరుంబు' తన చెవులలో ధ్వనించి మఱలఁ గుట్టాన్ ప్రేమమూర్తి పరిణతభావుని భావించి నేలకుఁగాక మింటికిఁగాక పరితపించుచుండెను.

తెల్లవారి లేయెండలు కాచి దొడ్డిలోని కాఁకరపూలు, బీరపూవులు బంగారునాణెములవలె, పొట్లపూవులు వెండి నాణెములువలె, వంగపూలు నీలాలవలె, గన్నేరులు పచ్చలవలె, మాణిక్యములవలె, నకాలదోహదపుష్పితమల్లికలు సూచీ ముఖ్యపుష్యరాగములవలె, నిత్యమల్లిక లెఱ్ఱవి, తెల్లవి, యెఱ్ఱని రాళ్ళవలె, వైక్రాంతములవలె దొడ్డి యంతయు ధనలక్ష్మి తాండవించి నట్లయ్యెను. ఏకవీర మనస్సులో మాత్రము దారిద్ర్యము తాండవించెను.

## ౨౧

కృష్ణానది కుత్తరమునఁ దెలుఁగునాడులో విజయవాడకు దిగువఁ గూచిపూడియని బ్రాహ్మణాగ్రహారము గలదు. అందు సిద్ధప్ప యను బ్రాహ్మణయువకుఁడు, మందబుద్ధి, సోమరి, అమాయకుఁడు నిరక్షరాస్యుఁడు ఆ యూరందఱకుఁ బరిహాసపాత్రము. ఆ యూరిలో మఱియొక బ్రాహ్మణుని కూఁతురు సిద్ధప్పకుఁ దగిన పెండ్లమని ఆమెతండ్రి తన కూఁతునకుఁ దగిన వరునిఁ దేలేకయు, సిద్ధప్పయందు జాలిచేతను అతని కిచ్చి పెండ్లి చేసెను. పెండ్లితో జీవితభారము తెలిసిన సిద్ధప్ప చదువుకోరిక బలిసి కృష్ణ దాఁటిపోయి నానాపండితుల శుశ్రూష చేసి వేదశాస్త్రములు, సంగీతము, నాట్యము, భరతము సర్వాంకషముగా నేర్చెను. అతని చదువుపూర్తికొఱకు వ్యక్తురాలయిన యతనిభార్య స్వగ్రామమున మనస్సులో, నామె తల్లి తండ్రి బహిరంగముగాఁ బ్రతీక్ష చేయుచుండిరి. విద్యాపూర్తియయి యింటికిఁ దిరిగివచ్చు సిద్ధశాస్త్రిమనస్సు నానావిద్యలచేతఁ బరిపక్వమయినను, భూతగృహస్థాశ్రమ మను భూతదశ యందినట్లయి తురీయాశ్రమము దెసఁ బరువెత్తెను. కాని మాయాలేశము వదలక మనస్సును నిశ్చయమునకుఁ దేలేదు. కృష్ణవద్ద కిట్టియూహలతో వచ్చిన శాస్త్రి యిట్లు నదిఁ జూచునుకదా కృష్ణ యీ యొడ్డాయొడ్డు మోఁచి యున్నది. తెప్పకొయ్యకూడ లేదు. ప్రొద్దు గ్రుంకుచున్నది. గ్రామముకొఱకు వెనుదిరిఁగిన నామడపోవలయును. ఇంటిమీఁది యాస రేఁగుచున్నది. సాహసించి కృష్ణకడ్డుపడినాఁడు. సగమీఁదువఱకు మానిసిపని 'త్రాహి త్రాహి' యయినది. తన

కంత్యకాలము సమీపించినదని యతఁడు మనసా మోక్షార్థి; సన్న్యసించెను. ప్రయత్నరహితుఁడై చేతులు కాళ్ళుఁ గదపక యూగిన యతనినిఁ దాలోత్తాల మొకకెరటము జంఘుదఘ్నమగు నీట నిలిపెను. ప్రాణాయామము చాలించిన యతనికి కృష్ణ యందినది. రేయి కూచిపూడిచే నాఁడు. అల్లుఁడు తేజస్వి, సకలవిద్యారాసి, వచ్చిన యానందము మఱునాఁటికి గర్భాధానలగ్నము కుదిర్చినది. గృహారామక్షేత్రదర్శికి సిద్ధపండితునకుఁ గృష్ణనడుమఁ బూనిన యాతురసన్న్యాసము జ్ఞప్తికి రాలేదు. ఆరాత్రి యేకాంతమున భార్యాచేలాంచలాకర్షి యతఁడామెచే వారితుఁడయ్యెను. నిజమునకు సిద్ధప్పగాని, యతని భార్యగాని మందబుద్ధులు గారు. అంతర్దృష్టులు. ఆమె యోగిని. తన భర్తయందు సన్న్యాసినిఁ జూచెను. శృంగార చిహ్నలులేని, నిదుర బడలికలులేని, ఆసకదలికలులేని వారి కన్నులు నలుగురమ్మలనోళ్ళ నాట్యమాడి రహస్యము వెలికిఁ దెచ్చెను సిద్ధపండితుని మనస్సులోఁ దనయందు యతిని గాంచిన భార్యమాటకుఁ గృష్ణయాఁతకు మునిపడి యతఁడమరకుని మేనఁ బర్యటించిన యాదిశంకరుఁడు సురేశ్వరుని వాక్కులచేతవలెఁ బ్రబోధితుఁడయ్యెను. తత్క్షణము క్రమసన్న్యస్థుఁడై శిష్యులకు విద్యాదాత యయ్యెను. మందబుద్ధియగు సిద్ధప్ప సిద్ధేంద్రయోగికా, నాయూరెల్ల నాతనికి శిష్యకోటి యయ్యెను. ఆయనలో నిగూఢమైయున్న కవితాబీజ మాకస్మికముగఁ బ్రత్యవభాసించి, నియుచ్ఛింపబడి, మూకీభూతమైన శృంగారభావసర్వస్వము భగవంతునియందుఁ బర్యవసించి యతఁడు కదలిపోయెను. ఆయనలోఁ బరిపక్వములైన

భరతము, నాట్యము, సంగీతము, దేశభాషాజ్ఞానము, కవితా బీజమునకు రూపమేర్పఱచినవి. నేర్చిన షట్ఛాస్త్రములు మన స్సుగా మాఱినవి. అలంకారశాస్త్ర మంతయు బుద్ధియైనది. సత్యభామాకృష్ణుల ప్రణయ మాత్మ యయినది. ఈ దివ్య కవితారూపపరిణామముచేతఁ దెలుఁగునేల నాలుఁగు దిక్కులు సంగీతసాహిత్యము లనుపేరి కుచద్వయ మల్లలాడ భాషాదేవి కాలిగజ్జెలు గల్లుగల్లుమని మ్రోఁగినవి. సిద్ధేంద్రయోగి గ్రంథము రెండు భాగములు. మొదటిది గొల్లకలాపము. రెండవది భామకలాపము. గొల్లకలాపము షట్ఛాస్త్రములకు నిలుకడ. భామకలాపము వదకట్టిన యలంకారభరతశాస్త్రములు. నాటకమునఁ గృష్ణదేవునకు స్థానము లేదు సత్యభామ ప్రధాను రాలు. సత్యభామయే శృంగారరససర్వస్వమున కాలంబన విభావ మని తెలిసినవారు సృష్టిలో ముగ్గు రన్న ముగ్గురే. మొదటివాఁడు శ్రీకృష్ణదేవుఁడు. అతఁడుశృంగారసర్వస్వమును జూఱగొన్నాఁడు. అతనికి రుక్మిణి వైకుంఠమునుండి తెచ్చు కొన్న నిధానము కావచ్చును. ఆమె పాతివ్రత్యమునకు మచ్చు ముక్క కావచ్చును. సత్యభామ శృంగారాధిదేవత. సర్వవిధ నాయికలను సర్వభావములను సృష్టించిన దామె. ఆ సృష్టి యా తల్లి భర్తయగు భగవంతుని కంకితము చేసినది. ఆమె యాలంబన విభావత్వ మెఱిఁగిన రెండవవాఁడు నందితిమ్మన. పాదతాడనముకూడ శృంగారరసమునందుఁ బర్యవసింపఁజేసిన యా దేవీరసమూర్తి యాయనకుఁ గొంచెముగాఁ దెలిసినది. కృత్రిమకవితాలక్షణము పెంచుకొన్న యా కాల మతనిని సత్యాశృంగారదేవతాత్వము సంపూర్ణముగాఁ దెలిసికొన

నీయలేదు. అతని రచనలో శాఖోపశాఖలై మొదలు తుదఁ దెలియరాని యలంకారశాస్త్ర మొక్క యాశ్వాసముతో ముగిసెను. మూడవవాఁడు సిద్ధేంద్రయోగి. ఆయన సృష్టి యాయనకే తెలియును. శృంగారరసము భగవంతునిఁ జెప్పినపు డాలంబనవిభావము (కృష్ణునితోపాటు) సత్యభామ యగుచున్నదని తెలిసికొనుట తేలికగాదు. వంగదేశకవులు జయదేవ విద్యాపతులు రాధ కా పదవిఁ గట్టిపెట్టిరి. ఆ శృంగారము చైతన్యుని తన్మయత్వము ధ్వనించును గాని శంకరుని విజ్ఞానమును ధ్వనించదు. సిద్ధేంద్రయోగి జయదేవవిద్యాపతులవలె భక్తుఁడు కాదు. యోగి, జ్ఞాని. అందుచే నితఁడు కృష్ణునితోఁ బాటు సత్యభామ నాలంబనవిభావము చేసెను. సత్యభామ నిఖిలభావములకును నొరిపిడిరాయి. శృంగారరసలేశములను గూడ సంతరించి సిద్ధేంద్రయోగి 'భామకలాపము' అలంకార సర్వస్వముగా సృష్టించెను. నాట్యము, అభినయము, భావము, సంగీతము నీ నాల్గింటి మహాసమైక్యముఁ దెలిసిన యా కవి తన గ్రంథమును గూచిపూడి యగ్రహారికులకుఁ దారకోపదేశమట్లుపదేశముచేసి కాలము పరిణతమైన కొలఁది మీ కిది వంశపరంపరగా భుక్తికి ముక్తికి నాధారమని చెప్పి, యా విద్యఁ బరిత్యజించినవారు ముక్తిదూరు లగుదురని శాపమిచ్చి కొందఱు శిష్యులను దయచేసెను. వారు తెలుఁగుదేశము నాల్గుమూలల నీ విద్య వ్యాపింపఁజేయుచుండిరి. ఈ విద్యమూలమున సర్వశాస్త్రములలోని రహస్యములు సర్వజనులకుఁ దెలియుచుండెను. ఆ నాటకము చూచినకొలఁది జనులకు హృదయములు కోమలములు, మనస్సులు భావపూరితములు,

ఆత్మలు రసనిమగ్నము లగుచుండెను. అది తెలుఁగు శారద అను నేర్వని విద్యయైనది. అజ్ఞానులుకూడ జ్ఞాను లగుచుండిరి. కూచిపూడివారి భామకలాపమన్నచో నాఁడోజులలోఁ బసి పిల్లలదగ్గరనుండి పారవశ్యమైనది. భామకలాపమునకు శరత్కాలపు వెన్నెలరాత్రులు కామధేనువులు. శరత్తువెన్నెలలు మధురవీధులలోఁ దలతలలైనవి. నాఁడు ఆశ్వయుజపూర్ణిమ. మీనాక్షీసుందరేశ్వరుల కల్యాణమహోత్సవము. కల్యాణ మంటపము వీరభూపతి యింటికెదురుగా నున్నది. కూచిపూడి వారి భాగవతము కల్యాణమంటపమున కెదురుగా నాఁటిరాత్రి యాడఁబడును.

మీనాక్షి శ్రావణశుద్ధ దశమినాఁడు సేతుపతుల సౌధమున కేఁగినది. మఱల నేఁ డేఁగినది. ఏకవీరను భాగవతము చూచుటకు బిలుచుకొని రాతిరి జాముప్రొద్దు పోయిన తరువాత వచ్చినది. ఇద్దఱును బలుచని తెరచాటున వారి యరుగులమీఁద గూర్చుండిరి. ఒక వైపునఁ గల్యాణము జరుగుచుండెను. మఱియొక వైపున హంగుమేళము చేయుచుండిరి. జామున్నరప్రొద్దు పోయినది. గొల్లకలాపము ప్రారంభమయినది. గొల్లభామయు హాస్యగాఁడును దెరవెనుక నుండియుండి చాకలివాండ్రు దగ్గరగాఁ బెట్టిన రెండుకాగడాలమీఁదఁ జల్లిన గుగ్గిలము మంటపులో ద్రుతతాళ ముద్ధతనాట్యముగఁ దెర

*ముత్తువీరప్పనాయకుని కాలమునాటికేఁ గూచిపూడివారి భాగవతము క్రొత్తగా దేశములోనికి వచ్చినది. సిద్ధేంద్రయోగి పదునేడవ శతాబ్దము వాఁడు. ముత్తువీరప్ప ౧౬౧౦ లో రాజ్యమునకు వచ్చెను. అప్పటికే కూచిపూడివారి భాగవతము పేరు మ్రోగిపోయెను. చుట్టుపట్ల వేయి గ్రామముల నుండి జనములు గుంపులు గుత్తులై వచ్చిరి.

వెలికి వచ్చిరి. హాస్యగాని హాస్యమునకు, గోపికాభినయము నకు, దాని యుచ్చారణకు, దేశీయభాషాప్రయోగమునకు జనము కదలిపోవుచుండిరి. గోపిక 'చల్లో యమ్మ చల్ల' యనుచు, తన జాతిలక్షణములు; పశువుల మేకల గొఱ్ఱెల స్వభావములతోఁ బశుశాస్త్రము చదివి; షట్ఛాస్త్రముల యర్థ మువన్యసించి, రాగములు, తాళములు, భరతము, అలంకా రము చర్చించి గర్భధారణము, గర్భోత్పత్తి, నవమాసము లలో శిశువుపరిణామము, ఆత్మతత్వము, సృష్టికారణము సర్వ మును జెప్పి సభికుల ముగ్ధులఁజేసి తెరవెనుకకుఁ బోయెను. ఏకవీర తదేకధ్యానముతో వినుచున్నది. మీనాక్షి కొంత సేపు నాటకమును జూచుచుఁ గొంతసేపు కళ్యాణమువంకఁ జూచుచుఁ గొంతసేపు జనమున కవతలఁ జరించు వీరభూపతినిఁ గన్నులతో వెంబడించుచుండెను. రాత్రి రెండు జాములుదాఁటి మూడవజాముకూడ సగము గడచినది. అప్పుడు భామ వేషము వచ్చి జడ తెరమీఁద వైచి తెరవెనుకనుండి తన కథ చెప్పు చున్నది. సభ్యుల కందఱ కనిమిషత్వము వచ్చినది.

మీనా:—అజడ తెరమీఁద వేయుటయెందుకో తెలియునా? ఏకవీర:— తెలియదు; మీనాక్షి:— భరతశాస్త్రమునందుఁ దమకు సాటివారు లేరని పందెము చఱచుటయఁట. ఏకవీర:— అట్లయినఁ బండితులకుఁ గోపము రాదా? మీనా:— రావలయు ననియే, వచ్చినచోఁ దమశక్తిఁ జూపించవలయు ననియే. ఏకవీర:—కొంత యీర్ష్యాళువు లుండవచ్చును. వారు ప్రత్యా గమను చేసి పగ దీర్చుకొందురు. మీనా:— మంత్రశాస్త్రమునఁ గూచిపూడివారు మహాఘనులఁట. వారిశక్తి యపరిమితమఁట.

ఇంతలో విరహిణి యయిన సత్యభామ తెరవీడి వచ్చి భగవంతుని దశావతారముల నభినయించెను. ఆ హస్తవిన్యాసము, ఆ యవయవచాలనము, ఆ ద్రుతతాళము, ఆ సుష్ఠూచ్చారణ, ఆ భ్రూవిక్షేపము, ఆ భావానుగుణ్యనేత్రోన్మీలననిమీలనములు సాక్షాత్ భరతముని వచ్చి నేర్పెనా యన్నట్లున్నవి. తరువాత 'భామ' వేషగాఁడు ముగ్ధామధ్యాప్రగల్భలాధారముగ విప్రలంభశృంగార మభినయించుచు మానావస్థయందలి మధ్యాప్రగల్భల ధీరాఽధీరా, ధీరాధీరా భేదములు, నందులో మఱల జ్యేష్ఠా కనిష్ఠల భేదములు సూచించి విప్రలంభావస్థలు పదియును నారంభించి యభిలాష చింతాస్మృతి గుణకీర్తనోద్వేగప్రలాపోన్మాద వ్యాధులను నెనిమిదవస్థలు నభినయించెను. రసజ్ఞుల హృదయములు తల్లడిల్లి పోయెను. పామరు లందరు హాస్యగానిమాటలకు వశంవదు లగుచుండిరి. హాస్యగాఁడుగూడ 'భామ' భిన్నభిన్న నాయికల నభినయించునపుడు వాగ్రూపమునఁ దత్తదుచితసఖీనిరూపణము చేయుచుఁ బండితుల హృదయము చూఱగొనుచుండెను. భావయోగ్యములయిన పతాకాది హస్తములతోడి, స్వాధీనమైన నేత్రతారకాభ్రమణముతోడి, నిత్యాభ్యాసవశమైన కౌశలముతోడి యతని యభినయమునకు, సర్వవిద్యలకు జన్మస్థానమైన బీజాక్షరరూపమునఁ దామ్రవిగ్రహమున నావేశించియున్న శివుఁడు, నాదతనుఁడు, సుందరేశ్వరస్వామి పులకితుఁడై కనులు తెఱచి చూచుచుండెను. మీనాక్షీదేవికూడ ముగ్ధయై యతనివంకఁ జూచుచుండెను. తద్వీధీవాయువులలో మృదంగస్వానములు కాళ్ళగజ్జెలరవములు విరజిమ్మిన లయ, రమ్యాతిరమ్యమైన భాగ

వతుల సంగీతపుధ్వని, ప్రతిహారలో నాడుచుండెను. ద్రష్టలైన లక్షజనములోఁ బసిబిడ్డకూడ జెప్పవేయలేదు. తొలికోడి కూసినది. 'భామ' జడతావస్థ నభినయించుచున్నది. రాగము మాఱినది. తాళము మాఱినది. అది యొక క్రొత్తకీర్తన ప్రారంభించిరి. మీనాక్షీకనులు నాట్యప్రదేశమునందు నిశ్చలముగా నతుకుకొన్నవి. ఏకవీర ప్రాణములు పూర్వములైన యెనిమిదవస్థలు మానసికముగా ననుభవించినవి. జడతావస్థాభినయవేళ నా గీతమునకు దాళమునకు దించుకొనిపోయినవి. ఆమె యొడలు విదల్చుకొని చెవులు మూసికొని చప్పుడు లేకుండ వీరభూపతి యింటిలోనికిఁ బోయినది. ఆ యిల్లామెకుఁ గొంతభాగము పరిచితము. మంచము వేసియున్నగది యామె యెఱుఁగును. కాని మీనాక్షీ వీరభూపతులయు, వీరభూపతి పూర్వ ప్రణయినియుఁ జిత్రము లున్నగదిలోని కామె వారింటికి వచ్చిన మూడుసార్లలో నెప్పుడును బోలేదు. మీనాక్షీ యామెకా గది చూపించలేదు. ఏకవీరపోయి మంచ మున్నగదిలో నొకచోఁ గూర్చున్నది. కూర్చుండలేక పోయి పండుకొన్నది. సుకుమారమైన యామె దేహమునకు నేలగ్రుచ్చుకొని యామె యవిచారితముగాఁ బోయి మంచముమీఁదఁ బండుకొన్నది. బయటనుండి యా జడత్వము గలిగించు రాగము తాళము సన్నగా వినిపించుచుండెను. ఈమెను జడత్వము సన్నగా నాక్రమించెను. బయట 'భామ' వేషగాడు నిధనావస్థ యమంగళమని పరిత్యజించి వాసకసజ్జికాభినయము మొదలుపెట్టెను. రాగతాళములు మఱల మారినవి క్రొత్తగీతిక యారంభించిరి. వాయుపథమెల్ల నింతకుఁబూర్వము విషాదభావపూరితమైనది.

మూలల సంతోషభావములు చెలరేగినవి. కాళ్లను చిత్రగతుల పడుచుచున్నది. ఏకవీర కెదలోని దిగులు సన్నగిల్లినది. ఆమె మీదో కోరిక కలఁచివేసినది. పండుకొన్నది. లేచి యేమియును తోచక అటునిటూ తిరిగినది. ఇట్లు తిరుగుచు ప్రక్కనున్న గదిలోనికిఁ బోయినది. దీపము తేగంటువలె వెలుఁగుచున్నది. మీనాక్షిచిత్రము, వీరభూపతి పూర్వప్రణయినీచిత్రము పైని వస్త్రాచ్ఛాదితములై యున్నవి. కావున నామె కవి గోచరించ లేదు. వీరభూపతిచిత్రము గోడకానుకొని యున్నది. ఏకవీర కనులు మిరుమిట్లుగొనెను. ఆమె నిలువునను జలించిపోయెను. ఆమె కెదురుగాఁ దన పూర్వప్రణయమూర్తి సాక్షాత్కరించి నట్లుండెను. ఏకవీరలోఁ జైతన్యము లేదు. ఆమె మనస్సు జడత్వము దాల్చెను. ఆమె కన్నులు తెఱచుకొనియున్నవి. ఆ నేత్రములలో జీవచిహ్నము లేదు. ఆమె గోడ కానుకొని నిల్చుండుటచేతఁ గ్రిందఁ బడిపోలేదు. మనోరథము నిశ్చల మయ్యెను. చల్లనిగాలికి గవాక్షము తెఱచుకొనెను. బయట సఖీపరిహాసము వినవచ్చెను. ఏకవీర ప్రబోధితయయ్యెను. తాను నాయిక. ఆ చిత్రస్థితివలన అది తన నాయకుఁడు వచ్చు నున్న స్థలము, తాను వాసకసజ్జిక. ఇదే యూహ యామెకు. అప్పు డామెస్థితిలోని యణువణువునకు రసజగత్తును దాటిన యునికి లేదు. ఆమె మనస్సులో మీనాక్షి లేదు. అది మీనాక్షి యిల్లని లేదు. తానున్నది రసజగత్తు. ఆమె నాయిక. తా మానవలోకమున లేదు. తానున్నది రసజగత్తు. ఆమె నాయిక. అందులో వాసకసజ్జిక. నాయకుని కొఱకు ఎదురుచూచుచున్నది.

తూర్పు రేకలు తోఁచినవి. గదిబయట సామగ్రీసంపా దనపు గడబిడ తోఁచినది. ఏకవీర తెలివి వచ్చి చీర సర్దు కొన్నది. తలవెంట్రుకలు గోళ్ళతోఁ జిక్కుతీసికొన్నది. తన నాయకుఁడు తన్ను వచ్చి కౌఁగిటఁ బూను ననుకొన్నది.

మఱల బయట మార్గవిలోక మను చేష్టాభినయము నంది గీతము మొదళ్ళ 'ఇటువచ్చుచున్నాఁడే, అటు వచ్చు చున్నాఁడే' యనునవి వినఁబడెను. ఏకవీర కను ల ప్రయత్న ముగా ద్వారము వంకకుఁ దిరిగినవి. ద్వారము తళతళలాడినది.

బయట నాట్యసౌందర్యము కన్నులువిచ్చి చూచు చున్న సుందరేశ్వరుని కంటివేడికి పూజారిచేతిచామరము మండిపోయినది. పూజారి చాఁకలివానిచేతి కాగడా యంటు కొన్నదని వానిని కోపపడినాఁడు. నాటక మాడుటకు వేయఁ బడిన పందిరియాకుచివర లెట్టఁబడినవి. 'భామ' వేషము వేసిన వాని కోకచివరలు తగులబడినవి. ఆ దోషముకూడ చాకలి వానిపై మోపఁబడెను. ఎవరో ప్రయోగము చేసిరన్న భ్రాంతి వలన మేళమునకు నాథుఁడైన వృద్ధ బ్రాహ్మణుఁడు దిగ్బంధము చేసెను. అప్పుడే కృష్ణవేషము వచ్చెను. సుందరేశ్వరునిచూపు చల్లపడి గందరగోళ మంతయుఁ దగ్గిపోయెను. తెల్లవారెను. వచ్చిన కృష్ణునియెడల సత్యభామ సమాదరము చూపుచున్న ధ్వనులు మఱల లోనికి వచ్చినవి. ఏకవీర కనులు ద్వారమం దున్నవి. అందు వీరభూపతి నిలుచున్నాఁడు. వారిద్దరొకరివంక నొకరు చూచుకొనుచున్నారు. నాఁటి కాఱేండ్లక్రిందట నంబా సముద్రమునకు వీరభూపతి వెళ్ళినప్పు డామె తండ్రి యంతః పురమున గవాక్షమునుండి ఏకవీర చూపులును వీరభూపతి

చూపులతోఁ గలసిన నిమేషమునకు, నాఁటేండ్లతరువాతఁ జెప్ప రానన్ని మార్పులు జరిగి యిప్పు డొకరి కొకరు తెలియకుండ నాకస్మికముగా మఱలఁ జూపులు కలసిన యీ నిమేషము నకు, వారి యిర్వుర మనస్సులలో వ్యవధి లేనట్లు తోఁచెను. ఇరువురును దా మొకరి నొకరు తక్క నింకొకఁ డేమియు నా సమయమునఁ జూడలేదు; ఊహించలేదు. శరీరములతోఁబాటు మనస్సులతో నాత్మలతో వా రిరువు రా స్థలమునకే, యా భావమునకే సంలగ్నింపఁబడిరి. ఆమె యిప్పుడు కోటలో బంధింపఁబడిలేదు. ఇతడు వీథియందు నిలఁబడి చేయునది లేక కాదు. వారి యిర్వురి యీ సంయోగ మెట్లు గలిగిన దన్న ప్రశ్న రాలేదు. ఆమె యచ్చట, నతఁ డచ్చట, నేల యున్నా రన్న యూహ పోలేదు. వీరభూపతి పరిష్వంగార్థము దగ్గర దగ్గరకు వచ్చుచుండెను. ఏకవీర చేతులు చాఁచుకొని నిలంబడి నది.

ఆమె యొడలెల్ల చెమ్మట పోసెను.

సవ్వడి లేక వీరభూపతి వేయు నడుగు లొక్కటొకటి యేకవీర కామె ప్రాణములమీఁద వేయుచున్నట్లుండెను. ఆమె యొడలంతయు స్తంభించెను.

వీరభూపతి కౌఁగిలించుకొఁ దగినంత దగ్గరకు వచ్చెను. ఆమె పాదములక్రింద భూమి యల్లలనాడెను. ఆమె నిలువునఁ బులకించినది.

అతఁ డామె చేతులు తన చేతులతోఁ దాఁకెను. ఆమె దేహముమీఁది కొక విద్యుత్ప్రవాహము ప్రవహించెను. ఆమె యొడ లంతయుఁ గదలిపోయెను.

అతని చేతు లామె దేహముచుట్టుఁ జుట్టుకొనెను. అంతవఱకు వినవచ్చిన యతని నిశ్వాసవాయువుయొక్క మనోహర మృదుస్వానము వినఁబడలేదు. ఆ నిశ్వాసవాయువు లోకము పూవులన్నియుఁ బూచిన వనమునుండి మందమారుతమువలె నామె ఘ్రాణేంద్రియముఁ జూఱగొనెను. ఆమె చక్షుస్సు లతని చక్షుస్సులే చూచుచుండెను. ఆమె కన్నులలో వైవర్ణ్య ముదయించెను. ఆమె త్వగింద్రియము చర్మదఘ్నముగా శిశిరాతిశిశిర మయ్యెను.

అతఁ డామె నెమఱొమ్మున కాన్చుకొనినాఁడు. ఆమె నేత్రములు తెఱచుకొనియుండియు నతనివంకఁ జూచుట లేదు. వానికిఁ జూచునట్టి గుణము పోయినది. కన్నులనిండ నశ్రువులు నిండియుండెను. అతని యీ కౌఁగిలింతలోని చల్లదన మామెరక్తములోఁ బ్రవేశించెను. ఆమెకు 'భూమధ్యరేఖా' ప్రాంతస్థుని నుత్తరధ్రువ సమీపమున కొక్కసారి కొనిపోయి నట్లయ్యెను.

అతఁ డామెను గాఢాతిగాఢముగాఁ గౌఁగిలించుకొనెను. ఆమె ఘ్రాణేంద్రియమున కతని నిశ్వాసపరిమళ మనుభవించు శక్తిపోయినది. గట్టిగాఁ గౌగిలించుకొనుటచేత నామె హృదయమునుండి ధ్వనిరీతి వచ్చినగాలి యామెకంఠమందు స్తంభించి పోయెను. అతని యీ కౌఁగిలింతలోని చల్లదన మామెలో నరమునరమున వ్యాపించినది. ఆమెహృదయములోని సర్వనాళములు నా మహాస్పర్శసుఖ మనుభవించినవి.

అతఁ డామె పెదవిపై నొక్క ముద్దిడెను. ఆమె జిహ్వేంద్రియ మా ముద్దురుచి తెలిసికొనలేదు. అతనిస్పర్శ

యీ పారి యీమెలోని యస్తిత్వమునకు గూడ దాఁకినది. ఆమెకు హృదయసంచలనమునందు మాత్రమే స్థితి. తక్కిన సర్వాంగములయందుఁ గ్రియ యుండదు. చక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణేంద్రియజ్ఞానమంతయుఁ ద్వగింద్రియమందు లీనమయి యీ స్పర్శగుణము మతికాంతసూర్యాకారమై 'యీమె' యను పదార్థవాచ్యమైన సర్వమునందు నిండినది మంచుగడ్డను గాఁగిలించుకొన్నట్లుగాఁ జైతన్యపువేడి కానరాని యీమె కౌఁగిలి వీరభూపతి కప్పుడు తెలిసినది. వెంటనే యతనికిఁ బ్రబోధము కలిగినది. ప్రబోధము వెంటఁ బ్రపంచమంతయు గోచరించినది. తాను స్థానాపతి. ఆమె తా నాజేండ్లకుఁ బూర్వము ప్రేమించిన యువతి. ఆమె పేరు తనకుఁ దెలియదు. ఆమె యిచ్చట నెందుల కున్నదో తనకుఁ దెలియదు. తాను జేసినతప్పు సర్వము తత్క్షణమాత్రమే మనస్సులో స్ఫురించెను. అతఁడు దిగ్భ్రాంతి పొందెను. ఆ వెనుకటి నిముసమున మహానందము; మఱునిముసమున మహాసంశయావస్థ. ఆమెలోఁ బ్రాణమున్నట్లు లేదు. ఆమె మూర్ఛపోయినదా? గతించినదా? వీరభూపతి తొందర పడెను.

బయట నాటకము చివరకు వచ్చినది. మీనాక్షి వెనుదిరిగి చూచెను. వెనుక నేకవీర లేదు. పరుగెత్తుకొని మేడమీఁదికి వచ్చెను. ఆమె గదిలోనను లేదు. క్రిందకు మజల దిగఁబోయి, యుయినఁ జూతమని వెంకవగదిలోనికిఁ బోయెను. నేలఁబడియున్న యేకవీర; ఆమె వద్ద విషణ్ణుఁడై యున్న తనపతి. ఏకవీరలో మీనాక్షి తనపతి పూర్వప్రణ

యినీ రూపము గుర్తించినది. కాని తన పతికిఁ జెప్పలేదు. ఈ దృశ్యముచూచి యామె మనస్సు పరిపరివిధములఁ బోయినది.

వీరభూపతి యామెనుచూచినవెంటనే వచ్చియతిదీనుఁడై జరిగిన సర్వము నామెకు నివేదించెను అసంభవమైనది యతని మాటలలోనను, నయథార్థమైనది యతని మొగములోనను నేమియుఁ గనంబడలేదు. మీనాక్షి పోయి యేకవీరను బ్రబోధించు బ్రయత్నములు చేసినది. ఆమె స్పర్శ వలన నామెకు మఱల హృదయమునుండి వేడినెత్తురు నరములలో నెత్తురులోఁ బ్రవహించెను. చర్మమునకు వేడిమి వచ్చెను. నిశ్వాసమాడెను. కన్నులు తెరువుడు పడెను. చెవులకు శబ్దము వినవచ్చెను, సర్వేంద్రియజ్ఞానము కలిగెను. ఆమె మనస్సు సహస్రధా పరుగెత్తెను. ఆమె తొందరలో లేచి లజ్జావనతవదనయై మీనాక్షి వెనుక నిలంబడెను. వెన్నెలలో దీపముదగ్గర నొకవస్తువునకు రెండు నీడ లుండును. దీపపుఁ జక్కని నీడ, వెన్నెల పలుచని నీడ. వీరభూపతికి వారిద్ద రాతని కా రెండునీడలు. మీనాక్షి దీపపునీడ, ఏకవీర వెన్నెల నీడ. బయట నాటక మయిపోయినది.

౨౨

దిగ్భ్రాంతులయి యట్లే మువ్వురును నరగడియసేపు నిలుచుండిరి. ప్రతివిలిస్త్రయు నేకవీరావీరభూపతులకు నొక మహాయుగమంత భారముగా నుండెను. వీరభూపతి యెవ్వరో యేకవీరకుఁ గొంచె మర్థమయినది. కాని నిశ్చయము కాలేదు. వీరభూపతి కేగోడును దెలియలేదు. కొంతసేపటి కతఁడు మాట పెగుల్చుకొని మీనాక్షినిఁ బ్రశ్నింపఁబోయెను, మాట

రాలేదు. మీనాక్షి యతని యభిప్రాయము తెలిసికొని యామె కుట్టాన్ సేతుపతి భార్య యని చెప్పినది. వీరభూపతి మీఁదఁ బిడుగుపడినట్లయ్యెను. నిలుచున్నవాఁడు పెద్దపెట్టున కేకవేసి నేలఁ జదికిలఁబడి 'అయ్యయ్యో!' అని తలవంచుకొని కుడియరచేతితో మాడుపట్టున మోదుకొనెను. ఆ మఱు నిముసమున నాతనికి స్మృతి లేదు. ఈ సంఘటనము వలన నేకవీరకు సర్వ మవగత మయ్యెను. మీనాక్షి పైగా విప్పి చెప్పెను. "ఈయనయే నా పతి, స్థానాపతి, కుట్టాన్ మహారాజు ప్రాణస్నేహితుఁడు. ఏకవీరా! ఇది విచిత్ర సంయోగము. నీ వివాహమునకుఁ బూర్వము నీ వీతనిని, నా వివాహమునకుఁ బూర్వము నేను కుట్టానును ప్రేమించితిమి. వారు మనలను ప్రేమించిరి. దైవసంఘటనము వ్యత్యస్తఫలిత మైనది. వా రిద్దరుఁ బరమమిత్రులైరి. నేను బరమమిత్రుని భార్య నగుట తెలిసి నీ భర్త తన ప్రేమబంధము కోసివేసి నాయందు సోదరీ ప్రేమ నిలిపినాఁడు. నేను మీ యింటికి రాకపోకలకుఁ గారణ మిదియే. పాప మా కుట్టాన్ నాఁడుగా నీయందలి ప్రేమచేఁ బరిభ్రమించుచున్నాఁడు. కాని రాచకార్యము లతనిని నీనుండి దూరము చేసినవి. ప్రేమోద్వేగి యగు నతఁడు నేఁడువచ్చునో, ఱేపు వచ్చునో! ఉదయన్ సేతుపతిగారు రామనాథమునకు బయలుదేరి నాల్గునాళ్ళయినది. నీ యంతఃపురవర్తనము, వీర భూపతికి నీదగు కుట్టాన్ భార్యాత్వము తెలియనీయలే దిన్ని సంవత్సరములు. నేటిరాత్రి యీ విచిత్రసంయోగము. నీవింత యుద్వేగ్రపడనాయినివి."

ఈ చివరమాట లేకవీరకు వినంబడలేదు, తన మొదలఁ

గుట్టాన్ ప్రేమచలితుఁడని వినఁ్నప్పుడు, అతఁడు నేఁడో తేపో వచ్చు నన్నప్పుడు నామెనేత్రములలో నొక విచిత్రసంచల నము కలిగినది. మీనాక్షి మాటాడుచునే యున్నది. ఏకవీర త్రాఁచుపాముపలెఁ జరచర మేడదిగిపోయి కల్యాణమంటప మున కెదురుగా నిలుచున్నది. భాగవతు లందఱు వెడలి పోయిరి. జనము సవ్వడి పదింటికిఁ దొమ్మిదివంతులు తగ్గెను. స్వామినిఁ గదల్చుటకుఁ బూజారులు ప్రయత్నము చేయు చున్నారు. ఏకవీర తూర్పుదిక్కునఁ జూచెను. సూర్యభగవానుఁ డెఱ్ఱని నిప్పులు గ్రక్కుచున్నాఁడు. ఏకవీరకు భయమై కనులు మూసికొన్నది. తనదేహమందుఁ బ్రత్యణువునందు వీరభూపతి స్పర్శసుఖచిహ్నములు ముద్రితములైనట్లు తోఁచిన దామెకు. కనులు తెఱచినది. ఎదురుగా గుఱ్ఱపువాళ్ల పిల్ల యమృతము నిలుచున్నది. చింపిరిజుట్టు, మాసిన పరికిణీ. చొక్కా లేదు. దాని కన్ను లెఱ్ఱగా నున్నవి. ఇంతకుముందా తూరుపుదూరాలఁ దోఁచిన సూర్యబింబ మీపిల్లగాఁదనదగ్గఱకు వచ్చినట్లున్న దామెకు. ఆమె నిలువెల్లఁ జలించిపోయినది. కనులు మూసికొన్నది. సూర్యబింబ మొకకంటికిను, నా పిల్ల యొకకంటికిఁ గనంబడిరి. వారిద్దరు తన దేహమునందుఁ బ్రవే శించినట్లుయిరి. ఆమె కన్నులు గిఱ్ఱునఁ దిరిగినవి. ఓర్చుకో లేక కన్నులు తెఱచి తూర్పువంకఁ జూడక, యమృత మున్న యెడఁ జూడక సుందరేశ్వరునివంకఁ జూచెను. చాలనాళ్ళుగా దేవుని కొక సంకల్ప మున్నది. ఆనాఁటి నాటకప్రదర్శనము వలన స్వామి యా సంకల్ప ముత్తేజితమైనది. స్వామి కనులు సంకల్ప వికల్పములు సహస్రముఖముల విజృంభించు మనస్సు

నకై ప్రతీక్షించుచుండెను. ఆ సమయమున నేకవీర మనస్సున సంకల్పవికల్పములు శతసహస్రముఖముల విజృంభించుచుండెను. ఏకవీర కనులు భగవంతుని కన్నులతోఁ గలసెను. స్వామి యా చూపువెంట నామెలోఁ బ్రవేశించెను. ఏకవీర భగవంతుని ప్రవేశభారమున తాఁగలేక మూర్ఛపోయి పడి. స్వామివిగ్రహము పూజారు లచటనుండి కదల్ప లేక పోయిరి.

రాబర్టు నోబిలి యను నొకపోర్చుగీసు క్రైస్తవ మతవ్యాపకుఁడు సన్న్యాసివేషము వేసికొని తత్త్వబోధక స్వామి యని పేరుపెట్టుకొని పరిబోధితులుగాని సామాన్యులను మతాంతరులఁ జేయుచున్నాఁడు. విగ్రహారాధన దూషించుచున్నాఁడు. నాలుగేండ్లుగా నతని యీ పని భగవంతుఁడు హర్షించినాఁడు. నేటి కితని ప్రాబల్యము మితిమీఱుచున్నది. వాని పని అపుచేయ వలెనని చొక్కనాథశివుని యాజ్ఞ. ఏకవీరలో స్వామియాజ్ఞ వినఁబడినది. ఆమె లేచి నిలంబడినది. స్వామి కదలినాఁడు. జన మపుడే చుట్టును మూఁగిరి. వార్త పురమెల్ల వ్యాపించెను. అంతఃపురస్త్రీ; అప్సరస; మేలిముసుఁగులేక దేవునివెంటఁ బోవుచుండెను. జను లామె సౌందర్యమునకు, నామె కన్నులలోని యగాధత్వమునకు మెచ్చుకొనుచుండిరి. భయపడుచు నుండిరి. అందఱును జొక్కనాథశివుని యాలయము ముందున కేఁగిరి. స్వామికల్యాణమున కచ్చటఁ బెద్దపందిరి వేయఁబడెను. ఏకవీర యచట నిలుచున్నది. స్వామి వాహకులు నిలువఁబడిరి. జనము దూరముగాఁ గ్రిక్కిరిసి పోవుచుండిరి, జాముప్రొద్దెక్కెను. వీరభద్రభట్టరు, నతని

వెంట నలుగురు దాసీలును వచ్చి యేకవీరకు నమస్కారము చేసిరి. ఆమె మాటాడలేదు, దాసీలు 'అమ్మా! ఇదియేమి? పోదము రమ్మ'నిరి. ఆమె యింకొక దిక్కునకుఁ జూచెను. మీనాక్షి వచ్చెను. ఏకవీర "నింటికి పోదము రా. అంతఃపురస్త్రీ లిట్లు వత్తురా? ఇదియేమి యాగమమ్మా" యనెను. ఏకవీర భ్రూభంగము చేసెను. ఆమె నెవ్వరును బలవంతముగాఁ లాగుకొనిపోఁ బ్రయత్నించలేదు. ఆమె యెవ్వరికోసమో యెదురు చూచుచున్నట్లుండెను.

ఎవరో రాజస్త్రీ యంతఃపురము వదలివచ్చి పిచ్చి యెక్కిన దానివలె బజారులవెంటఁ బోవుచున్న దన్న వార్త నోబిలికిఁ దెలిసినది. తనమతములోఁ గలసిన యిద్దరు ముగ్గురు శిష్యులను వెంటఁబెట్టుకొని వలలోఁ బిట్ట పడినదని తెలిసిన వేటకానివలెఁ బరుగెత్తుకొని వచ్చెను. పగలు రెండుజాములైనది. చొక్కనాథ సుందరశివుని కంటిమంట భగ్గుని మండిపోవుచుండెను. నోబిలి జనమును ద్రోసికొని లోనికి వచ్చినాఁడు. ఏకవీర కన్నులు విచ్చి చూచెను. నోబిలి యా చూపాఁగలేక పోయెను.

ఏకవీర మందహాసము చేసినది. నోబిలి నిలువఁద్రొక్కుకొనెను.

జనము నిశ్శబ్దమైనది. సూది పడిన ధ్వని వినంబడుచున్నది,

*　　　*　　　*

తరువాత నేకవీరకు నోబిలికి వాగ్వాదము జరిగెను,

అందులో నోబిలి సిద్ధాంతము లేకవీర ఖండించి తన మతమును నిలఁబెట్టుకొనెను.

*　　　౭　　　*

చివర కేకవీర యిట్లు తన వాదమును ముగించెను.

ప్రతిదేశములోనను జనసామాన్య ముండురు. సంఘము న నుచ్చస్థాన మాక్రమించువారు నుందురు. అందఱకు వివేకము సమానముగా నుండదు. ఏ దేశమందైనను జన సామాన్యమునకు మత సారస్వతాది విషయములలో విశేషము తెలియదు. వారి కెవఁ డేమాట చెప్పిన నదియే వేదము. విద్యగల యొక సంఘభాగమునఁగూడ మూఢు లుందురు. వారిని నీ మతములోనికిఁ ద్రిప్పి నీ భుజములు చట్టలు పొంగ నక్కఱ లేదు. ఇంకొక సంగతి జెప్పెదను వినుము. బుద్ధి యెవనిసొమ్ము? వేళను బట్టి యొకనిబుద్ధి పనిచేయదు. ఒక మందబుద్ధియే సంతోష వేళ లోకములు జయించినవానివలె మాట్లాడును. అర్జునుఁడంత మహావీరుఁ డొక సమయమున కర్ణునిఁ జూచి బెదరినాఁడు. అది వేళావిశేషము. వాదమునకు, బై వాద మెప్పుడు నున్నది. తీవ్రతరవాది వచ్చినపుడు లొంగి పోవు సిద్ధాంతములు ప్రతిపాదించక యేమి, ప్రతిపాదించక యేమి? లోకమందరు మూఢులై యొక నీచమత మవలంబింతు రనుము. ఆ మత ముండి యేమి? లేక యేమి? నే డొక వంద మంది నీమతస్థులైరి. రేపు నీ తలఁదన్నినవానిమాటచే వారు వానిమత మవలంబింతురు. ఇది వృథాప్రయాస. మహావిజ్ఞాన ఖని తన మోక్షము తాను సాధించుకొనును. సనాతనధర్మము యుగముల తరబడి నిలిచినది. నీ మత ప్రాబల్యము బౌద్ధమత

ప్రాబల్యముతోఁ బోల్చుకొమ్ము. దానిని గోటఁ జిదిమినాఁడు శంకరుఁడు. ఈ దేశమున నే యితర మతమైనను నింతియే. తొలి నాఁడు ఉత్తరమునఁ జైతన్య మీరాబాయి ప్రభృతులు, పడమట రామదాసు శివాజీ ప్రభృతులు, తూర్పున విద్యారణ్యులు నుదయించి శివునకుఁ బ్రీతిచేసిరి. మీ రింక నీమత మిట్లే ఘోషింతురా, మీకుఁ దగినవారు మీకు నుదయింతురు. అవి వేరుల యందలి దోషకదేశఫలితమువలన లోకవంచనముగాక బ్రహ్మప్రీతి లేదు. భగవద్గీత చదువుకొనుము. "యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహామ్." ఆమె గొంతు చివరకు రాను రాను బెద్దదైనది. కనులు నిప్పులు గ్రక్కెను. నిలువెల్లఁ గదలిపోయెను. 'సృజా మ్యహాం' అని విలుచుకొని పడిపోయెను. ప్రొద్దు గ్రుంకుచుండెను. దాసీలు, వీరభద్ర భట్టును, మీనాక్షియు నామె నింటికిఁ దీసికొనిపోయిరి. ఊరిలోని సగముజన మచ్చటనుండెను. ప్రొద్దుటినుండి యెవరికిని భోజనము లేదు. డి నోబిలి యచ్చట నిలువలేకపోయెను. జనుల నిందావాక్యములు వినలేక తలవంచుకొని యావలకు పోయెను. అతఁడు గతించిన నాలుగేండ్లుగా నిర్మించిన సౌధ మానాటితో నేలకూలెను. అతని శిష్యులు తలా యొకత్రోవ బట్టిరి. జనులు సంజచీకటులలో నొకరి నొకరు త్రోసికొనుచు నిండ్లకుఁ బోయిరి. భర్త జీవితము సుఖపడునవలె నని తల్లి జేర్పించిన దోకవీర చమువు శ్రీ సుందరచొక్కనాథశివుని కృప తోగపడినది.

## ౨౩

ఏకవీర మఱునాఁడు ప్రొద్దు తిరిగి నిదుర లేచినది. ఆమెకు వెంటనే స్మృతికి వచ్చినసంగతి వీరభూపతికౌఁగిలింత. ఆ పరిష్వంగపారవశ్యముపోయి దానిలో నున్న యొకమహానుభూతి యామె సర్వావయవములయందు రక్తనాళములయందు వ్యాపించినట్లే యున్నదామెకు. రెండవది విపరీతమైన యాఁకలి. ఆ వెనుక టిదిన మేమిజరిగెనో యామెకు స్మృతిలేదు. పరిచారికలు వేన్నీళ్ళుపెట్టి తలంటి సుగంధద్రవ్యము లలంది స్నానము చేయించిరి. దీర్ఘమైన యామె కేశపాశము దులిపి యగురుధూపములు [illegible]రి. ఒడలినిండ సువాసనాద్రవ్యములు పూసిరి. జరియంచు పూవులుగల తెలిపట్టు చీరఁ గట్టిరి. సుకుమారములు తేలికలైనవి, మధురములైన పదార్థము లారగింపించిరి. ఒడల నగలు కొద్దిగా నలంకరించిరి. ఇంతలో నొకసేవకుఁడు పరుగెత్తుకొనివచ్చి కుట్టాన్ సేతుపతి మహారాజు వచ్చుచున్నాఁడని యీ పాటికి నగరద్వారము చేరియుండు ననీ, తన ప్రేమచిహ్నము దీర్ఘరమణీయాష్టాపదదామము భార్యకుఁ బంపెనని తా నామెను చూచునపు డది యామె ధరించియుండవలయు నని చెప్పి గోదుమవన్నె త్రాఁచువలె దళతళలాడు నా నగ నిచ్చెను. ఒక పరిచారిక తా నది యందికొని యేకవీరమెడలో వైచెను. ఏకవీర వలదనలేదు. ఆమె మొగమున నంగీకారము లేదు. ఆ హార మామెకాంచీప్రదేశమువఱకు వ్రేలాడెను. ఆసూత్రము రైకలేనిచోట మెడమీఁద దగిలి యామెకు విషలిప్తమైన పన్నగనిశితవాదర యంటుకొన్నట్లయినది. ఆమె తాళలేక

దొడ్డిలోనికిఁబోయి, తక్కినయాకులు కోయఁబడి సన్నని, తెల్లని విరిసిన మొవ్వాకుల యరఁటిబోదె మొదల నిలుచుండెను. ప్రొద్దు మూఁడుజాములు దాఁటినది. ఆమె యటనుండి కదల లేదు. పరిచారిక లొకరిద్దఱామెను బలుకరించుటకు భయపడి పోయిరి.

నురుగులు గ్రక్కుచున్న గుఱ్ఱములు గల రథమునుండి కుట్టాన్ దిగెను. స్నానము చేసెను. స్నానము చేసినంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించెను. దాసీ లేకవీర నిన్నటికథ చెప్పిరి. అతఁడాశ్చర్యపోయెను. అల్పాహారము తీసికొనెను. తీసికొనినంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించుచుండెను. ఏకవీర యంతఃపురమును వదలి యల్లెఁగుట యెట్లున్న దన్న దొకదాసి. కుట్టాన్ సమాధానము చెప్పలేదు. అతనియొదలో నేకవీర దేవతామూర్తి యనుకొని పసుపు పచ్చని సన్నని పట్టుదోవతి, బూదిరంగు జరీ ప్రాన్తాల పసుపుపచ్చని పట్టుత్తరీయమును ధరించెను. తలకు ఘమఘుమలాడు మందార నూనె రాచెను. కర్పూరపుఁ దావులు చిమ్ము తాంబూలము సేవించెను. ఇంతసేపు ఏకవీరనుగూర్చియే ప్రశ్నించుచుండెను. ఒకదాసి ఏకవీర చదువు కంద ఆశ్చర్యపడి రనెను. కుట్టాన్ మనస్సులోఁ బ్రేమప్రవాహము కట్టలు తెగిపోయెను. ప్రొద్దు మూఁడుజాములు దాఁటినది. కుట్టాన్ ఏకవీరను జూచుట కామె గదిలోనికిఁ బోయెను. ఆమె యచ్చట లేదు. ఒక పరిచారిక దొడ్డిలో నున్నదని చెప్పెను. అచ్చటికిఁ బరుగెత్తుకొని పోయెను.

ఒంటిమొవ్వాకు విరిసిన యరఁటిచెట్టు క్రింద నిలుచున్నది.

యేకవీర. ఆమె మెడలోఁ దాను బంపించిన హారము తళతళ మెఱయుచుండఁగా ఆమె వచ్చుచుండెను. సౌదామనీగర్భమైన నీలమేఘ మలంకరించుకొన్న శరల్లక్ష్మీవలె నామె కుట్టాన్ కన్నులు మిరుమిట్లు గొలిపెను. కుట్టాన్ పరుగునఁ బోయి కౌఁగిలించుకోవలె ననుకొనెను. ఏకవీర మొగము వివర్ణమై యున్నది. కుట్టా నామెను సముత్సాహపఱుప నెంచి నవ్వెను. ఏకవీర మొగము వికృతమయ్యెను. కుట్టా నామెను సమీపించెను. ఆమె వెనుక వెనుకకుఁ బోయెను.

కుట్టాన్ కన్నులలోఁ బ్రేమ కురిసినది. ఆమె కన్నులలో భయము విరిసినది. కుట్టాన్ మాటాడుద మనుకొన్నాఁడు. ఆమె పరాంగనకాదు. ఇదివఱకే తన్నుఁ బ్రేమించినది. తాను ప్రేమించలేక పోయినాఁడు. ఇప్పుడా ప్రేమ మునరుకొని వచ్చినది. 'బాగుంగ నున్నావా? ఏమి చేయుచుంటివి?' మొదలగు ప్రశ్నలకుఁ దావు లేదు. తన ప్రేమకూడగిన దొక్కటియే. అది యొక గాఢ పరిష్వంగమే. తాను మాటాడలేకపోయినాఁడు. అతని కన్నుల వెంట నీరు గిఱ్ఱున దిరిగెను. గొంతుకలో గాద్గద్య మేర్పడెను. ఏకవీర యతని నాఁగు మన్నది. అతఁ డొక యడుగు ముందునకు వేసెను. ఏకవీర యేడ్చినది. కుట్టాన్ నిలిచిపోయెను. ఏకవీర యేడ్చినది. కుట్టాన్ మఱల నొక యడుగు వేసెను. ఆమె తనన్నుఁ దాకవలదన్నది. తాకినచోఁ జచ్చిపోయెద నన్నది. ఆమాటలు కుట్టానునకు వినిపించలేదు.

అతనిగొంతుక విడివడెను. ప్రశ్నమీఁదఁ బ్రశ్నగా నొక లక్ష ప్రశ్న లతనినోట వెలువడెను. "ఇంకా చదు వెప్పుడు

నేర్చితివి? క్రైస్తవసన్యాసి నీముందు నోరు మెదపలేక పోయెనఁటకదా? అంతఃపురము వదలిపోవుట కెట్లు సాహసించితివి? నిన్ను సుందరేశ్వరుఁ డేమైనఁ బూనెనా? నేను నిన్నునైన వచ్చుతినిగాదు. వచ్చినచో నీ విజయమున కెంతో సంతోషించి యుందును!" మఱల నింకొకరీతి ప్రసంగము చేసెను. "ఇన్నాళ్ళుగా నిన్నుఁ బ్రేమింపఁజాలనందుకు క్షమించుము. దానికిఁ గారణము నీకుఁ జెప్పితిని. ఆకారణము నాల్గు నెలల క్రిందనే కారణము కాకుండఁబోయెను. దుర్బుద్ధి నన్ను మధురనుండి తఱిమినది. హఠాత్తుగా నిన్నుఁ గలసికొని పొందు మహానందమునందలి యాశ నీకు నాచేత నుత్తరము వ్రాయించలేదు. నా మిత్రుఁడు వీరభూపతి భార్య మీనాక్షి" అని కుట్టాన్ మొదలు పెట్టగనే యేకవీర పారిపోఁజొచ్చెను. ఆమె వీధివాకిలి దాఁటి హజారము దాఁటిపోయెను. కుట్టా నామెవెంటఁ బరుగెత్తెను. అరజాము ప్రొద్దుండెను. వీధిలోనికి వచ్చి యేకవీర తలయెత్తి చూచెను. మీనాక్షీదేవి దేవాలయ శిఖరపు బంగారపుతొడుగు ఎండలో ధగధగ మండిపోవు చుండెను. ఇంతలోఁ గుట్టాన్ ఏకవీరను గలసికొనెను.

కుట్టాన్:—ఎక్కడకుఁ బోవుచుంటివి?

ఏకవీర:—వైగైనదికి.

కుట్టాన్:—ఎందుకు?

ఏకవీర:—నా గుండెల మహాఘమున్నది. అది కడిగి వేయుటకు.

గుఱ్ఱపువాళ్ళపిల్ల యమృతము దువ్విన తలతోఁ బరికిణీ తో [illegible] బడి వదలిపెట్టి—ఇంటికి

వచ్చుచు 'అరంజేవిరుంబు,' 'అరవదుశినం' అని పిచ్చిపిచ్చిగాఁ బాడుకొనుచు వచ్చుచుండెను. ఆమె యేకవీరను చూచి భయపడి పాఱిపోయెను. ఏకవీర మఱలఁ బరుగెత్తెను. కుట్టాన్ వెంబడించెను. నైఁగై చూపుమేరలో నిలచెను. కుట్టానున కేకవీరకు మధ్య వందగజముల దూరముండెను. ఏకవీర గాలిపొరవలె సెగిరిపోవుచున్నది. కుట్టాన్ పర్వతమువలెఁ గదలలేకుండెను. ఏకవీర కెదురుగా నొక సన్యాసి వచ్చు చుండెను. ఏకవీర యతనిఁజూచి నిలువునఁ గంపించిపోయి కన్నులు రెండు చేతులతో మూసికొనెను. సన్యాసి యామె వంకనైనఁ జూడలేదు. ఆమె యున్నయెడ దాఁటి సన్యాసి నెమ్మదిగాఁ గుట్టాన్ దగ్గరకు వచ్చుచుండెను. కుట్టాన్ చూచెను. ఏకవీర నిలుచున్నది. సన్యాసివంకఁ జూచెను. కుట్టాన్ ఒక మహాశ్చర్యము పొందినట్లు దేహము వెనుకకుఁ గదల్చెను. సన్యాసి తలయెత్తలేదు. కుట్టా నతనిని బలుక రించెను:

కుట్టాన్:—వీరా! ఇది యేమి?

సన్యాసి తలయెత్తెను. ఎదుటఁ గుట్టానును జూచెను. వీరభూపతి కన్నులలో బాష్పము లేర్పడఁబోయి వెనుకకు మఱల్పఁబడెను. కుట్టానున కనేకములగు నూహాలు తోఁచెను. తన మీనాక్షీప్రేమ యితని సన్యాసమునకుఁ గారణమనుకొని,

స్థానాపతీ! క్షమించ లేకపోతివి!'

అనాఁడతఁడు. వీరభూపతి కన్నులలో జాలి పొడ సూపెను.

దూరమున నేకవీర మఱల నడచుచుండెను. కుట్టాన్

వీరభూపతిని వదలి యామెను మతుల ననుసరించెను. ఈ సారి యేకవీర నడువలేకపోయెను. కుట్టాన్ ఏకవీర నందుకొనెను. ఇరువురు గజ మెడముగా వైగై నీటిపొరవద్ద నామెయు నివతల నతఁడు నుండిరి. కుట్టానునకుఁ గోపము వచ్చెను.

కుట్టాన్ :—'అడుగు వైచితివా, నిన్ను బలవంతముగ నీటికిఁ దీసికొని పోదును.

ఏకవీర కదలలేదు. వీరభూపతి, తన ప్రేమ, దాని విచిత్ర పరిణామము, పూసగ్రుచ్చినట్లు చెప్పెను. తన దేహములో నున్న ప్రతియణువు వీరభూపతిస్పర్శ మనుభవించు చున్నదని చెప్పెను. అది యింకొక విజాతీయస్పర్శ తాళుకో లేదనెను. కుట్టాన్ చివరిమాటలు వినలేదు. అతఁ డాలోచనలోఁ బడెను.

పడమట లోకబంధు డస్తమించఁబోవు చున్నాఁడు. విచిత్రముగఁ జీఁకట్లును, ఎఱ్ఱనికాంతులు నొక్కసారి లోకము మీఁదికి వచ్చెను. ఏకవీర మొగము తూర్పునకుఁ దిరిగి యున్నది. కుట్టాన్ పడమటికిఁ దిరిగియున్నాఁడు. ఏకవీర మొగమునఁ జీకట్లు, కుట్టాన్ మొగమున వెలుతురు వ్యాపించి నవి.

కుట్టాన్ చివరకు మాట్లాడెను. 'ఇది యొక విచిత్రకథా మంటపము. దీనికి మనమిద్దరము, మీనాక్షి వీరభూపతులు నాలుగుస్తంభములము.' ఏకవీర యొక్క విచిత్రమైన ప్రశ్న వేసెను. 'మీరు నన్నింకనుఁ బ్రేమింతురా?' ఆమె పెదవుల సందునుండి యొక సన్ననినవ్వు వినంబడెను. తపస్వియైన కుట్టాన్ తా నామెను బ్రేమించుచున్నా నన్నసంగతి చెప్ప

లేదు. అతఁడు ప్రేమచేఁ గదలిపోయెను. ప్రేమప్రవాహ[illegible] [illegible] విరుచుకొని పడినది.

హఠాత్తుగాఁ గుట్టాన్ రెండుచేతుల నామెచేతులను బట్టుకొనెను. అంతవఱకు వినవచ్చుచున్న వైఁగై తరఁగల [illegible]కల సవ్వడి, గాలి రివ్వుమన్నసడి యామెచెవులకు వినంబడ లేదు ఆమె కన్నులు చీఁకట్లను జూచుచుండెను. ఆమె ఘ్రాణేంద్రియమునకు గాలిలో నొక వగరువాసన తోఁచెను ఆమె త్వగింద్రియము చైతన్యరహిత మయ్యెను.

అతఁడామె నెమ్మొగ[illegible] కొనెను. ఆమె నేత్రములలోఁ జూపు తప్పిపోయెను. ఆమె దేహములోని రక్తము ప్రాణవాయువును భరింపలేక పోయినది. ఆ రక్తమంతయు మృత్యుస్పర్శవలనఁ గలుగు శైత్య మలవరించుకొన్నది.

అతఁడామెను గాఢాతిగాఢముగా నొక్కుకొనెను ఆమె నాసారంధ్రములలోని శ్వాసమాడలేదు, ఆమె నో[illegible]ంచెముగాఁ దెలిచుకొనెను. ఆమెలో నాడి నిలచిపోయెను.

అతఁడామె పెదవి తన పెదవితోఁ దాఁకెను. ఆమె హృదయములోఁ బ్రాణవాయువు నిలచిపోయెను.

ఇది యంతయుఁ గన్నుమూసి కన్ను తెఱచునంతలో జరిగెను. కుట్టానునకు ప్రబోధము గలిగెను. తన కౌఁగిలిలో నిర్జీవపదార్థ మతఁడు వెనుకకుఁ ద్రోసెను. అది మహా[illegible] నీటిలోఁబడి చప్పుడయ్యెను.

చీఁకటులు క్రమ్మి [illegible] కప్పుబడిన గతప్రాణివలె వైఁగై తరలిపోయెను.

—సమాప్తి—